మహనీయుల జీవితాల్లో

# మధుర ఘట్టాలు

ఎమ్.డి. సౌజన్య



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

MAHANEEYULA JEEVITĀLLO
MADHURA GHATTALU By M.D Soujanya

ప్రచురణ నెం. : 2237

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : డిశంబరు, 2000



వెల: రూ.70-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ:

# అంకితం



**శ్రీ కె. మధుసూదనరావు**
M.A; B.Ed.

ప్రిన్సిపాల్ - రామా రూరల్ కాలేజి,
చిలుమూరు - ఆం.ప్ర.

# విషయసూచిక

★ ★ ★

మహనీయుల జీవితాల్లో

# మధుర ఘట్టాలు

## గాంధీజీని మెప్పించిన బళ్ళారి రాఘవ

బెంగుళూరులో ఆ రోజు 'రామదాసు' నాటకప్రదర్శన జరుగుతోంది అది హిందీ నాటకం, వ్రాసింది పండిత తారానాథ్ అందులో ఆయన కబీరు వేషం వేశారు

ప్రముఖ రంగస్థల నటుడు, సినిమా నటుడు బళ్ళారి రాఘవ రామదాసు వేషం ధరించారు గాంధీజీ ఏదో సమావేశానికి హాజరు కావటానికి బెంగుళూరు వచ్చివున్నారు

బళ్ళారి రాఘవ నటన విషయం, ఆయన రామదాసు పాత్ర పోషణ తెలిసిన గాంధీజీ, కాసేపు ఆ నాటకం చూసి వెళదామనుకున్నారు

అయితే బళ్ళారి రాఘవ నటన గాంధీజీని మంత్రముగ్ధుణ్ణి చేసింది ఆయన ప్రదర్శనలో తాదాత్మ్యము చెంది, కాలమే మరచిపోయారు

చివరి ఘట్టంలో రామదాసు నటన ఆయనను ఎంత మెప్పించిందంటే, తను ప్రేక్షకుడినని, గాంధీజీ పరిసరాలే మరచి ఒక్కసారిగా 'రాఘవ మహారాజ్ కీ జై' అంటూ లేచి, స్టేజీ మీదకు పరిగెత్తి, రాఘవను అభినందించారు

మహాత్ముడి ప్రశంసలు పొందిన రాఘవ నటుడిగా, అది తనకు లభించిన గొప్ప బహుమతి, ప్రశంస అనుకున్నారు

రాఘవను నటుడిగా చూసి, 'విశ్వకవి' రాగూర్, ప్రపంచ ప్రసిద్ధ నాటక రచయిత జార్జి బెర్నార్డ్ షా ఆయన నటన సహజం, అద్వితీయం అని మెచ్చుకున్నారు

## చిన్నయసూరిమీద 'గిడుగు'వారి అభియోగం

గిడుగు రామమూర్తి పంతులుగారు ఆధునిక తెలుగు వైతాళికులలో, భాషా శాస్త్రవేత్తగా, 'గిడుగు–పిడుగు' అనే పేరు పొందారు పుస్తకాల్లో భాష, మాట్లాడే భాష ఒకటిగా వుండాలని, ఆయన వ్యావహారిక భాషోద్యమం లేవదీశారు. ఆయన ఉద్యమ ఫలితంగానే మనకు పత్రికల్లో. రేడియో, టీ.వీ, సినిమాల్లో వ్యావహారిక భాష వచ్చింది.

చిన్నయసూరి వ్రాసిన 'బాలవ్యాకరణము'– ఇంకా ఆయన గద్యరచనలను గురించి గిడుగు వ్యంగ్యంగా ఏం చెప్పారో చూడండి.

"అధికారానధికార తారతమ్యము లేకుండా, ఆలోచించకుండా, ఆబాల గోపాలం అందరి పిల్లలచేతను, రచనాభ్యాసము చేయించనుద్దేశించి, అందుకు సాధనగా– అసమగ్రము, అనిర్ణాయకము, భ్రమప్రమాదాత్మకమున్ను అయిన ఒక చిన్న వ్యాకరణము ఒకటిన్ని, అస్థలితముకాని చిన్న వచనగ్రంథ మొకటిన్ని రచించి ఇచ్చి సూరిగారు కీర్తిశేషులైనారు

"చిన్నయసూరి చేసిన ఈ పని ఎలా వున్నదంటే– "కొండవీటి సీమలోని నూతుల నుండి, నీళ్ళు తోడి తెచ్చుకొని, వంట చేసుకుని, భోజనము చేయండి" అని బారెడు చేంతాడు – తూట్లుపడ్డ చిన్ని చెంబు ఆకలితో వున్న చిన్నపిల్లల చేతిలో పెట్టి, తల్లిదండ్రులు శ్రీశైలం యాత్రకు పోయినట్లుంది"

ఈ పోలికలోని వ్యంగ్యము–గ్రాంధికభాష నేర్పటానికి చిన్నయసూరి వ్యాకరణము మీద ఆధారపడితే కలిగే ఇబ్బందులు, ఇక్కడ చెప్పక చెబుతున్నాయి.

## వల్లభజోశ్యులవారి ప్రత్యేకత

గుంటూరు హిందు కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేసిన వల్లభజోశ్యుల సుబ్బారావుగారు తెలుగు, ఆంగ్ల, సంస్కృత భాషల్లో మహానిధి.

ఆయన షేక్స్‌పియర్, మిల్టన్, షెల్లీ, కీట్స్ వంటి ఆంగ్లకవులేకాక, తెలుగులోని అన్నిప్రముఖ కావ్యాలు, సంస్కృతంలో కాళిదాసువంటి ప్రముఖుల రచనల్లోని పద్యాలు, శ్లోకాలు, వేల సంఖ్యలో చెప్పగల బహుముఖ ప్రజ్ఞాశాలి.

ఒకసారి ఆయన అమెరికా పర్యటన చేసినప్పుడు "మీ భాషలో ప్రకృతి వర్ణనలు విరివిగా వున్నాయా? మీ హిమాలయాలను గురించి ఏ కవి అయినా వర్ణించారా?" అని ప్రశ్న వేశాడట ఓ రచయిత.

వెంటనే సుబ్బారావు గారు–కాళిదాసు వివిధ ఋతువుల్లో ప్రకృతి వర్ణనలు ఆయన 'ఋతుసంహారం'లో ఎలా చేశాడో చెప్పి, అల్లసాని పెద్దన హిమాలయాలను ఎంత వివరించి వర్ణించాడో ఆంగ్లంలో ఆశువుగా ఓ గంట చెప్పేటప్పటికి, ఆ రచయిత నోరు తెరచి, అలాగే వుండిపోయాడట

తరువాత మరొక ప్రముఖుడు "సుబ్బారావుగారూ! అనేక వందలమంది రచించిన వేల పద్యాలు– మూడు భాషల్లో మీకు కంఠతా వచ్చుగదా? ఇలా గుర్తుపెట్టుకోవటంలో రహస్యమేమిటి?" అన్నాడట.

వెంటనే సుబ్బారావు గారు "మనకు ఏ విషయంలో నిజమైన ఆసక్తి వుంటుందో, ఆ విషయాలన్నీ గుర్తుంటాయి" అన్నారట.

## 'కళాప్రపూర్ణ' పైడి లక్ష్మయ్యగారి 'ప్లండరింగు'

ప్రతివారికీ ఏదో దినచర్య ప్రొద్దుటినుంచి రాత్రిదాకా వుంటుంది.

'కళాప్రపూర్ణ' పైడి లక్ష్మయ్య గారు వ్యంగ్యంగా తమ దినచర్య ఎలా చెప్పారో చూడండి

తన దినచర్య మొత్తం ఒక పద్యంలో హాస్యంగా చెప్పటమే పైడి లక్ష్మయ్య గారి గొప్ప.

ఈ పద్యంలో నిత్యజీవితంలో వాడే తెలుగు, ఆంగ్ల పదాలు చాలా తమాషాగా కలిపి చెప్పటమే మరొక ప్రత్యేకత.

"సిక్సుకు–వేకింగు–సిగరెట్లు స్మోకింగు; టేకింగు, బెడ్ కాఫీ–టీనిగాని, ఫేస్ క్లీన్ షేవింగ్–నైసుగా డ్రెస్సింగు, క్లబ్బుకు గోయింగు–కారునందు, మిడ్డే రిటర్నింగ్, మీల్సును టేకింగు, రెస్టింగ్–రీచింగు రెస్టరెంటు, కార్డుల ప్లేయింగు, కాఫీలు డ్రింకింగు, ఫ్రెండ్సు పాకెట్లను–ప్లండరింగు" (ప్లండరింగు అంటే–దోచుకోవటము)

## జలసూత్రానికి అర్ధచంద్ర ప్రయోగం

నవ్యాంధ్ర సాహిత్యానికి, నాటకరంగానికి, అభ్యుదయ కవులకు ఎంతో స్ఫూర్తి నిచ్చిన ప్రముఖుల్లో ప్రముఖుడు శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారు.

తన సహృదయత, సంభాషణాచాతురి, సరసవాగ్ధోరణి, సాహిత్య పిపాసవల్ల ఆయన అప్పటి యువతరం సాహిత్య కవులు, నటులు, గాయకులతో ఎంతో కలసి మెలసి వుండేవారు

ఆ అబ్బూరి రామకృష్ణారావు గారి కుమారుడే అబ్బూరి వరదరాజేశ్వరావు ఈయన కూడా అన్నివిధాలా తండ్రిస్థాయి వున్న సాహితీ ప్రముఖుడే

ఒకసారి అబ్బూరి వరదారాజేశ్వరావు, జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి కలసి, ఒక తెలుగు సినిమాకు వెళ్ళారు

సినిమా హాలు లోపలికి వెళ్ళేటప్పటికి, అప్పటికే 'ద్రౌపదీ మాన సంరక్షణమో', 'వస్త్రాపహరణమో' తెలియని అయోమయ స్థితిలో పడ్డారు ఇద్దరు

సినిమా కథలో అది కౌరవుల నిండుసభ. ద్రౌపది ప్రవేశిస్తుంది ఆమె చీరె కొంగును దుశ్శాసనుడు పట్టుకొని వున్నాడు

తనకు జరిగిన అవమానాన్ని తన భర్తలు సహించరని చెబుతూ ద్రౌపది "సహింతురా–సహింతురా, రాజ రాజాధిరాజుల్ సహింతురా ?" అంటూ పాడుతున్నది

రుక్మిణీనాధశాస్త్రికి వ్యంగ్యంగా 'పేరడీ' పాడుట అలవాటుగా! పాటను మధ్యకు విరిచి హాస్యధోరణిలో "రమింతురా రమింతురా–రాజాధిరాజుల్" అంటూ పాడటం మొదలుపెట్టాడు

ప్రేక్షకుల్లో కొందరికి కోపం వచ్చింది వాళ్ళు వార్నింగ్ ఇచ్చారు "ద్రౌపది వీళ్ళ పెళ్ళాంకాబోలు" అన్నాడు రుక్మిణీనాధశాస్త్రి ప్రేక్షకులు చివరికి శాస్త్రిని బయటికిగెంటారు

## కాటూరికి హాస్య రచయిత పరామర్శ

మొదట్లో జంటకవులుగా సంచలనం సృష్టించిన 'కాటూరి–పింగళి' వారు వ్రాసింది 'తొలకరి' కావ్యం.

కవులలో ఆ రోజుల్లో సిరిగలవారు కాటూరివారు కానీ ఆయన ఆ సిరిని వెంట పెట్టుకుని తిరగలేదు, అంటిపెట్టుకుని వుండలేదు

ఆయన మాటల్లో ఎప్పుడూ చమత్కారం, వ్యంగ్యం గోచరిస్తూ వుండేవి. అందరినీ ఆయన నవ్విస్తూ వుండేవారు.

ఒకసారి ఒక మిత్రుడు ఆయన్ను "ఏమండీ మాష్టారూ! మీరు సంసారం గురించి ఎక్కువ పట్టించుకోరల్లే వుందే?" అని అడిగాడు

వెంటనే కాటూరివారు "సాహిత్యం మీద మట్టుకు పట్టించుకున్నాను గనుకనా?! నేనేదీ పట్టించుకోవటంలేదు! నన్ను చుట్ట పట్టుకుంది! నేను ఈ చుట్టను పట్టుకున్నానంతే" అన్నారట చేతిలో చుట్ట చూపుతూ

ఒకసారి కాటూరివారికి సుస్తీచేసి ఒక మిత్రుడి ఇంట్లో వున్నారు.

రావూరు సత్యన్నారాయణరావు గారికీ విషయం తెలిసి, వెళ్ళి పరామర్శించి "ఇంటికి కబురు పంపనా?" అన్నారట.

"చాల్చాల్లే! మహోపకారం! ఏదో కళ్ళు మూసుకు పడుకున్నాను నీకు చప్పనాతితనంగా వుందేమిటి? నీకింకా టైముంది" అన్నారట, ప్రముఖ హాస్యరచయితను హాస్యం పట్టిస్తూ.

మిత్రులిద్దరూ ఎంతో ఆనందంగా నవ్వుకున్నారు.

## పింగళి అమ్మగారి కోరిక

బెజవాడలో, ఆంధ్ర నాటక కళాపరిషత్ పెద్ద స్థాయిలో పోటీలు జరిపినప్పుడు, ప్రముఖ నాటక రచయిత, సినీ రచయిత పింగళి నాగేంద్రరావు వ్రాసిన నాటకం 'వింధ్యరాణి'కి ప్రథమ బహుమతి వచ్చింది.

ఆ సందర్భంగా ప్రముఖ హాస్య రచయిత రావూరు వేంకట సత్యన్నారాయణరావుగారి అధ్వర్యములో, పింగళి గారికి ఘనసన్మానం జరిగింది. అప్పుడు కార్యదర్శిగా వున్న రావూరువారే పింగళి గారికి ఒక పెద్ద వెండికప్పు బహూకరించారు.

తరువాత రావూరువారు సినీ రంగానికి రచయితగా వెళ్ళిన సందర్భంగా, మద్రాసులో పింగళివారింటికి వెళ్ళారు. పింగళి గారి అమ్మగారు రావూరువారిని బాగా ఎరిగి వుండటం, బందరులో వున్నప్పటి నుంచి వున్న స్నేహాన్ని పురస్కరించుకుని, "అదేమిటి నాయనా, మావాడికి ఆ గిన్నె ఇచ్చి పంపావు! పప్పులు పోసుకుంటాడా? పాయసాలు పోసుకుంటాడా? ఆ ఇచ్చేదేమిటో ఓ కంచం ఇయ్యకపోయావా? వాడికి పెళ్లి కాలేదు. అయితే అత్తవారు ఇచ్చేవారు ఇప్పుడైనా ఆ వెండికప్పు చెడగొట్టి కంచం చేయించి ఇవ్వు వాడు వెండికంచంలో తింటే చూడాలని వుంది. నువ్వు కూడా వాడి ప్రక్కన కూర్చొని భోజనం చెయ్యి" అన్నారట.

"బహుమతులు మార్చకూడదు బామ్మగారూ! కావాలంటే కంచం చేయించుకుంటాడు లెండి బాగానే సంపాదిస్తున్నాడుగా" అన్నారట రావూరువారు నవ్విస్తూ.

తరువాత పింగళివారు తల్లి కోరిక తీర్చటానికి నిజంగానే వెండిపళ్లెం కొని అందులో భోజనం చేసేవారట.

## జాషువా జీవితంలో విచిత్ర సంఘటనలు

నెల నెలా జీతాలు రాని పరిస్థితి, అధ్యాపక వృత్తిలో అనేక ఇబ్బందులు పడుతున్న జాషువాకు పూట గడవటం కూడా ఎంతో కష్టంగా వుండేది

జాషువా ఆర్థిక పరిస్థితి తెలిసిన శ్రీ ఏకా దండయ్య పంతులు గారు, 25 రూపాయలు మనియార్డరు చేస్తూ, "జాషువా! రాత్రి నాకు దేవుడు కలలో కనపడి, నీకు 25 రూపాయలు పంపమన్నాడు" అంటూ మనియార్డరు ఫారము క్రింద వ్రాసేవారు

అప్పుడు జాషువా "మీ దేవుడు 25 ప్రక్కన సున్న పెట్టమని చెప్పలేదా?" అంటూ చమత్కరిస్తూ జాబు వ్రాసేవారు

జాషువా కవిగా నిలబడటానికి ఎన్నో అడ్డంకులు ఎదుర్కోవలసి వచ్చింది.

ఆ కాలంలో జంటకవులుగా 'తిరుపతి వెంకటకవులు'- 'కోట సోదర కవులు' ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించారు.

ఇదే పద్ధతిలో జాషువా కూడా తన తోటి మిత్రుడు, ప్రముఖ కవి అయిన దీపాల పిచ్చయ్యశాస్త్రితో కలిసి కవిత్వము వ్రాయాలని, అవధానాలు చేయాలని నిర్ణయించుకున్నారు. జంటకవుల పేర్లు కలవాలిగా, అందుకోసం ప్రయత్నించారు

'జాషువా' పేరు ముందు 'పిచ్చయ్య' అని పెడితే 'పిచ్చి జాషువా' అవుతుంది. పోనీ 'జాషువా' తరువాత 'పిచ్చయ్య' అని కలిపితే 'జాషువా పిచ్చయ్య' అవుతుంది

"ఎటు చూసినా జాషువాకే పిచ్చిపట్టేట్టుంది. వద్దులెండి" అంటూ ఆ ప్రయత్నం మానుకున్నారు

## 'చందా ఇస్తేనే నెయ్యి' అన్న 'ముట్నూరి'వారు

ముట్నూరి కృష్ణారావు గారంటే, కృష్ణాపత్రికా సంపాదకులు, దేశసేవాపరాయణులు, సమాజ సేవ లందించిన ఆదర్శమూర్తి మనకు గుర్తొస్తారు

ఆయన ఎంత గంభీరులో, అంతగా ఒక్కొసారి మౌనముద్ర వీడి, హాస్యపు జల్లులు కురిపించేవారు

ఒకసారి కృష్ణాపత్రిక తరఫున కార్తీక సమారాధన ఏర్పాటు చేశారు అందరూ చందా లిచ్చారు ఒక్క వ్యక్తి మాత్రం చందా ఇవ్వకుండా, విందుభోజనానికి వచ్చాడు

ఆ రోజు కృష్ణారావు గారే స్వయంగా వడ్డనకు సిద్ధమయ్యారు

"మీకెందుకు పెద్దవారికి శ్రమ" అంటే, వినకుండా "వయ్యారం చేతగాదుకానీ, వడ్డన మాత్రం వచ్చులెండి" అంటూ, తన పని కొనసాగించారు చందా ఇవ్వని మనిషి పక్కనా తనొక విస్తరి వేయించుకున్నారు ప్రత్యేకించి పప్పు, కూరా ఆ మనిషికి వడ్డించారు. వడ్డన పూర్తిచేసి, ఆ పెద్దమనిషి పక్కనే చేరారు ఆ కూరలో రహస్యంగా కారం బాగా కలిపారు చందా ఇవ్వని పెద్దమనిషి ముద్ద కలుపుకొని నోట్లో పెట్టుకుని "అమ్మో- ఎంత కారమో" అంటూ అరిచాడు

"సోదరా! బాధపడకు. కష్టాలు ఎవరికైనా వస్తాయి! సహించాలి సోదరా, సహించాలి" అన్నారు కృష్ణారావు గారు

"ఏం సహించటమో! చచ్చిపోతున్నాను-నెయ్యి-నెయ్యి" వేయండి అన్నాడాయన గోలపెడుతూ.

"చందా ఇయ్యి-ఇయ్యి - ఊరికే రాదు నెయ్యి" అన్నారు, అసలు విషయం బయట పెడుతూ కృష్ణారావు గారు.

## మనసు 'విచిత్రమైంది' అని చెప్పిన 'కాటూరి'

**జంట** రచయితలుగా మొదట్లో ఎంతో చరిత్ర సృష్టించిన ఆంధ్ర సాహితీ మూర్తులు 'పింగళి-కాటూరి' వారలు

కాటూరి మంచి సహృదయులు విశిష్టమైన వ్యక్తిత్వమున్న వ్యక్తి. అయన ఎంత గొప్ప కవో అంతకు మించిన గొప్ప ధర్మనిష్ఠుడు కూడా!

ఒకరోజు కాటూరివారు పొలాన కుప్పలు నూర్పించి, వడ్లబండ్లతో ఇంటికి తిరిగి వస్తున్నారు. ఇంతలో అక్కడికొచ్చిన ఒక బీద బ్రాహ్మణుడు తాను తన కుమార్తె పెళ్లి సంకల్పించానని, ముహూర్తం నిర్ణయమైందని చెప్పాడు

వెంటనే కాటూరివారు, ఆ బ్రహ్మణుడి రాకకు కారణం అర్థమై, వెనక వస్తున్న బండివాడితో "నీవు ఈ బండి వడ్లను ఈ బ్రాహ్మణుడి ఇంటి దగ్గర దింపిరా! దింపి వచ్చి ఇంటి దగ్గర నాకు కనబడు" అని ఆజ్ఞాపించారు

అప్పుడు కాటూరివారితో వున్న మిత్రుడొకడు "మీరు అడిగినదే తడవుగా వడ్లబండిని మళ్లించివేశారు తరువాత నిదానంగా ఆలోచించి ఇస్తే సరిపోయేదిగా" అన్నాడు.

దానికి కాటూరివారు నవ్వి "ఇప్పుడు పుట్టిన బుద్ధి ఇంకాసేపటికి ఇలాగే నిలుస్తుందని నమ్మకమేమిటి చెప్పండి? ఇప్పుడు బండి ఇద్దామనిపించిన నాకే, కాసేపు ఆగితే ఓ బస్తా ఇస్తే చాలదేమిటి అనిపించవచ్చు.

మంచిపని చేయాలనుకున్నప్పుడు వెంటనే చేయటం మంచిది. మనస్సు విచిత్రమైంది" అన్నారు, తన నిర్ణయాన్ని సమర్థించుకుంటూ.

## లాయరుగా ప్రకాశంగారి ప్రతిభ

అప్పట్లో ఆంగ్ల పాలన వుండటంవల్ల భారతదేశంలో జడ్జీలంతా ఆంగ్లేయులే వుండేవారు

ఒకసారి ప్రకాశం గారి మిత్రుడు ఖాసిం ప్రభుత్వోద్యోగిగా ఒక కేసులో ఇరుక్కున్నాడు. ఖాసిం ప్రభుత్వ కార్యాలయంలో వున్నప్పుడు అతని కుమారుడొచ్చి "నాన్నా! ఈవేళ పరీక్ష వుంది. తెల్లకాగితాలు కొంటానికి డబ్బులివ్వు!" అన్నాడు.

చిల్లర సమయానికి లేక, ఖాసిం రెండు తెల్లకాగితాలు తన ఆఫీసునుంచి ఇచ్చి, కుమారుణ్ణి పరీక్షకు పంపాడు. ఇది చూసిన తెల్లదొర "ఇలా ఎన్నాళ్ళనుంచి ప్రభుత్వ సొమ్ము స్వాహా చేస్తున్నావు? పద- నీ సంగతి కోర్టు తేలుస్తుంది" అంటూ కోర్టులో దొంగతనం కేసు వేశాడు.

ఈ కేసును ఖాసిం తరఫున ప్రకాశం గారు వాదించటానికెళ్ళారు. కేసు నడుస్తుండగా ఇంతలో ఓ వ్యక్తి వచ్చి "ప్రకాశం గారూ! మీకు టెలిగ్రాం వచ్చింది. ఇదిగో" అంటూ ఇచ్చి వెళ్ళాడు.

టెలిగ్రాం చూసిన ప్రకాశం గారు కంగారుగా "మా మేష్టారు హనుమంతరావు నాయుడి గారికి ఆరోగ్యం బొత్తిగా బాగాలేదు అయినా కేసు మధ్యలో రాలేనని టెలిగ్రాం ఇస్తాను త్వరగా ఒక తెల్లకాగితం ఇవ్వండి" అంటూ, ఓ కాగితం జడ్జీనే అడిగాడు. జడ్జి వెంటనే తెల్లకాగితం ఇచ్చాడు

వెంటనే ప్రకాశం "మీరిచ్చిన తెల్లకాగితం ప్రభుత్వానిదేగా! నేను టెలిగ్రాం అనగానే మీరు మరో ఆలోచన లేకుండా, ఓ కాగితం ఇచ్చారు అలాగే ఖాసిం కూడా రెండు కాగితాలు తన కుమారుడి పరీక్ష కోసం ఇచ్చాడు. అది దొంగతనమెలా అవుతుంది?" అన్నాడు

జడ్జి ఖాసిం నిర్దోషని తీర్పు చెప్పాడు.

## గోపాలకృష్ణయ్య గారి 'చాటు' పద్యం

1920లో మహానంది అనే ప్రాంతంలో 'ఆంధ్రమహాసభ' ఏర్పాటు చేశారు. స్వాతంత్ర్య సమరయోధుడు, ఆదర్శ దేశభక్తుడు, మహావక్త

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారిని అక్కడ అధ్యక్షుణ్ణి చేయాలని నిర్ణయించారు.

ఈ విషయం తెలిసిన బందరు పెద్దలు కొందరు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని "సుంకరకొండుడు" అని ఎగతాళి చేశారట.

ఈ సంగతి తెలిసిన గోపాలకృష్ణయ్యగారు, ఆ మహానంది ప్రాంతానికి తానొక శంకరుని అవతారమని- కాబట్టి అధ్యక్షస్థానము వహించటానికి తనకు పూర్తి అర్హతలున్నాయని ఆశువుగా ఓ చాటువు చెప్పి ప్రత్యర్థుల నోళ్లు మూయించారు.

"బింకాలు పలుకు బందరు
కుంకలు, ఘీంకారమెల్ల గేడ్వడసేయన్
శంకరుడె-మహానందికి
సుంకర కొండాయయాయె, చోద్యంబేలా?"

అంటూ చాటువు చదివి, బాది పారేశారు. ఆ మీటింగు పూర్తయ్యేవరకు, ఆయనను ఎగతాళి చేద్దామని వచ్చిన బందరు ప్రముఖులు మళ్ళీ నోరెత్తలేదు.

అంత గొప్ప ప్రతిభాశాలి అల్పాయుష్కుడవటమే జాతి దురదృష్టం

## చిలకమర్తివారి 'పకోడీ' పద్యం

ఆంగ్లకవి, మిల్టన్ మహాకవి గుడ్డివాడయ్యాకే ప్రపంచ సాహిత్యంలో శాశ్వతంగా నిలిచే మహాకావ్యం 'పేరడైజ్ లాస్ట్' (స్వర్గచ్యుతి) వ్రాశాడు

అలాగే మన 'ఆంధ్రా మిల్టన్' చిలకమర్తి లక్ష్మీనరశింహారావు గారు కూడా చాలా మంచి రచనలు చేశారు.

ఒకరోజు చిలకమర్తి వ్రాసిన 'గయోపాఖ్యానం' నాటకం ప్రదర్శించే బృందసభ్యులు ఒకచోట ఏదో సభ ఏర్పాటుచేసి, చర్చించుకోటానికి చేరారు.

నాటక రచయిత చిలకమర్తి ఆ సభకు హాజరయ్యారు

అక్కడే వున్న ఒక సభ్యుడు పకోడీలు తెప్పించి అందరికీ ఇవ్వాలన్నారు. అప్పుడు అక్కడే వున్న ప్రకాశం పంతులుగారు "మీరు పకోడీల మీద పద్యం చెప్పండి పంతులుగారూ!" అన్నారు చిలకమర్తిని

అప్పట్లో ప్రకాశంగారు కూడా నాటకాల్లో నటించేవారు. ప్రకాశం గారంటే చిలకమర్తి వారికెంతో గౌరవం.

"పద్యానికి అక్షరలక్షలిచ్చే కాలం గతించింది! పద్యానికి పకోడీ ఇచ్చే దుర్దినం వచ్చింది! కానివ్వండి" అంటూ చిలకమర్తివారు– "బ్రాహ్మణులు పూర్వం కోడిని తినాలని బ్రహ్మదేవుణ్ణి వేడితే, బ్రహ్మ కోడి బదులు–పకోడిని తినమని చెప్పాడు" అనే అర్ధమొచ్చే పద్యాన్ని చెప్పారు.

"కోడిని దినుటకు, సెలవున్
వేడిరి, మున్ను బ్రాహ్మణులు వేద, నతండున్
కోడి వలదా బదులు, ప
కోడిన్ దినుమనుచు జెప్పె కూర్మి పకోడి"

## ప్రముఖ వక్త సత్యమూర్తి ఇచ్చిన వివరణ

ప్రముఖ దేశభక్తుడూ, మహావక్త, పండితుడూ అయిన సత్యమూర్తి ఇంగ్లీషు పాండిత్యానికి ఇంగ్లాండ్‌లో ప్రొఫెసర్లే నోరు తెరిచేవారు.

తిరునల్వేలి పాఠశాలలో, ఆయన ఒకసారి ఏదో పనిమీద వెళితే, ఆయన ధోవతి, కోటు, జరీ ఉత్తరీయం చూసిన ఓ విద్యార్థి "మిమ్మల్ని ఒక ప్రశ్న వేయాలనుకుంటున్నాను" అంటూ జంకు లేకుండా అడిగాడు

అందుకు సత్యమూర్తి గారు నవ్వి "తప్పకుండా అడుగు బాబూ!" అన్నారు.

అప్పుడా విద్యార్థి "మీరు కాంగ్రెస్ అగ్రనాయకుల్లో ఒకరుగదా! విదేశీ వస్త్రాలు బహిష్కరించాలని మీరు ప్రచారం చేస్తారు మరి ఇంత అందమైన ఫారిన్ కోటు ఎందుకు ధరించినట్టు?" అంటూ ప్రశ్నించాడు

ఈ విద్యార్థి ప్రశ్నకు అక్కడి ప్రొఫెసర్లు, విద్యార్థులు హడలిపోయారు.

తరువాత సత్యమూర్తి, ఆ విద్యార్థిని తన గదికి పిలిచి "చూడు బాబూ! నీ మాటల్ని బట్టి–చెప్పే మాటకు–చేసే చేతకు భేదం వుండకూడదు. నీలా నిర్భయంగా, నీ మనసులో మాట అడగగలిగే ధైర్యవంతులు వుంటే దేశానికి ఎంతో మంచిది. ఇక నా కోటు సంగతి! ఇది నువ్వనుకున్నట్టు విదేశీ వస్త్రాలతో తయారీ అయిన కోటు గాదు ఇది శుద్ధ ఖద్దరుతో తయారైన కోటు ఇది పూర్తిగా ఖద్దరు కోటు" అంటూ కోటు చూపిస్తూ వివరించారు ఆ విద్యార్థి మళ్ళీ మాట్లాడలేదు

## 'మహర్షి' బులుసు సాంబమూర్తిగారి ప్రత్యేకత

'మహర్షి' బులుసు సాంబమూర్తి వంటి దేశభక్తులు, నిరాడంబరులు, గాంధీయ ఆదర్శాలను మనోవాక్కాయ కర్మల్లో నమ్మి ఆచరించిన వారుండరు.

1923లో కాకినాడలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభ సాంబమూర్తిగారి అధ్వర్యంలో జరిగింది

దేశవ్యాప్తంగా మహానాయకులంతా వెల్లువలా వచ్చారు ఏర్పాట్లు బ్రహ్మాండంగా వున్నాయని మెచ్చుకున్నారు. సాంబమూర్తిగారే ఈ ఏర్పాట్లన్నిటికీ మూలపురుషుడని వారు మరింత అభినందించారు.

అయితే అదే సభలో ప్రముఖ నాయకులంతా సాంబమూర్తిగారిని కొనియాడుతుంటే, 'కవికోకిల' సరోజినీ నాయుడు, ఒక విషయం తెలిసి విచారం వ్యక్తం చేశారు

సాంబమూర్తి గారికి ఒక్కడే కుమారుడు అతను సరిగ్గా మహాసభ జరిగే సమయాన మరణించాడు. ఏకైక కుమారుడు కన్ను మూస్తే ఏ కన్నతండ్రి బాధపడకుండా వుండగలడు?

అయితే సాంబమూర్తి గారు బాధను దిగమింగి, కంటతడి పెట్టకుండా, అందరితో కలసిమెలసి, ఆ అఖిల భారత సభను బ్రహ్మాండంగా నిర్వహించారు

ఇది మామూలు మనుషులకు వీలయ్యే పనికాదు పైగా అప్పటికి ఆ మహామనిషి వయసు ముప్పైఏళ్ళు. ఆంధ్ర రాష్ట్రం కోసం ఆత్మార్పణ చేసిన పొట్టి శ్రీరాములు మహర్షి బులుసు సాంబమూర్తి గారింట్లోనే ఆమరణ నిరాహార దీక్ష చేసింది.

## నృత్యానికి బహుమతి ఏనుగుపిల్ల

హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ బహుముఖ ప్రజ్ఞాశాలి ఈయన 'కవికోకిల' సరోజినీ నాయుడు సోదరుడు.

హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ తండ్రి హైదరాబాద్‌లో వున్నప్పుడు ఆయన ఇల్లు ఒక ఆలయం. అక్కడికి అన్ని రంగాలకు చెందిన ప్రముఖులు వచ్చే విశ్వజనీన వాతావరణం వున్న ఇల్లది.

హైదరాబాద్ నిజాం దగ్గర ప్రధానమంత్రిగా వున్న సర్ రాజా కిషన్‌ప్రసాద్ ఒక రోజు హరీంద్రనాధుడి తండ్రి దగ్గరికొచ్చి కూర్చుని మాట్లాడుతున్నారు.

బాలుడైన హరీంద్రుడు ఆడపిల్ల వేషంలో వచ్చి వారిముందు కొన్ని నిముషాలు అద్భుతంగా నృత్యం చేసి వెళ్ళాడు.

ఆ నృత్యం చేసింది నిజంగా ఆడపిల్లేనని ప్రధానమంత్రి కిషన్‌ప్రసాద్ అనుకున్నారు.

తరువాత ఆ నృత్యం చేసింది అఘోరనాధ్ ఛటోపాధ్యాయ గారి అబ్బాయి హరీంద్రనాధ్ ఛటోపాధ్యాయ అని తెలిసి ఆశ్చర్యపడ్డారు. ఆయన ఆనందంపట్టలేక రెండవ రోజు పిల్లవాడు ఆడుకోడానికి బహుమతిగా ఓ గున్న ఏనుగును పంపాడు

అది చూసి బాలుడుగా వున్న హరీంద్రనాధ్ ఛటోపాధ్యాయ ఎంతో సంతోషించాడు అతను మళ్ళీ నృత్యం చేశాడు

కానీ గున్నఏనుగును పెంచటానికయ్యే ఖర్చుతో ఆ బహుమతి అట్టేకాలం నిలువలేదు

హరీంద్రుడు–తరువాత కవిగా, నటుడుగా, చిత్రకారుడుగా, నృత్య కారుడుగా, సంగీతకారుడుగా, 'పద్మవిభూషణు' డయ్యాడు

## తన రాగాలాపనతో వర్షం కురిపించే సంగీతనిధి

పూర్వం అక్బర్ ఆస్థానంలో వున్న తాన్‌సేన్ వర్షం కురిపించటానికి మేఘమల్హార్ రాగం పాడి విజయం సాధించాడనేది అందరూ నమ్మే ఓ కథ.

అయితే సంగీత సమ్రాట్టుగా ప్రసిద్ధిపొందిన ముత్తుస్వామి దీక్షితార్ కూడా తిరునల్వేలి జిల్లాలో తన 'అమృతవర్షిణి' రాగాలాపనతో వర్షం కురిపించాడని సాక్ష్యాలున్నాయి

అయితే 1982లో వర్షాలు పడక మద్రాసు రాష్ట్రమంతా తాగే నీళ్ళులేక ఇబ్బంది పడే పరిస్థితి వచ్చినప్పుడు ప్రముఖ వయొలిన్ విద్వాంసుడు కె వైద్యనాథన్ వర్షం కురిపించిన సంఘటన చరిత్ర సృష్టించింది.

"మీ సంగీత ప్రతిభతో ప్రజల మేలు కోరి వర్షం కురిపించండి" అంటూ రాష్ట్ర ప్రభుత్వం ఆయనను కోరింది.

వైద్యనాథన్, రెడ్ హిల్స్ సరస్సులో నిలబడి పదిహేను రోజులపాటు వివిధ సంగీత రాగాలను వయొలిన్ మీద  ఆలపించి, మొదటి రోజే ఆకాశంలో మబ్బులు వచ్చేట్టు చేశాడు. అదే పట్టుదలతో అయన కృషి చేయగా తొమ్మిదో రోజు కుండపోతగా వర్షం కురిసింది

అయన వర్షం కురిపించటానికి ఆలపించిన రాగాలు–మొదట అమృత వర్షిణి, తరువాత మేఘరంజని, తరువాత వరుణప్రియ అనేవి

ఇప్పటి కాలంలో ఇంత గొప్ప సంగీత కళాకారులుండటం నిజంగా ప్రపంచమే గర్వించదగ్గ విషయం

## స్టాలిన్ కన్నీళ్ళతో వీడ్కోలు చెప్పిన సమయం

1952లో ఉపరాష్ట్రపతి పదవి చేపట్టడానికి డా  రాధకృష్ణన్, రష్యా రాయబార పదవికి స్వస్తి పలికి, స్వదేశం రాబోతున్నారు

రష్యా సాంప్రదాయ ప్రకారం రాయబారు లెవరికీ రష్యాలో వీడ్కోలు చెబుతూ విందు చేయరు.

అయితే రష్యన్లు తమ సాంప్రదాయానికి భిన్నంగా, వీడ్కోలు విందు ఏర్పాటు చేశారు. సాంప్రదాయ  పద్ధతిలో రాత్రి జరిగే విందు పగలే ఏర్పాటుచేశారు – అదీ రాధాకృష్ణన్ గారికి వీలుగా

ఆ రోజే రాధాకృష్ణన్ భారతదేశపు ప్రయాణానికి సిద్ధమవుతుండగా ప్రపంచ నియంతల్లో  అగ్రగణ్యుడుగా చరిత్ర సృష్టించిన స్టాలిన్ ఒక్కసారి తనను కలవమని కోరాడు

అప్పటికే అయన ఆరోగ్యం క్షీణించి, మంచం పట్టే వున్నాడు వృద్ధాప్యంవల్ల ముఖంలో కరకుతనం  పోయి, కాంతి విహీనమైన కళ్ళతో బుగ్గలు జారిపోయి చాలా దీనంగా కనిపించాడు

రాధాకృష్ణన్ స్టాలిన్ పక్కనే కూర్చుని తల నిమిరి దేహాన్ని మెల్లిగా తడిమి ధైర్యం చెప్పారు

"లోకం నన్ను మహాక్రూరుడు అంటున్నది  మీరు నన్ను ఒక మనిషిలా ఆదరణతో చూశారు  మీ  ఆదరణకు కృతజ్ఞతలు" అంటుండగా, ఆ నియంత కళ్ళు జలపాతలయ్యాయి

"మీరు మంచి మనిషి  సహృదయులైన మీరు దూరం అవుతున్నందుకు మా దేశం వేదన చెందుతోంది  నేను ఎక్కువకాలం జీవించను  మీరు

చాలాకాలం ఆరోగ్యంతో వర్ధిల్లండి" అంటూ కన్నీళ్ళతో వీడ్కోలు పలికాడు స్టాలిన్.

## తెన్నేటి సూరిగారి 'చంఘీజ్ ఖాన్'కు ప్రేరణ

ప్రముఖ రచయితల రచనలు, ఒక్కోసారి ఎంతటి స్ఫూర్తినిచ్చి ఇంకా గొప్ప రచనలు చేయడానికి దోహదం చేస్తాయో చెప్పడానికి ఈ సంఘటనే గొప్ప ఉదాహరణ

శ్రీశ్రీ వ్రాసిన 'దేశచరిత్రలు' అనే గేయంలో

"చంఘీజ్ ఖాన్, తామర్లేనూ
నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ,
సికిందరో, ఎవడైతేనేం?
ఒక్కొక్కడు మహా హంతకుడు" అని వ్రాశాడు

ఈ గేయం చదివిన ప్రముఖ సాహితీవేత్త, పాత్రికేయులు, శ్రీ తెన్నేటి సూరిగారికి చైనాలోని ఓ మారుమూల ప్రాంతంలో, చిన్న తెగకు చెందిన బంజారాజాతి వ్యక్తి–ఛంఘీజ్ ఖాన్ చక్రవర్తి స్థాయికి ఎలా ఎదిగాడు? అనే ఆలోచన వచ్చింది

ఈ ప్రశ్నకు సమాధానమే, ఆయన చరిత్ర పుటల్లోకి లోతుగా వెళ్ళేట్టు చేసింది. మళ్ళీ శ్రీశ్రీ మరో గేయం

"ఇతిహాసపు
చీకటి కోణపు
అట్టడుగున పడి, కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు"

అనేది, తెన్నేటి సూరిగారి మీద బలంగా పనిచేసింది ఫలితంగా సూరిగారు మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీలో వున్న మంగోలు జాతి చరిత్ర మొత్తం అధ్యయనం చేశారు

ఇదివరకు చంఘీజ్ ఖాన్ మీదున్న దురభిప్రాయాలన్నీ పటాపంచలు చేస్తూ ఆయన వ్రాసిన చారిత్రక నవల "చంఘీజ్ ఖాన్" ఆంధ్రపత్రికలో ధారావాహికంగా వచ్చింది

ఒక గొప్ప వ్యక్తి జీవితంలో వెలుగు నీడలను నిష్పాక్షికంగా వెలుగులోకి తెచ్చిన ఖ్యాతి తెన్నేటి సూరిగారికి దక్కింది. ఆయన గ్రంథం తలమానికమైంది.

## మహర్షి బులుసు సాంబమూర్తి మెచ్చిన ఎ.కె.గోపాలన్

1942లో నెల్లూరులో మహర్షి బులుసు సాంబమూర్తి గారున్న జైల్లోకి ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు ఎ.కె. గోపాలన్ అజ్ఞాతవాసంలో వుంటూ, పోలీసులకు దొరకగా తీసుకొచ్చారు.

అప్పటికే ఎ.కె. గోపాలన్ జైలులో నుంచి తప్పించుకునే ఘటికుడని పేరుంది. ఆ భయంతో జైలు అధికారులు చాలా జాగ్రత్తలు తీసుకుని ఆయనను ప్రత్యేకమైన ఖైదు విభాగంలో బంధించారు.

ఒకరోజు గోపాలన్‌ను జైలు అధికారులు, రాజకీయఖైదీలున్న వార్డుకు తీసుకువచ్చారు. అప్పుడక్కడున్న ఓ వృద్ధ ఖైదీ "ఏం గోపాలన్! ఈ జైలు నుండి తప్పించుకు పోగలవా?" అంటూ అడిగాడు

అయితే గోపాలన్ ఆ ప్రశ్నకు నవ్వి "నేను తప్పించుకుపోవాలనుకుంటే, నన్ను నిర్బంధించి వుంచగల జైలు ఇండియాలోనే లేదు" అన్నాడు

అన్నట్టుగానే గోడకు బాలచంద్రన్ కన్నం వేయగా నలుగురు ఖైదీమిత్రులతో జైలు నుంచి పారిపోయాడు

ఈ చర్యను ఖండిస్తూ ఓ వృద్ధ కాంగ్రెస్ ఖైదీ "ఇలా జైలు నుంచి పారిపోవడం కాంగ్రెస్ సిద్ధాంతాలకు వ్యతిరేకం" అన్నాడు.

ఆ మాటలు విన్న సాంబమూర్తి "మిమ్మల్నీ, నన్నూ ఆ కన్నంలోంచి దూర్చినా తప్పించుకుపోగలమా! మనం మన సిద్ధాంతాలు అంటూ ఎందుకు మాట్లాడడం?" అన్నాడు కోపంగా.

ఎ.కె.గోపాలన్ మీద తరువాత రకరకాల కేసులు నడిచి, ఆయనకు ఉరిశిక్ష పడితే, ఆయన నిర్దోషని సుప్రీం కోర్టు తీర్పుతో విడుదలయ్యాడు ఆయన తరువాత ఎం.పి. అయ్యాడు

## ఆదర్శ అధ్యాపకుడిగా 'గిడుగు'వారు

గిడుగు వేంకటరామమూర్తి జీవిత చరిత్ర అంతా ఒక ఆదర్శ అధ్యాపకుడి కధే.

విద్యార్థులు సత్ప్రవర్తనతో చదువులో రాణించాలంటే వినయం, విధేయత, సత్ప్రవర్తన, శ్రద్ధ వుండాలనేది రామమూర్తిగారి పద్ధతి.

1905 ప్రాంతంలో రామమూర్తిగారు పర్లాకిమిడి కాలేజీలో పనిచేస్తున్నారు. అక్కడ తాపీ ధర్మారావుగారు ఎఫ్.ఎ చదవడానికి విద్యార్థిగా చేరారు.

తొలిరోజే, తాపీ ధర్మారావును క్లాసులో చూడగానే "ముఖానికి బొట్టు లేదేం!" అని రామమూర్తి గారు విరుచుకుపడ్డారు.

ధర్మారావు గారు కాస్త కంగారుపడ్డా ధైర్యంగా నిలబడి "నేను నాన్‌బ్రాహ్మిన్నండి" అన్నారు.

"ఏం? అయితే బొట్టక్కరలేదూ?" అని అంటూ రామ్మూర్తి గారు గర్జించారు అలాగని బొట్టు పెట్టుకు రమ్మనమని చెప్పనూ లేదు. ఆ చిన్న విషయంగా ఆయన ఆరు నెలలపాటు క్లాసువైపు వీపుపెట్టి పిల్లల్ని ఎవర్నీ చూడకుండా పాఠాలు చెప్పారు

ఒకరోజు ప్రపంచమ్యాపు సాయంతో ప్రపంచ చరిత్ర చెబుతూ 'స్పార్టా' చూపించమన్నారు. ఒక్క ధర్మారావు మాత్రమే 'స్పార్టా' చూపగలిగారు.

అంతే! ధర్మారావుగారు రామమూర్తి పంతులుగారి ప్రియశిష్యుడయ్యారు.

ఒకసారి అదే ధర్మరావు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోతే తన చెవికున్న 'ట్రంపెట్' తీసి పారేసి "మీ క్లాసుకు రాను" అంటూ వెళ్ళిపోయారు.

(రామమూర్తి గారికి చెవుడుండేది అందుకే, ట్రంపెట్ వాడేవారు)

## "హాస్యనిధి" గోపీనాథ్‌గారి అప్రస్తుత ప్రసంగం

'హాస్యకళానిధి', 'జానపద విద్యాప్రవీణ' అమళ్ళదిన్నె గోపీనాథ్ అవధానాలు జరుగుతున్నప్పుడు– 'అప్రస్తుత ప్రసంగం' అనే ప్రక్రియలో

భాగంగా చిక్కు పెట్టే ప్రశ్నలు వేసి అవధానిగారిని తికమకపెట్టడం వుండేది

ఒకసారి గోపీనాధ్‌గారు ఓ అష్టావధానం చేస్తున్న అవధానిగారిని "ఏమండీ అవధానిగారూ, మీకెందరు తండ్రులు?" అంటూ అడిగారు

అవధాని గారికి కోపం వచ్చి "మీకెందరో నాకూ అందరే" అన్నారు

సభలో అలజడి ప్రారంభమైంది

ఏదో గొడవ జరుగుతుందేమోనని అంతా భయపడ్డారు.

అప్పుడు గోపీనాధ్‌గారు "నాకు అయిదుగురు తండ్రులు 1 ఒకరు జన్మనిచ్చిన తండ్రి, 2 ఉపనయనం చేసినవారు, 3 కూతురిని ఇచ్చినవారు, 4. విద్యనేర్పినవారు, 5 భయము తీర్చినవారు" అంటూ వివరించాడు

సభ సద్దుమణిగింది

ఒకసారి గోపీనాధ్‌గారు మరో అవధానిగారితో "లాల్‌బహదూర్ శాస్త్రి చనిపోకముందు భారత ప్రధాని ఎవరో చెప్పగలరా?" అన్నారు

అవధాని గారు – "నందా–నెహ్రూ" అంటూ తప్పు చెబుతారని ఆశించారు అంతా అప్పుడు అవధానిగారు "లాల్‌బహదూర్‌శాస్త్రి ప్రధానిగా వుండగా (చనిపోక ముందు). లాల్‌బహదూర్‌శాస్త్రి గారే ప్రధానిగా వుంటారు గదా!" అన్నారు

అది సరైన సమాధానం కావడంతో, అంతా సంతోషించారు.

## 'మధుబాల'కు ఇంకా ప్రచారం ఎందుకు?

1952లో రాజాజీ మంత్రివర్గంలో మంత్రి అయిన అతి పిన్న వయస్కుడు దామోదరం సంజీవయ్య

బోయి భీమన్న తన మొదటి కావ్యం 'మధుగీత' ను సంజీవయ్యకు అంకితమిచ్చాడు

తిరుమల రామచంద్ర ఈ కార్యక్రమాన్ని తమ ఇంట్లో ఏర్పాటు చేయగా, నార్ల వేంకటేశ్వరరావు అధ్యక్షులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి వక్త సంజీవయ్యగారు తమ మొదటి సాహిత్య ప్రసంగము చేసింది ఈ సభలోనే

బోయి భీమన్నగారి కావ్య కన్యాదాన మహోత్సవానికి పౌరోహిత్యం వహించింది నిడదవోలు వెంకట్రావు

అంత గొప్ప సాహితీ సభలో తెలుగు సాహితీ ధురంధరులు పాల్గొనడంవల్ల ఆనందం పొందిన తాపీ ధర్మారావు, బోయి భీమన్నగారితో-

"ఏం బ్రదర్! 'మధుబాల'కు (అనగా హిందీ సినీ ధృవతార మధుబాల) ప్రచారం తక్కువైందనా నీ కావ్యానికి ఆ పేరు పెట్టావు" అంటూ చమత్కరించేసరికి సభికులంతా గొల్లుమని నవ్వారు.

హిందీ చిత్రరంగంలో అపురూప అందాలరాసిగా పేరుమోసిన మధుబాల 'మొగలే అజం' చిత్రంలో అనార్కలిగా పేరుమోసి చరిత్ర సృష్టించింది ఆమెకు 1950 ప్రాంతంలో వున్న పాప్యులారిటీ 'నభూతో నభవిష్యతి' అన్నట్టుండేది

అయితే ఆమె పేరే బోయి భీమన్నగారు పెట్టలేదు

## టంగుటూరి అంజయ్యగారి ప్రత్యేకత

రాష్ట్రమంత్రిగా, కేంద్రమంత్రిగా, రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్న టంగుటూరి అంజయ్యగారి ప్రత్యేకత ఆయనదే.

"ఆల్విన్ కంపెనీలో ఆరణాల కూలీగా పనిచేశాను" అని సగర్వంగా చెప్పిన అంజయ్య భోళాశంకరుడుగా, నిగర్విగా మాట్లాడే స్వభావమున్నవాడు

ఆయన పెద్ద చదువుకున్నవాడు కాదు అందుకే 'కేంద్ర ప్రభుత్వము' అనవలసిన సందర్భములో 'క్రింది ప్రభుత్వము' అనేవాడు.

ఒకసారి ఆయన ఒక పెద్ద సినిమా కార్యక్రమములో ముఖ్యమంత్రిగా పాల్గొన్నాడు. ఆయన ఆ సందర్భంలో మాట్లాడుతూ "మీ సినిమావాళ్ళకంటే మేమే బెటర్" అన్నాడు

అక్కడున్నవాళ్ళంతా అవాక్కయిపోయారు తరువాత అంజయ్యగారు తన స్టేట్ మెంట్ కి వివరణ ఇచ్చాడు

"మీ నటీనటులంతా మొహాలకు రంగువేసుకుని సెట్స్‌లోకి వెళ్ళినపుడు మాత్రమే నటిస్తారు కానీ, మా రాజకీయవేత్తలు అలా కాదు ఏ రంగూ వేసుకోకుండానే పగలూ రాత్రి నటిస్తూ వుంటాము మీకూ, మాకూ ఇదే పెద్ద తేడా" అని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు అంజయ్యగారు.

అంజయ్యగారికంటే పెద్ద చదువులు చదివినవారు, రాజకీయ అనుభవం వున్నవారు చాలామంది ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులుగా పనిచేశారు

కానీ, టంగుటూరి అంజయ్యగారికొచ్చిన మంచి పేరు చాలా కొద్దిమందికి రావడం విశేషం

## చక్రపాణిగారు చెప్పిన హితవు

'నేటివ్ జీనియస్' అనే సార్థకనామం, ప్రముఖ రచయిత, నిర్మాత 'విజయవాహిని' సినిమా సంస్థలలో ప్రముఖులైన చక్రపాణి గారికే దక్కుతుంది

చక్రపాణి గారు పెద్దగా చదువుకోకపోయినా, లోకాన్ని క్షుణ్ణంగా చదివిన బహుముఖ ప్రజ్ఞాశాలి

ఒకసారి చక్రపాణిగారు, ప్రముఖ సినీ రచయిత బొల్లిముంత శివ రామకృష్ణగారు స్టూడియోలో నిలబడి మాట్లాడుకుంటున్నారు ఇంతలో సినీ ప్రముఖుడు ఒకాయన అటుగా వెళ్ళడం జరిగింది

సినిమారంగంలో ఎలా మెలగాలో అప్పటికే చక్రపాణిగారు శివరామ కృష్ణగారికి చెప్పి వున్నారు.

"ఆ వచ్చిన పెద్దాయనకు నమస్కారం చెయ్యలేదే?" అడిగాడు చక్రపాణి

"మాటల్లో పడి మరచిపోయా" చెప్పాడు శివరామకృష్ణ

"ఎటూ ఈ ఫీల్డ్‌కొచ్చావుగా! కనపడ్డవాళ్ళకల్లా ఓ నమస్కారం పారవేయ్! ఏదో ఉపకారం జరుగుతుందని కాదు కానీ ఒక్కటి మాత్రం నిజం నీకు అపకారం మాత్రం చేయకుండా వుంటారు" అంటూ జీవిత సత్యాలను, సినీ జీవిత సత్యాలుగా నేర్చుకోమని చక్రపాణిగారు హితవు చెప్పారన్నమాట

## సంజీవయ్యకు 'థ్రిల్'

ఒకసారి ఢిల్లీలో సంజీవయ్య గృహంలో కలిసిన ఆప్తమిత్రుడొకడు ఆయనతో–

"చిన్న వయసులో మంత్రిగా, ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా, అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడుగా మీరు పనిచేశారు మీ జీవితంలో మీకు

అత్యంత గగుర్పాటు కలిగించిన సందర్భం ఏమైనా వుంటే చెబుతారా?"
అంటూ అడిగాడు.

"అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడనైన తరువాత మొదటిసారి జరుగుతున్న కాంగ్రెస్ కార్యనిర్వాహక సమావేశానికి, అధ్యక్షత వహించాను. అతిరథ మహారథులు, ఉత్తమ స్థాయి జాతీయనాయకులున్న సమావేశమది అప్పుడు పండిత జవహర్‌లాల్ నెహ్రూ లేచి నన్ను 'సర్' అని సంబోధించారు తరువాత ఆయన తన ప్రసంగం కొనసాగించారు

అప్పుడు నాకు సువిశాల భారతదేశ ప్రధాని, ప్రపంచ మహాపురుషులలో ఒకరు, స్వాతంత్ర్యసమరసేనానిగా, ఆదర్శవాదిగా, భారత నిర్మాతగా, మేధావిగా, పండితుడుగా, ఆయన లోకోత్తర పురుషుడు అంతటి మహాత్ముడు నన్ను 'సర్' అని సంబోధించాడు ఆయన సంబోధనవల్ల కలిగిన గగుర్పాటును ఒక పక్క అనుభవిస్తూ పరోపక్క ఆ మహావ్యక్తి ప్రసంగం విన్నాను నా జీవితంలో ఆ క్షణాన్ని నేను ఎప్పటికీ మరువలేను అది ఎప్పుడు గుర్తుచేసుకున్నా నా వళ్ళు గగుర్పాటు చెందుతుంది" అన్నారు సంజీవయ్య తన అనుభవం చెబుతూ

## రుక్మిణీనాథశాస్త్రినే 'పేరడీ' చేసిన అబ్బూరి

ఏదైనా ప్రధానపట్టణానికో, నగరానికో వెళ్ళినప్పుడు అక్కడున్న ప్రముఖ సాహితీ వేత్తలను కలసి పలకరించుకోవడం పాతతరం వారికి అలవాటు

ఒకసారి ప్రముఖ సాహితీవేత్త అబ్బూరి రామకృష్ణారావు గారు మద్రాసుకు వెళ్ళి ఓ మిత్రుడి ఇంట్లో దిగారు

సునిశిత వ్యంగ్యానికి, హాస్యానికి 'పేరడీ కింగ్'గా పేరు పొందిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి అబ్బూరి వారిని కలవాలని, ఫోనుచేసి "నేను రుక్మిణీనాథశాస్త్రిని" అన్నారట

అటు ఫోను తీసిన అబ్బూరి రామకృష్ణారావుగారు అందరినీ ఆటలు పట్టించే ఉద్దేశంతో "నేనూ రుక్మిణీనాధుణ్ణే" అన్నారట

అబ్బూరివారుకాక మరెవరో రుక్మిణీనాథశాస్త్రి అని పేరున్నవారు ఫోనులో మాట్లాడుతున్నారనుకున్నారు జలసూత్రం వారు

జలసూత్రం మళ్ళీ ఫోనులో "అబ్బూరి రామకృష్ణారావు గారు కావాలండీ" అన్నాడట

అబ్బూరివారు ఇక లాభంలేదని "నా అర్ధాంగి పేరు రుక్మిణి. కాబట్టి ఇద్దరినీ పోల్చితే ఇద్దరం కూడా రుక్మిణీనాధులమేకదా" అనే అర్థం వచ్చే పద్యం ఫోనులో చదివారు ఆ పద్యం–

"నన్ను సైతము రుక్మిణీనాథుడంద్రు
అస్మదర్ధాంగి రుక్మిణియగుట వలన"

అప్పటికిగాని, రుక్మిణీనాధశాస్త్రికి ఫోనులో వ్యక్తి అబ్బూరి రామకృష్ణారావుగారని రుజువు కాలేదు

## 'పేరడీ కింగ్' రుక్మిణీనాథశాస్త్రి రచనలు

సునిశితమైన హాస్యస్ఫూర్తికి జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి పేరు చెప్పే మరో పేరు చెప్పాలి

ఆయన సమకాలీకులైన పెద్ద,చిన్న అనే తారతమ్యం లేకుండా ప్రముఖ రచయితలనందరినీ 'పేరడీ' (ఒక రచనను హాస్యంగా అనుకరిస్తూ చేసిన రచన) చేసి రచనలు చేశాడు.

ఆయన రచనలకు స్ఫూర్తి ఆయనకు నిజ జీవితంలో ఎదురైన సంఘటనలు, మాటలు, వ్యక్తులు వారి రచనలు

ఒకసారి రుక్మిణీనాధశాస్త్రి మరో సాహితీ మిత్రుడితో కలసి నడుస్తుంటే, ఓ తమిళ పత్రికను ఓ కుర్రాడు, 'విడుదలై–విడుదలై' అంటూ అరుస్తూ తిరుగుతూ అమ్ముతున్నాడు

శాస్త్రి తన మిత్రుడితో "ఇంత చక్కని పదాన్ని వాడుకోలేకపోయాం! అనవసరంగా సంస్కృతపదాలను వాడుతున్నాం" అన్నాడు బాధగా

ఆ తరువాత కొన్నాళ్ళకు 'విడుదలో–విడుదలో' అంటూ ఓ గేయం రాశాడు

రుక్మిణీనాధశాస్త్రి రాసిన రచనలు ఎక్కువ భాగం అచ్చుకాకుండా పోయాయి

శ్రీ శ్రీకి ఒకసారి మతి పోయినప్పుడు, శ్రీ శ్రీ మీద వరద రాజేశ్వర రావు ఒక పద్యం 'స్వతంత్ర' అనే పత్రికకు రాస్తే అది చూసిన శాస్త్రి

'దారి తప్పిన పిల్ల' అనే సుదీర్ఘ ఖండ కావ్యం రాశాడు. కాలగర్భంలో కలసిపోయిన మరో గ్రంధం 'మైలనిఘంటువు'; అతి వాస్తవిక ధోరణిలో వున్న రోజుల్లో 'లింగతాడనం' అనే లఘుకావ్యం రాసి, శ్రీరంగం నారాయణబాబుకి అంకితం ఇచ్చి, "బాబూ! నీ చేతిలో పెడుతున్నాను. మరేం చేస్తావో" అంటూ ఆయనను ఆటలు పట్టించాడు. ఈ రచనలన్నీ ఎటుపోయాయో తెలియదు

## చలంగారు 'ఆశువు'గా చెప్పిన పద్యం

అబ్బూరి వరద రాజేశ్వర్రావు బాగా చిన్న వయసులో వుండగానే, ఆయనకు పద్యాలు ఆశువుగా చెప్పడం మంచినీళ్ళప్రాయంగా వుండేది.

ఈ ఆశుకవిత్వ ధోరణి ఈయనలో ప్రబలటానికి ముఖ్య కారణం వీరి నాన్న గారైన అబ్బూరి రామకృష్ణారావు గారు, ఆయన సాహితీ మిత్రబృందం, కళాబృందం.

తెలుగు సాహితీ, కళాప్రియుల్లో ప్రముఖులు అబ్బూరి రామకృష్ణా రావుగారి దగ్గరికొస్తే, వారితో వయసులో చిన్నవాడైనా అబ్బూరి వరదరాజేశ్వరరావు గారు ఆ పెద్దలందరితో స్నేహంగా వుండి, కాలం గడిపేవారు.

ఒకసారి వెంకటాచలం గారితో అబ్బూరి వరద రాజేశ్వరరావు గారికి స్నేహం ఏర్పడింది. చిన్నపిల్లల్లో చిన్నపిల్లవాడిగా, అభిమానంతో కలిసిపోయే చలంతో, షికార్లకు సాయంత్రం వెళ్ళడం, వరద రాజేశ్వరరావు గారికి అలవాటయ్యింది.

చిన్న కుర్రవాడుగా వున్న వరద రాజేశ్వర్రావు గారికి సందర్భం దొరికితే కంద పద్యమో, ఆటవెలదో ఆశువుగా చెప్పే అలవాటుంది

ఒకరోజు సాయంకాలం చలం, వరద రాజేశ్వర్రావు గారు షికారు కెళుతున్నారు. రోడ్డుకు అవతలా ఇవతలా గుడిసెలున్నాయి వరద రాజేశ్వర్రావు "ఇప్పుడే వస్తాను" అంటూ ఓ గుడిసె మాటుకెళ్ళాడు. చలం గాభరాగా ముందుకెళ్ళి ఆగిపోయి నిలబడ్డాడు కాస్సేపటికి వరదరాజా వస్తూనే–

*"గుడిసాటి వెంకటచలము*

*గడగడ వణుకు నన్ను చూసి కారణమేమో?"* అని పద్యం ఆపగానే–

"వడి వడి పోయన్ తడబడ
నడే వీధిని నవ్వుదురని నలుగురు వరదా" అంటూ చలం పద్యం పూరించేప్పటికి వరదరాజా గారు చలానికి ఇంత కవితా ప్రతిభా అనుకొన్నారు

## 'రవిక ఆననిచో కవిగాంచు'నన్న 'కరుణశ్రీ'

పద్యాన్ని మాటగా, సూక్తిగా, స్ఫూర్తిగా మలచిన చతురుడు శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు

'కరుణశ్రీ' బిరుదాంకితులైన శ్రీ పాపయ్య శాస్త్రి గారు 'ముక్కు తిమ్మన' గారి మరోజన్మ అనే స్థాయికి ఎదిగిన సాహితీమూర్తి.

ఒకసారి గుంటూరు ఏకా దండయ్య పంతులు హోలులో 'ఇందిరామందిరం' పేరుతో సాహితీసదస్సు జరుగుతుంది.

ఆచార్య యస్వీ జోగారావు రఘునాధరాయలుగా, డా. ప్రసాదరాయ కులపతి, మంత్రి గోవింద దీక్షితులుగా, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి చేమకూర వెంకటకవిగా వున్నారు ఆ సాహితీ సభలో.

"కవికాననిచో రవిగాంచునేకదా" అనే సమస్యను కరుణశ్రీ గారు ఇలా చమత్కారంగా పూరించారు.

ఒక కవి పుంగవుడు పట్టణానికి వెళ్ళాడు. స్నానం చేసి అప్పటికే ఆ కవి భార్య చీర కట్టుకొని రవిక ధరిస్తుండగా కవి తలుపులు నెట్టాడు. ఆమె సిగ్గుతో తాను ధరించబోతున్న రవికె, కవి కన్నులమీద పడేట్టు కప్పింది.

సూర్యుడు చూడనిచోటును, కవి తన భావనాబలంతో దర్శించగలడనే అర్థం కాకుండా "రవిక + ఆననిచో" అని చమత్కారంగా చెప్పారు జంధ్యాల పాపయ్యశాస్త్రి.

"పట్టణమేగె నొక్క కవి, పండుగకున్, కవిభార్య స్నానమై
కట్టెను పట్టుచీర, రవికన్ ధరియించుచునుండ తల్పులన్
నెట్టె కవీంద్రుడు; డా రవికనే కవి కన్నుల గప్పె కాంత, ఔ
నట్టుల మోమునందు, రవికాననిచో కవికాంచు నేకదా"

– అనేది ఆ పద్యము

## అపహాస్యాన్ని హాస్యంగా మార్చిన 'జాషువా'

ప్రముఖ కవి జాషువా "నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్త వృత్తికిన్ దివ్వెలు" అంటూ "నవ్వులు సర్వదుఃఖ దమనంబులు, వ్యాధులకు మహౌషధుల్" అంటూ నవ్వువల్ల లాభాలు చెప్పారు

ఆయన నిజజీవితంలో హరిజనుడు కావడంచేత, జీవితంలో ఎన్నో కష్టాలను, పరాజయాలను అధిగమించడానికి హాస్యాన్ని సృష్టించుకునేవారు తాను నవ్వి తన చుట్టూ వుండేవారిని నవ్వించేవారు

ఒకసారి ఒక మిత్రుడు "జాషువాగారూ! మీ మీసాలపై నిమ్మకాయలు నిలబెట్టి వచ్చా" అన్నాడట ఛలోక్తిగా.

వెంటనే జాషువా "నిమ్మకాయలేమిటి, గుమ్మడికాయలనే నిలబెడతా– సంపెంగ నూనె అంటూ వుంటే" అన్నారట, తన ఆర్థిక ఇబ్బంది తాను చెప్పక చెబుతూ

ఒక సన్మానసభలో జాషువాగారిని పొగిడినట్టే పొగుడుతూ, మరో కవి జాషువా నల్లరంగు మీద ఛలోక్తి విసురుతూ "మాశీగేదె నల్లనిదైనా, తెల్లటి తియ్యని పాలిస్తుంది. ఈ నల్లటి కవిగారు తియ్యని కవిత్వాన్ని అందిస్తున్నారు" అన్నాడట

ఆ ఛలోక్తిని స్వీకరిస్తూ జాషువా, "నల్లనివాడు మనసు తెల్లనివాడు, పద్మ నయనంబులవాడు" అంటూ తనను తానే పొగుడుకుంటూ నాలుగు విశేషణాలు కలుపుకుని మీసం దువ్వుకుంటూ కూర్చున్నారట

## జాషువా-సీసాలో మందు తగ్గింది-జ్వరం తగ్గలేదు

జాషువాగారి దగ్గరికొచ్చిన వారెవరూ నవ్వకుండా వెళ్ళరు

ప్రతివారినీ నవ్వించి వారితో హాస్య ప్రసంగం చేసేవారు జాషువా జాషువాగారు లాల్చీ పంచె ధరించి ఓ రైతులా, పై పంచెతో వుండేవారు

అయితే 1942–44 ప్రాంతంలో జాషువా గారు వార్ పబ్లిసిటీ ఆఫీసరుగా మద్రాసులో వుండి పనిచేశారు

ఆఫీసరుగా ఆయన సూటు వేసుకుంటే బాగుంటుందని అందరూ అనగా, ఆయన సూటు కుట్టించారు.

సూటు మీద వుంటూ చాప భోజనం ఏమిటని చేతితో తినడం నాగరికత కాదని స్పూను–ఫోర్క్ ఉపయోగించారు. ఫోర్క్ అలవాటులేక అది గుచ్చుకుంది అంతే!

ఫోర్క్ గుచ్చుకుందని స్పూను తోసేశారు. స్పూను, ఫోర్క్ లేనిదే బల్ల ఎందుకని అది తీసివేశారు. బల్ల లేనిదే సూటు ఎందుకని మళ్ళా చొక్కా పంచెలోకి వచ్చారు.

ఒకసారి ఆయనకు అనారోగ్యంగా వుంది జ్వరం వచ్చింది.

"నాన్నగారూ! మందు తీసుకున్నారు కదా! జ్వరం తగ్గిందా?" అని అడిగితే–

"సీసాలో సగం తగ్గింది" అనేవారు జాషువా.

"సీసాలో సగం తగ్గటమేమిటి?" అంటూ అడిగితే –

"అదే – సీసాలో మందు తగ్గింది" అనేవారు

మందు వాడినా, జ్వరం తగ్గలేదని ఆయన అలా నవ్వుతూ తన మీద తనే ఛలోక్తి విసురుకునేవారు

## 'శ్రీ శ్రీ' విసిరిన 'హోటళ్ళ' జోక్స్

మహాకవి శ్రీశ్రీ ఎక్కడున్నా అక్కడ మంచి చమత్కారంతో కూడిన చణుకులు విసరడంలో ఆయనకు ఆయనే సాటి

వివిధ సందర్భాల్లో శ్రీశ్రీ హోటళ్ళకు వెళ్ళినప్పుడు పేల్చిన జోక్స్

ఒకసారి శ్రీశ్రీగారు తక్కిన మిత్రులతో కలిసి హోటలుకెళ్ళారు

అప్పుడు ఒక మిత్రుడు "శ్రీశ్రీ గారూ, మీకు కాఫీయా? టీయా?" అని అడగ్గానే "టీయే మధురం" అని రకీమని జవాబిచ్చారు శ్రీశ్రీ.

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు 'స్వరాజ్య' అనే ఇంగ్లీషు దినపత్రిక నడిపారు (1927–1939).

అందులో ఖాసా సుబ్బారావు శ్రీశ్రీగారితో పాటు మరికొందరు ప్రముఖులు పనిచేసేవారు

చివరి రోజుల్లో, ఆర్థిక ఇబ్బందులవల్ల సిబ్బందికి జీతాలు వుండేవి కావు

శ్రీశ్రీగారి మిత్రులెవరైనా సాయంత్రం ఆ పత్రికాఫీసుకు వెళితే,

"కెన్ యు రైజ్ టు ది అకేషన్?" (ఈ ఇబ్బందిని అధిగమించగలవా?) అంటే "కాఫీకి డబ్బులున్నాయా?" అని అర్థం

"కెన్ యు రైజ్ టు ఫుల్ అకేషన్?" (అంటే కాఫీ–టిఫినుకి డబ్బులున్నాయా?) అని అర్థం వచ్చేట్టు శ్రీ శ్రీ గారు నర్మగర్భితంగా అడిగేవారు.

ఒక హోటల్‌లోని ఒక బేరర్ ఎప్పుడు శ్రీ శ్రీ కనిపించినా టిప్ అడిగేవాడు.

అటువంటి మంచి బేరర్‌కి మహాకవి ముద్దుగా 'టిప్పుసుల్తాన్' అని పేరు పెట్టారు

## తాపీ ధర్మారావు గారిచ్చిన భరోసా

తెలుగు చలన చిత్రరంగంలో సంచలనం సృష్టించిన 'రోజులు మారాయి' చిత్రానికి కథ, మాటల రచయితగా ప్రసిద్ధులైన తాపీ ధర్మారావు పాతతరం రచయితల్లో ప్రముఖులు

అటు మేధావులు, ఇటు సాహితీ ప్రియులు 'తాతాజీ'గా పిలుచుకునేది తాపీ ధర్మారావునే

సాహిత్యపరంగా తరువాత ఆయన సాంప్రదాయాలను వ్యతిరేకించినా, మొదట్లో ఆయన 'గిడుగు' భాషావాదాన్నే ఎదిరించారు

అయితే ఆయన కాలానుగుణంగా మారారు 'పెళ్ళి – దాని పుట్టుపూర్వోత్తరాలు' అనే పుస్తకం రాసినా, 'ఆలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ' అనే వ్యంగ్య గ్రంథం రాసినా, ఆయన భావాలన్నీ సహేతుకమైనవి

'తాతాజీ'గా ప్రసిద్ధులైన తాపీ ధర్మారావుగారి మీద ఒక జోక్ ప్రచారంలో వుంది

ఒక యువకవికి సాంప్రదాయ పద్ధతిలో, ఛందోబద్ధంగా, వీరగ్రాంధికంలో ఎన్ని పద్యాలు రాసినా ఆయనకు పేరు రాలేదు

ఇక లాభంలేదని ఆ యువకవి తాతాజీ దగ్గరికొచ్చి తన బాధను వెళ్ళకక్కుకున్నాడు తన బాధలు తీరే తరణోపాయం చెప్పమన్నాడు.

అప్పుడు తాతాజీ "నాయనా, కష్టపడి రాశావుగదా! తగలబెట్టమని నేనెలా చెప్పను? పోనీ, ఓ బండెడు బండిరాలు, లారీడు అరసున్నలూ

తెచ్చి నీ కవిత్వంలో ఖాళీ వున్న చోటల్లా కుక్కు! ఇక పండితులు నీ పాండిత్యం గొప్పదని ఎందుకు ఒప్పుకోరో చూద్దాం!" అన్నారట భరోసా ఇస్తూ.

## ఆదిభట్ల నారాయణదాసుగారి పట్టుదల

హరికథ పేరు చెప్పగానే గంధర్వగాన, సంగీత, సాహిత్య కళానిధి ఆదిభట్ల నారాయణదాసు గారు ప్రథమస్థానంలో నిలుస్తారు

విజయనగరం ఆనందగజపతిగారి పోషణలో అప్పట్లో అటు గురజాడ అప్పారావు, ఇటు ఆదిభట్లవారున్న రోజులవి

ఒకసారి గురజాడ వారితో ఏదో మాటల సందర్భంలో గిడుగు రామమూర్తి పంతులుగారు "శ్రోతల మెప్పుకోసం మన దాసు హరికథలు అశ్లీలంగా చెప్తుంటాడట. ఇలాటివి నాకు నచ్చవు" అన్నారు

నిర్మొహమాటంగా మాట్లాడడం గిడుగు వారికి అలవాటు

రామమూర్తి గారన్నమాట ఎలాగో ఆదిభట్ల వారికి చేరింది

ఆ మరునాడే ఆదిభట్ల నారాయణదాసు గారు రామమూర్తిగారిని కలుసుకుని "ఏరా! రామ్మూర్తీ! నేను హరికథల్లో బూతులు మాట్లాడుతానని నీకెవరు చెప్పారు?" అని అడిగారు

రామమూర్తిగారు వెనక్కు తగ్గకుండా "నీ కథలు విన్నవారు" అన్నారు మరింత మొండిగా.

"అది అబద్ధం! కావాలంటే ఈ వేళ రాత్రికే, నువ్వు వచ్చి నా హరికథ విను" అన్నారు ఆదిభట్ల

అయితే రామమూర్తి గారు "ఎలా వినమంటావు! నాకు చెముడు! చెవిటివాడి ముందు శంఖం ఊదుతావా?" అన్నారట.

అయినా దాసుగారు రామమూర్తిగారిని వదలకుండా "నీకు వినబడేట్టు కథ చెబుతాను. ఎలా వుందో చెప్పు" అంటూ, వేదికమీదే వారికి స్థానం కలిపించి పై స్థాయిలో బాగా బిగ్గరగా కథ చెప్పి, 'శభాష్' అనిపించుకున్నారు

## కృష్ణశాస్త్రి 'నిజలింగప్పకు' అనారోగ్యం

కృష్ణశాస్త్రిగారి పేరు చెబితే 'మల్లీశ్వరి' చిత్రం మాటలు, పాటలు గుర్తొస్తాయి.

ఆయన తరువాత రాసిన చిత్రాల పాటల సంఖ్య రాసిలో తక్కువైనా, వాసిలో వన్నెకెక్కినవే శాస్త్రిగారు మంచి మూడ్‌లో స్పందన కలిగితేనేకాని సినిమా పాటలైనా రాసేవారు కాదు.

ఒకసారి ఒక చిత్ర నిర్మాత శాస్త్రిగారిచేత పాట రాయించుకోవాలని, తిరిగి తిరిగి విసుగు చెందాడు ఆ నిర్మాత ఎప్పుడెళ్ళినా "శాస్త్రిగారూ! నాకు మీరు పాటలు ఎప్పుడు రాస్తారు?" అని అడగగానే–

"నిజలింగప్పకు ఆరోగ్యం కుదుటపడగానే" అనేవారట శాస్త్రిగారు.

నిజలింగప్పకు ఆరోగ్యం బాగా కుదుటపడడానికీ, శాస్త్రిగారు సినిమా పాట రాయడానికీ సంబంధం ఏమిటో ఆ నిర్మాతకు అర్థంకాలేదు.

తరువాత ఆ నిర్మాత మరో సినీకవిచేత తన సినిమా పాటలు రాయించుకుంటూ, "కృష్ణశాస్త్రిగారెప్పుడడిగినా నిజలింగప్ప ఆరోగ్యం కుదుటపడగానే అంటారు! ఇంతకీ ఆయన రాసే పాటకీ, నిజలింగప్ప ఆరోగ్యానికీ సంబంధం ఏమిటి?" అంటూ అడిగాడు

అప్పుడా సినిమా కవి నవ్వి "నిజలింగప్పంటే కర్ణాటకకు చెందిన ప్రముఖ రాజకీయ వేత్తకాదు 'నిజలింగప్పంటే' శాస్త్రిగారి పరిభాషలో 'కవితాత్మ'– అంటే కవిగా మంచి స్పందన రాగానే, సినిమా పాట రాస్తానని అంటున్నారు– శాస్త్రిగారు" అంటూ వివరణ ఇచ్చాడట.

## ప్రముఖ'కవి' కాటూరివారి చమత్కారం

'కవి'గా అప్పట్లో 'కాటూరి' పేరు చెప్పేకే మరో పేరు చెప్పే రోజులు

ఆయన నిజజీవితంలో మంచి హాస్యప్రియులు సమయానుకూలంగా హాస్యంతో అందరినీ నవ్వించి ఆటలు పట్టించేవారు.

ప్రముఖ హాస్య రచయిత రావూరు సత్యన్నారాయణ ఆయనకు మంచి మిత్రులు

కాటూరి వారికి ఎలాగైనా పెళ్ళిళ్ళు కుదర్చాలనే ఆసక్తి ఎక్కువగా వుండేది

వధూవరులు ఎలాటివారైనా ముందు పెళ్ళి కుదర్చండి, వాళ్ళే బాగుపడతారు అనేది ఆయన నమ్మిన సిద్ధాంతం.

ఒకసారి రావూరు సత్యన్నారాయణగారు, వారి వదినగారి అబ్బాయికి తాంబూలాలు పుచ్చుకోడానికి వస్తామంటే వద్దన్నారట. దీనికి ముఖ్య కారణం ఆ రోజు సత్యన్నారాయణగారి తండ్రిగారికి ఆబ్దికము అయి వుండడం

ఇది తెలిసిన కాటూరివారు "ఆ పెళ్ళి తాంబూలాలు పుచ్చుకునేవారిని ఇవ్వాళే రమ్మనవయ్యా! ఈవేళ ఆబ్దికము, మంచిది కాదంటావా? చాలా మంచిది. వండిన గారెలూ అవీ వుంటాయిగా – అవే పెట్టొచ్చు. మళ్ళీ ఆడవాళ్ళని ఏమని ఇబ్బంది పెడతావు? రమ్మను వెంటనే" అంటూ సలహా ఇచ్చారట.

మళ్ళీ ఏదో సంబంధ విషయంగా "అబ్బాయికి చదువు బొత్తిగా తక్కువండి" అని, రావూరు వారంటే–

"ఇంకేం! ఆ సంబంధమే తప్పక కుదుర్చుకోండి. పిల్లవాడు ఎటూ పోకుండా ఇంట్లో పడి వుంటాడు" అన్నారట కాటూరి చమత్కారంగా.

## తెలుగు 'జానపద'సంపద వెలుగులోకి తెచ్చిన గంగాధరం

ఆంధ్రదేశంలో జానపద వాఙ్మయ సేవచేసి అనేక వేల జానపద గేయాలు, సామెతలు, పొడుపుకథలు సేకరించిన ప్రముఖుల్లో ప్రముఖుడు, నేదునూరి గంగాధరం గారు

ఈ జానపద వాఙ్మయ సంపదను సేకరించడానికి, నేదునూరివారు తిరగని చోటు లేదు, వెళ్ళని పల్లె లేదు.

ఇలాటి జానపద వాఙ్మయ సేకరణ చేస్తున్న నేదునూరి వారి సంగతి తెలిసి, జానపద వాఙ్మయ సంకలనాలు చేసే, పంజాబు రాష్ట్రానికి చెందిన దేవేంద్ర సత్యార్థి, నేదునూరి వారివద్దకొచ్చి "జానపద భిక్షకు వచ్చాను–పదాలు దానం చేయండి" అంటూ దేశమంతా అడిగినట్లు అడిగి, మూడు నెలలు రాజమండ్రిలో వుండి గంగాధరంగారి నుండి వెయ్యి జానపద గేయాలు సేకరించుకున్నాడు ఈ ఒక్క ఉదాహరణ చాలు గంగాధరంగారి జానపద సేవా ఔన్నత్యం తెలుసుకోడానికి

ఒకసారి ఒక సాహిత్య సభలో గంగాధరం ఒక జానపద పాటను చదివారు. వృద్ధ వివాహాల సమస్యకు ఒక పడుచుపిల్ల ఎంత తేలిగ్గా పరిష్కారం చెప్పిందో చూడండి

పడుచు: "ఊత కర్రోచేత
ఉగ్గమో చేతా
ఊగుతూ వచ్చేటి
తాతెవ్వరమ్మా?"

తాత: "మానికానిండాను
మాడలోసుకొని
మనుమరాలా నిన్ను
మనుమడుగ వస్తి"

పడుచు: "వాడిన్న పువ్వుల్లు
వాసనలు గలవా?
వద్దయ్య ఓ తాత
వద్దు నీ మనువు"

## కృష్ణశాస్త్రిగారి హాస్య చతురోక్తులు

కృష్ణశాస్త్రిగారు, నిజజీవితంలో మంచి హాస్యప్రియులు.

ఆయన వేమన పద్యాలను అనుకరిస్తూ కొన్ని హాస్య పద్యాలు రాశారు.

పూర్వపు కవి పండితులకు వేద విద్యల్లో అసాధారణ ప్రతిభ వుండేది అది కలికాలమొచ్చేసరికి ఎలా దిగజారిపోయిందో చెబుతూ—

"వేద విద్యనాటి వెలుగె నశియించె
గారె, బూరె, పప్పుచారు మిగిలె,
బుర్ర కరగి కరగి తొర్రగా మారెరా!
విశ్వదాభిరామ వినురవేమ"

కొందరు స్వతహాగా పిరికివారే కాబట్టి వారికి ఎన్ని ధైర్యవచనాలు చెప్పినా, వాళ్ళల్లో ధైర్యం రాదు ఈ భావాన్ని చెబుతూ—

"ప్రొద్దుపోక బాబు, బొబ్బిలి కథ విని
గోడమీద బల్లెమూడలాగి,
ఒక్క కేకపెట్టి, ఊరుకున్నాడయా!
విశ్వదాభిరామ వినురవేమ"

ఎవరైనా వృద్ధులను కృష్ణశాస్త్రి గారికి పరిచయం చేస్తే 'వీరు ఫలానా' అని చెబితే—

"కంటిచూపు తగ్గింది బాబూ! చెబితేగాని తెలియదు నాయనా?" అంటూ, ఆ వచ్చిన వ్యక్తి శాస్త్రిగారితో అంటే—

"మీరు అదృష్టవంతులు! చెబితే తెలిసే స్థితిలో వున్నారు చెప్పినా తెలియనివారు ఎందరున్నారో భారతదేశంలో" అనేవారట శాస్త్రిగారు నవ్వుస్తూ.

## మోక్షగుండంగారి నిరసన

మైసూర్ రాష్ట్రాన్ని అన్ని విధాలా అభివృద్ధిచేసి, 'మైసూర్' నగరాన్ని 'ది సిటీ ఆఫ్ ప్యాలెసెస్'గా తీర్చిదిద్దిన ఘనత 'భారతరత్న' మోక్షగుండం విశ్వేశ్వరయ్యది

ఆయన కాలానికి విలువ ఇచ్చే మనిషి జేబులో గడియారం వుంటుంది కాల నియమము పాటించకపోతే ఆయన ఎవరినీ లెక్కచేసేవారు కాదు

ఒకసారి లెజిస్లేచర్ సభ్యుడుగా ఆయన వుండగా ఒక సమావేశాన్ని ప్రారంభించడానికి మైసూరు మహారాజా స్వయంగా వస్తారంటూ వర్తమానం వచ్చింది

అయితే, ఆయనను ఆహ్వానించడానికి లెజిస్లేచర్ భవనం, సింహద్వారం దగ్గర నిలబడ్డ మోక్షగుండం విశ్వేశ్వరయ్య గారు ఎంతోసేపు నిలబడ్డా మహారాజాగారి కారు వస్తున్న ఛాయలు కనిపించలేదు

ఇక లాభంలేదని ఆయన వెళ్ళి సభలో కూర్చున్నారు తరువాత కాస్సేపటికి మహారాజావారొచ్చినా ఆయన లేచి వచ్చి రాజుగారిని ఆహ్వానించలేదు

మహారాజుగారు ఆలస్యంగా వచ్చి సమావేశాన్ని ప్రారంభించి వెళ్ళి పోయారు మోక్షగుండంగారు తనను ఆహ్వానించనందుకు ఆయన

బాధపడ్డారు. అయితే ఎవరూ ఊహించని విధంగా మోక్షగుండం గారు మహారాజుకే ఓ కాగితం పంపారు. అందులో "అందరికీ కాలనియమపాలనలో ఆదర్శంగా నిలవవలసినవారు, ఆ నియమాన్ని పాటించకపోతే–పాలకుల పట్ల ప్రజలకు ఏం గౌరవం వుంటుంది? అందుకే నా నిరసనతో మీకు హితవు చెప్పాను" అని వుంది. మహారాజు మోక్షగుండం వారిని అభినందించారు

## 'కమ్ ఫార్వార్డ్'కు వింత అర్థం చెప్పిన డా. పట్టాభి

వృత్తిచేత మంచి వైద్యులైనా, ప్రవృత్తిచేత ప్రజాసేవకులైన ఆదర్శ రాజకీయ ధురంధరుడు డా పట్టాభి సీతారామయ్య.

ఆయన సందర్భానుసారంగా వేసే చణుకులు జనాన్ని బాగా నవ్వించి, గొప్పగా ఆలోచించేట్టు చేస్తాయి

ఒకసారి ఒక జాతీయ నాయకుడు బందరు వచ్చిన సందర్భములో, ఊరి టౌన్‌హాల్ ప్రక్కనున్న పెద్ద మైదానంలో సభ జరుగుతోంది

ఆ జాతీయ నాయకుడు ఆంగ్లంలో ఉపన్యసిస్తుంటే, పట్టాభిగారు తెలుగులో అనువదిస్తున్నారు.

ఇంతలో ఎవరూ ఊహించని విధంగా కరెంటు పోయింది.

మైకు పనిచేయదు కాబట్టి సభికుల్ని "వీలైనంత ముందుకు రండి! ముందుకు రండి!" అని ఆ నాయకుడు ఇంగ్లీషులో ఆహ్వానించాడు

ఆ సందర్భాన్ని పురస్కరించుకుని డాక్టర్ పట్టాభి "మహాజనులారా! మన తెలుగు వారెవ్వరూ– కనీసం మాటవరసకైనా, మర్యాదకోసమైనా ముందుకిరమ్మని అనరు, కోరరు. కానీ ఇవ్వాళ ఈ పెద్దవారు ఎంతో విశాల హృదయంతో మిమ్మల్ని అందరినీ ముందుకు రమ్మని అంటున్నారు. ఇటువంటి గొప్ప వ్యక్తులున్న కాంగ్రెస్‌కు ఓటు వేస్తేనే మనమంతా ముందుకు రాగలం" అంటూ పెద్దగా అరచినట్టు చెప్పి చమత్కరించారు.

పట్టాభివంటి పెద్దల చమత్కారాలు పెద్దపెద్ద సభల్లోని సభికుల్ని ఎంతో అలరించి, అవి దిగ్విజయం అవడానికెంతో దోహదపడ్డాయి.

# త్యాగరాజ భాగవతార్ పట్ల జడ్జికున్న గౌరవం

'సినిమా తూతూ' పత్రికా సంపాదకుడు 'లక్ష్మీకాంతన్'ను హత్య చేయించిన నేరానికి ప్రముఖ నటుడు, గంధర్వ గాయకుడు, త్యాగరాజ భాగవతార్, ప్రముఖ తమిళ హాస్యనటుడు– ఎన్.ఎస్.కృష్ణన్‌ల మీద మద్రాసు హైకోర్టులో పెద్ద కేసు నడిచింది.

కేసు నడచినంతకాలం వేలజనం కోర్టుచుట్టూ మూగేవారు. తీర్పురోజు చేరువయ్యింది.

త్యాగరాజు భాగవతార్, స్వయంగా నిర్మించి నటించిన 'హరిదాస్' చిత్రం అప్పటికే 42 వారాలుగా మద్రాసులో ఆడుతోంది.

త్యాగరాజు భాగవతార్ "కృష్ణా ముకుందా మురారే" అని పాడిన ఆ ఒక్కపాట కోసం జనం ఇతర ప్రాంతాల నుంచి వచ్చి విని, భక్తి తన్మయత్వం పొందుతుండేవారట

అయితే ఏ కోర్టు చరిత్రలో లేని విధంగా, కోర్టు జడ్జిగారు స్వయంగా లేచి నిలబడి "దక్షిణదేశ గాయక సార్వభౌములైన గంధర్వగాన శ్రీ యం.కె. త్యాగరాజ భాగవతార్ గారిని 'హరిదాసు' సినిమాలో వారు పాడిన 'కృష్ణా ముకుందా మురారే' పాటను ఒక్కసారి పాడి వినిపించమని కోరుతున్నాను" అన్నారు.

(ఈ చిత్రాన్నే 1957లో 'పాండురంగ మాహాత్మ్యం' పేరుతో రామారావు గారు నిర్మించగా ఘంటసాల 'కృష్ణా ముకుందా మురారే' అంటూ గొప్పగా పాడారు.)

జడ్జిగారి కోరిక మేరకు త్యాగరాజు ఆ పాట పాడారు. అందరూ తన్మయులయ్యారు.

వెంటనే జడ్జిగారు భాగవతార్ గారితోపాటు, హాస్యనటుడు ఎన్ ఎస్ కృష్ణన్‌కు యావజ్జీవ కారాగారవాసం విధించాడు. భాగవతార్ 114 వారాలు జైలులో గడిపి తరువాత విడుదలైతే, ఆయన చిత్రం 'హరిదాస్' 142 వారాలు ఒకే హాలులో ఆడింది

# నా పరిస్థితి 'వాలఖిల్యుడి' పరిస్థితే అని చెప్పిన అబ్బూరి రామకృష్ణారావుగారు

ఆధునిక ఆంధ్ర నాటక రంగ చరిత్రలో, అలాగే తెలుగు ఆధునిక సాహిత్య చరిత్రలో అబ్బూరి రామకృష్ణారావు గారి పేరు ముందు వరుసలో ముందుగా చెప్పాలి. శ్రీ శ్రీ వంటి మహాకవి కవితలకు స్ఫూర్తినిచ్చి ప్రోత్సహించిన బహుముఖ ప్రజ్ఞాశాలి ఆయన.

ఒకసారి అబ్బూరి రామకృష్ణారావు గారు జారిపడితే తుంటెభాగం విరిగింది.

వైద్య నిమిత్తం ఆయన కాలు పైకి ఎత్తి కట్టి వుంది. వయసు బాగా ముదిరిన పండు ముసలి ఆయన. ప్రముఖ సాహితీ మిత్రులంతా ఆయనను పరామర్శించడానికి వస్తూ, పోతూ వున్నారు. అలా మంచంమీద కదలకుండా పడుకోవడం, కాలు పైకి ఎత్తి కట్టి వుండడం, పెద్ద బాధగా వున్నా పెద్దవారైన అబ్బూరి రామకృష్ణారావు గారు ఓర్చుకుంటున్నారు.

అయితే అలాంటి ఇబ్బందికర పరిస్థితిలో కూడా అబ్బూరివారు తమ హాస్య ప్రవృత్తిని వదలలేదు.

నాగపూర్ ప్రొఫెసర్‌గా ప్రసిద్ధులైన డాక్టర్ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అబ్బూరి రామకృష్ణారావు గారిని పరామర్శిస్తూ "ఎలా ఉన్నారు సార్?" అన్నారట.

వెంటనే రామకృష్ణారావు గారు "ఎలా వుంటాను! వాలఖిల్యుడిలా వున్నాను" అన్నారట నవ్వుతూ.

'వాలఖిల్యుడు' ఒక రుషి పేరు. అతనికి సంతతిలేక ఉత్తర కర్మలు చేసేవారు లేకపోవడంవల్ల అతను రుషి అయినా తలక్రిందులుగా వ్రేలాడే దుర్గతి పట్టిందట

అబ్బూరిగారి అబ్బాయి అబ్బూరి వరదరాజేశ్వరరావు గారికి పిల్లలు లేరు. కాబట్టి భవిష్యత్తులో నాకూ ఉత్తర కర్మలు చేసే మనవలుండరు, నా పరిస్థితీ వాలఖిల్యుడి పరిస్థితే అంటూ రామకృష్ణారావు గారు చమత్కరించారు.

## శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారి ఛలోక్తి

ఆంధ్రా యూనివర్సిటీలో యాక్టింగ్ కోర్సు పెట్టించడమేకాక, అత్యాధునిక పరికరాలున్న గొప్ప స్టేజీని ఏర్పాటుచేసిన మహావ్యక్తి, రిజిస్ట్రార్‌గా పనిచేసిన శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు

నాటక ప్రదర్శనలు జరుగుతుంటే గోపాలస్వామి ప్రత్యక్షంగా అక్కడ వుండేవారు.

ఆయన వుంటే చుట్టుపక్కల ఏ విధమైన గొడవలు లేకుండా నిశ్శబ్దంగా వుండేవారు. యూనివర్సిటీ విద్యార్థులు ఆయనను ఎంతో గౌరవించేవారు.

ఒకసారి 'ఎర్‌స్కిన్‌స్క్వయర్' (ఆంధ్రా యూనివర్సిటీ నాటకశాల వున్న విభాగం)లో నాటక ప్రదర్శన జరుగుతోంది.

విద్యార్థులెందుకో మధ్య మధ్యలో గొడవ చేస్తున్నారు

అటువంటి పరిస్థితుల్లో గంభీరంగా ఆజానుబాహువులైన వేణుగోపాల స్వామి గారు స్టేజిమీదకు రావడం ఆనవాయితీ

ఆయన అలా స్టేజి మీదకు రాగానే ఓ విద్యార్థి "హేయ్ భీమా" అంటూ అరిచాడు కొంటెగా

అయితే వేణుగోపాలస్వామి ఏమీ తొట్రుపడకుండా "ఏమిట్రా ఘటోత్కచా" అన్నారు మైకులో గట్టిగా అందరికీ వినబడేట్టు.

'భీముడి' కుమారుడే 'ఘటోత్కచుడు'. ఈ అర్థం స్ఫురించడంతో ఆ కొంటె కుర్రవాడిని వేణుగోపాలస్వామి ఏ అర్థంలో తిట్టారో అర్థమైంది.

## రచయితల్లో 'పాదుషా'- 'షా'

**త**న జీవితకాలంలో ఎప్పుడూ ఇక మాంసాహారం భుజించనని భీష్మ ప్రతిజ్ఞ చేసిన ప్రపంచ ప్రసిద్ధ రచయిత జార్జి బెర్నార్డ్ షా

బలవంతంగా ఓ ముసలి గుర్రాన్ని కసాయివాడి మనుషులు ఈడ్చుకు పోతుండడం చూసి, మనసు చెదిరి, ఈ నిర్ణయం తీసుకున్నాడు జార్జి బెర్నార్డ్ షా.

ఒకసారి బెర్నార్డ్ షాకు తీవ్ర అనారోగ్యం కలిగింది బాగా నీరసంగా వున్నాడు

"మాంసాహారం తీసుకోకపోతే మీరు జీవించడం అసాధ్యం" అన్నాడు వైద్య ప్రముఖుడు.

వెంటనే షా "జంతువులు మన తోటి ప్రాణులు. వాటిని తినడమంటే ప్రాణి ప్రాణిని తినడమే! అది నరమాంస భక్షణతో సమానం" అని తన ప్రాణాలను పోగొట్టుకోడానికి సిద్ధపడ్డాడు.

అంతేకాదు – ఆయన తన వీలునామాలో "నా మరణానంతరం నా అంతిమ యాత్రలో శోకహృదయులైన నా ఆప్తమిత్రులు కూర్చున్న వాహనాల సమూహం కాదు నేను కోరేది, నా అంతిమయాత్రలో ఎడ్లసమూహాలు, గొర్రెలు, కోళ్ళు తెల్లటి తల పాగలు ధరించి నడవాలి. వాటిని చంపి తినడాన్ని తిరస్కరించి, చచ్చిన ఓ మహావ్యక్తిని అవి గుర్తుచేయాలి" అంటూ నిజంగానే రాసుకున్నాడు. అందుకే ఆయన రచయితల్లో 'పాదుషా'.

## రాజీవ్‌గాంధీ వదలిన చెణుకు

ఎవరూ ఊహించని పరిస్థితుల్లో సంజయ్‌గాంధీ మృతితో, రాజీవ్‌గాంధీ అయిష్టంగానే రాజకీయాల్లోకి వచ్చి, ఇందిరాగాంధీ మరణంతో ప్రధాని అయ్యాడు.

పైలట్‌గా పనిచేసిన రాజీవ్‌గాంధీ పార్లమెంట్‌లో సందర్భానుసారం మంచి ఛలోక్తులు విసిరేవారు. ఒకసారి హైదరాబాద్‌ను అంతర్జాతీయ విమానాశ్రమంగా మార్చే దిశగా, వున్న 'ఫ్లయిట్స్' సంఖ్య పెంచమని అప్పటి ముఖ్యమంత్రి రామారావు గారు రాజీవ్‌గాంధీమీద ఒత్తిడి తెచ్చారు.

అయితే అప్పుడే వసంతసాఠే (ఇంధన వనరుల మంత్రి) 'బైపాస్ సర్జరీ' చేయించుకుని వచ్చి వున్నాడు. ఆయన హైదరాబాద్‌కంటే నాగపూర్‌కే ఎక్కువ విమానం సర్వీసులు వుండాలని కోరుతూ "నాగపూర్ భారతదేశానికి 'హృదయం' వంటిది దానికి ప్రాధాన్యత ఇవ్వటం అవసరం" అన్నాడు.

వెంటనే రాజీవ్‌గాంధీ "ఎంత హృదయానికైనా, ఈ రోజుల్లో దాన్ని 'బైపాస్' చేయాల్సిన అవసరమూ వుంటుంది!" అన్నాడు

ఇంధన వనరుల మంత్రి 'బైపాస్ సర్జరీ' చేయించుకుని వుండటం, ఆయనే 'నాగపూర్' నగరాన్ని 'హృదయం' తో పోల్చటం, రాజీవ్‌గాంధీ

అన్యాపదేశంగా 'బైపాస్' (లక్ష్యము చేయకుండా వేరే మార్గమున పోవటం) అనే అర్థం— 'బైపాస్ సర్జరీ' అనే అర్థంలో వాడటం జరిగింది

## శ్రీమతి ఇందిరాగాంధీ ప్రత్యేకత

అప్పటి రాజకీయ పరిస్థితుల్లో ఇందిరాగాంధీని 'నియంత' అని ముద్ర వేసినవారు కొందరున్నా— 'రష్యన్ విప్లవ సంవత్సరం' 1917లో పుట్టిన ఆమె నిజంగా విప్లవ వనితే. ఆమె ఒక అపురూప వ్యక్తి.

పాకిస్తాన్ దురాక్రమణ చేసినప్పుడు ఇండియా చేతిలో అది చావుదెబ్బ తిన్నది. ఇతర దేశాలు అందించిన ఆయుధాలు భారతదేశంమీద వాడాలని దాని తాపత్రయం

అయితే పాశ్చాత్యదేశాలు "భారతదేశం పాకిస్తాన్‌తో ఏదోవిధమైన శాంతి ఒప్పందం చేసుకోవటం మంచిది" అంటూ సలహా ఇచ్చాయి.

అప్పుడు ఇందిరాగాంధీ "కవచం ధరించివున్న వ్యక్తి చేతితో కరచాలనమా?" అంటూ పాశ్చాత్యదేశాల పద్ధతిని దుయ్యబట్టింది

1977లో ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ ప్రభావంవల్ల పదవిని కోల్పోయింది ఎలక్షన్లలో ఓడిపోయింది అయితే ఆమె దేశ ప్రధానిగా వున్నప్పుడు ఆమెను చూడటానికి వచ్చినట్టే, బస్సుల్లో తీర్థయాత్రకు వచ్చినట్లు వచ్చేవారు జనం.

ఇదే విషయం ఒక పత్రికావిలేఖరి అడిగితే "ఆగ్రాలో తాజ్‌మహల్— ఢిల్లీలో కుతుబ్‌మినార్ చూశాక ఇక చూడవలసింది ఇందిరాగాంధీనే" అన్నారామె నవ్వుతూ

"ఇందిరాగాంధీ అధికారంలో లేకపోయినా, జనతా ప్రభుత్వం పరిపాలన వచ్చినా— వాళ్ళు ఇంకా మిమ్మల్నే విమర్శిస్తున్నారెందుకని?" అని ఒక పత్రికా ప్రతినిధి అడిగితే—

"వాళ్ళు ఇంకా 'అపోజిషన్' లోనే వున్నామని అనుకుంటున్నారు— అదే వాళ్ళ బలహీనత" అన్నది ఇందిరాజీ – జనతా ప్రభుత్వాన్ని ఎద్దేవా చేస్తూ.

## బంకించంద్రుడు సేవించిన మందు

మనం పాడుతున్న 'వందేమాతరం' గేయం ప్రముఖ వంగకవి బంకించంద్ర చటర్జీ రచించిన ఒక నవలలోనిది.

ఆయన రాసిన నవలలు, కథలు, వ్యాసాలు, గేయాలు అనేకం. ఈ రచనాసక్తితో చివరకు ఆయన తన పెద్ద ప్రభుత్వోద్యోగాన్ని సైతం వదులుకున్నాడు.

జీవితంలో ఆయన క్రమేపీ ఒక వేదాంతిగా మారిపోయాడు.

బంకించంద్ర చటర్జీలో ఈ తాత్వికచింతన ఇలా కలగటానికి కారణం ఒకటుంది.

ఈ భౌతిక జీవితం అశాశ్వతమని, సిరిసంపదలు, భోగభాగ్యాలు తృణప్రాయమైనవనే భావన ఆయనకు కలిగింది. ఆయనకు బాగా అనారోగ్యంగా వున్నా మందులు తీసుకోవటంకూడా పూర్తిగా మానివేశాడు

ఒకరోజు ఒక ప్రముఖ వైద్యుడు బంకించంద్రతో "నీవు మందు తీసుకోక పోతే ఎక్కువ కాలం జీవించవు. మరణాన్ని కోరి ఆహ్వానించినవాడవవుతావు" అన్నాడు.

"మందులు వాడకపోవటమేమిటి? నేను నిత్యం మందు వాడుతున్నానే" అన్నాడు బంకించంద్ర ఆశ్చర్యంగా.

"ఏదీ మీరు వాడుతున్న మందు? చూడనివ్వండి" అన్నాడు వైద్యుడు.

"ఇదుగో నేను నిత్యం వాడుతున్న మందు!" అంటూ తన పక్కనే వున్న భగవద్గీతను చూపాడు బంకించంద్ర.

గీతాపరన ప్రభావంవల్ల ఆయన నవలారచన మానివేశాడు. గీతాప్రభావం వల్ల ఆయనలోని దైవచింతన, తత్వజ్ఞానం, వేదాంతం ఆయన రచనలకు ఆధారాలయ్యాయి.

## ప్రేమ్‌చంద్ సృష్టించిన సంచలనం

'ప్రేమ్‌చంద్' పేరుతో విశ్వవిఖ్యాతిపొందిన మహారచయిత అసలు పేరు ధనపతిరాయ్ శ్రీవాత్సవ.

ఆయన కలెక్టర్ ఆఫీసులో ఒక ఉద్యోగి. 'ప్రేమ్‌చంద్' కలంపేరుతో

ఆయన రాయకముందు 'నవబ్రాయ్' అనే కలం పేరుతో రచనలు చేశాడు.

'నవబ్రాయ్' కలం పేరుతో 'సోజీవతన్' (దేశంలోని కాంతిపుంజాలు) అనే గ్రంథాన్ని రాశాడు ప్రేమ్‌చంద్.

దీన్ని ప్రభుత్వం నిషేధించేవరకూ వెళ్ళింది. అప్పటి బ్రిటీష్ కలెక్టర్ ఎలాగో దయతలచి ప్రేమ్‌చంద్ ఉద్యోగం ఊడగొట్టలేదు.

"ప్రభుత్వాన్ని కష్టపెట్టే రచనలెందుకు చేయటం? ఇకనుంచి ఆ పని చేయకు" అని హెచ్చరించాడు.

ఈ గొడవ పడలేకే, ఈసారి 'ప్రేమ్‌చంద్' అనే మరో కలం పేరుతో రచనలు సాగించాడు ధనపతిరాయ్ శ్రీవాత్సవ.

తరువాత 'సమరయాత్ర' అనే గ్రంథాన్ని 'ప్రేమ్‌చంద్' కలం పేరుతో రాశాడు.

ఈ గ్రంథం చదివిన కలెక్టర్– "ఈ ప్రేమ్‌చంద్ నిజంగా దేశభక్తిని ఎంత గొప్పగా చిత్రించాడో మాటల్లో వర్ణించలేను. ఇదే రచయిత మా ఇంగ్లాండ్‌లో వుండివుంటే పరిస్థితి భిన్నంగా వుండేది. ఇంత గొప్పరచయితను కలుసుకోవటం జరిగితే ఎంతబాగుండు" నన్నాడు

'నవబ్రాయ్', 'ప్రేమ్‌చంద్', ధనపతిరాయ్ శ్రీవాత్సవ ఒకరేనన్న సంగతి ఆ జిల్లా కలెక్టర్‌కు తెలియదు

## 'మంక్'– 'మంకీ'కి తేడా చెప్పిన స్వామి వివేకానంద

స్వామి వివేకానందుడు రామకృష్ణపరమహంస శిష్యుడుగా కేవలం ఆధ్యాత్మిక ప్రసంగాలతోనే కాలక్షేపం చేయలేదు.

వివేకానందుడి గురువు రామకృష్ణపరమహంసకు విద్యలేదు. అయితే పెద్ద పెద్ద విద్యావేత్తలు ఆయన ప్రసంగం వింటే ఆయన శిష్యపరంపరలో చేరేవారు.

ఒక ప్రముఖ విద్యావేత్త రామకృష్ణుణ్ణి, ఆయన ఆధ్యాత్మిక బోధనలను ఎగతాళి చేస్తూ వుండేవాడు.

ఒకసారి వివేకానందుణ్ణి పిచ్చి పిచ్చి ప్రశ్నలు వ్యంగ్యంగా వేసి వేధించసాగాడు

వివేకానందుడు అతని ప్రశ్నలన్నిటికీ ఓర్పుగా సమాధానాలు చెబుతూ వస్తున్నాడు.

చివరికి ఆ విద్యావేత్త "కోతినుంచి మనిషి వచ్చాడంటారు. మరి 'మంక్' (సన్యాసి)కి 'మంకీ' (కోతి)కి తేడే ఏమిటి?" అన్నాడు వివేకానందుడికి ఎదురుగా వున్న పెద్ద బల్లముందు కూర్చుంటూ.

వివేకానందుడు అతనివైపు వేలు చూపుతూ "ఇప్పుడు మనిద్దరమే దానికి గట్టి ఉదాహరణ. ఒకవైపు 'మంక్', మరోవైపు 'మంకీ'" అన్నాడు అక్కడున్నవారి నందరినీ నవ్విస్తూ.

## రూజ్‌వెల్ట్‌కు నచ్చిన అంశం

అమెరికా ప్రెసిడెంట్‌గా రూజ్‌వెల్ట్ రాకమునుపు పూర్వాశ్రమంలో ఆయన అమెరికాలోని న్యూయార్క్ నగరానికి పోలీస్ కమీషనర్‌గా కొన్నాళ్ళు పనిచేశారు.

పోలీస్ కమీషనర్‌గా ఆయన అభ్యర్థుల్ని పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి ఎన్నుకోవడంలో రకరకాల పరీక్షలు పెట్టి, ముఖాముఖి ప్రశ్నలు వేసి, తెలివితేటలకి, సమయస్ఫూర్తికి ప్రాధాన్యత ఇచ్చేవాడు.

"శరీరదారుఢ్యంతోపాటు పోలీసులుగా చేరే అభ్యర్థులు సమయానుకూలంగా ప్రవర్తించే సమయస్ఫూర్తికే అధిక ప్రాధాన్యత ఇవ్వాలి " అని నమ్మిన వ్యక్తి రూజ్‌వెల్ట్.

ఒకసారి ఇలాగే పోలీసు అభ్యర్థుల ఎంపిక ఫైనల్ స్టేజీలో వుంది

చివరికి మిగిలిన అభ్యర్థుల్లో ఎవరు మంచి తెలివిగల సమాధానం చెబితే అతన్నే ఉన్నతస్థాయి ఉద్యోగానికి ఎన్నిక చేయాలనుకున్నాడు రూజ్‌వెల్ట్.

"పెద్ద గుంపు ఒకచోట గుమికూడితే– ఆ గుంపును చెదరగొట్టడానికి నువ్వు ఏం చేస్తావు?" అన్నాడు.

వెంటనే ఒక అభ్యర్థి "అలాంటి పరిస్థితిలో నేను నా టోపీని చందాలు వసూలు చేయడానికి వాడతాను. దానితో జనం చెల్లాచెదరైపోతారు" అన్నాడు.

రూజ్‌వెల్ట్ అతని సమయస్ఫూర్తికి మెచ్చి, అతన్నే ఉన్నత పదవికి ఎన్నుకున్నాడు.

## డా॥ జాన్సన్‌కు చురక అంటించిన మహిళ

డా॥ శామ్యూల్ జాన్సన్ అంటే 'ఆంగ్లంలో మొదటి నిఘంటు' రచయిత.

ఆయన బహుభాషా పండితుడు, రచయితేకాక, మంచి చణుకులు విసరడంలో ఘటికుడు.

అయితే ఒకసారి ఆయన మీదే ఒక స్త్రీ చణుకు విసిరింది.

ఒకసారి డాక్టర్ జాన్సన్ స్కాట్‌లాండ్ టూర్ చేస్తుండగా, ఆయనను ఒక స్త్రీ అభిమాని, తన ఇంటికి పిలిచి ఆతిధ్యమిచ్చింది.

స్కాచ్ దేశస్థులు ప్రత్యేకంగా తయారుచేసే ప్రత్యేక వంటకం డాక్టర్ జాన్సన్ కోసం సిద్ధం చేసింది.

డాక్టర్ జాన్సన్ పెద్ద తిండిబోతు. మంచి డిన్నర్‌కు కూర్చుంటే తక్కినవాళ్ళకు వుందా లేదా కూడా చూడకుండా మొత్తం తినేస్తాడు.

డాక్టర్ జాన్సన్ సంగతి తెలిసినవాళ్ళు "అంత పెద్ద పండితుడి పక్కన కూర్చోవడమే గొప్ప. తింటే తిన్నాళ్ళే డిన్నరంతా" అని ఓర్చుకునేవాళ్ళు.

ఆ రోజు డిన్నర్ ఇచ్చిన స్కాచ్ దేశస్థురాలు ఎగబడి బకాసురుడిలా తింటున్న డాక్టర్ జాన్సన్‌తో "ఇప్పుడు మీరు తిన్న ప్రత్యేక వంటకం ఎలా వుంది?" అంది

"ఏం వంటకం అది? అదో ప్రత్యేక వంటకం అంటూ చెబుతున్నావా? ఇది పందులు కూడా తినవు" అన్నాడు ఎగతాళిగా ఖాళీపళ్ళెం చూపుతూ.

"అయితే మీకు ఇంకాస్త వడ్డించాలన్నమాట" అంటూ, ఆవిడ జాన్సన్ మాటకు మాట అంటించింది

## రాజాజీ ప్రత్యేక ధోరణి

రాజకీయాల్లో ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వమున్న వ్యక్తిగా శ్రీరాజాజీ ప్రసిద్ధుడు

స్వతంత్ర భారతదేశపు మొదటి గవర్నర్ జనరల్‌గా, అవిభక్త మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా– రామాయణ, భారత, బాగవత, భగవద్గీతలను చక్కటి ఇంగ్లీషులో రచించిన రచయితగా ఆయన చిరస్మరణీయుడు.

మొదట కాంగ్రెస్‌వాది అయినా ఆయన తరువాత దానికి వ్యతిరేకి అయి, నెహ్రూజీనే ఎదుర్కొన్నాడు. ఒకసారి ఏదో సభలో నెహ్రూజీ మాట్లాడుతూ "నేను దేవుడికీ భయపడను" అన్నారట

ఆ మాట విన్న రాజాజీ "ఆయన దేవుడున్నాడనే నమ్మడుగాదా! ఇంకా ఎలా భయపడతాడు?" అన్నాడట.

రాజాజీ పశ్చిమబెంగాల్ గవర్నర్‌గా వుండగా రాజాజీ, నెహ్రూ గారు కలసి గ్రూప్ ఫోటో దిగాల్సి వచ్చింది.

ఫోటోగ్రాఫర్– ప్రధాని పక్కన గవర్నర్, తక్కిన మంత్రుల్ని ఫోటో నీట్‌గా రావడానికి సర్దుతున్నాడు. అటువాళ్ళని ఇటు, ఇటువాళ్ళని అటు నిలబడమన్నాడు

నెహ్రూ గారికి విసుగుపుట్టి "ఇంతకీ మనను ఏం చేయమంటాడు?" అన్నారు రాజాజీతో.

"ఫోటో బాగా పడడానికి నోరు మూసుకోమంటున్నాడు" అంటూ చమత్కరించాడు రాజాజీ.

శరత్‌బాబు ప్రముఖ బెంగాలీ రచయిత. అనారోగ్యంతో వుండడంతో స్వయంగా గవర్నర్‌గా వున్న రాజాజీ ఆయన్ను చూడడానికి వెళ్ళి ఆయనను కావలించుకున్నాడు రచయితలంటే ఆయనకు గౌరవం ఎక్కువ.

"నన్ను చూడడానికి మీ అంతవారు స్వయంగా వచ్చారా?" అని శరత్‌బాబు అనగానే– "కొండను దర్శించాలని నేనే తరలి వచ్చాను" అన్నారు రాజాజీ శరత్‌బాబును పొగుడుతూ

## సంభాషణాకారుడు నేర్చుకోవాల్సింది

మంచి వక్తలుగా చెప్పాలంటే, పూర్వం సురేంద్రనాథ్ బెనర్జీ, కృష్ణమీనన్‌వంటి వారి పేర్లు చెప్పాలి.

మంచి వక్త అంటే, సభారంజకంగా మాట్లాడగలిగి వుండడం, శ్రోతలను తనతోపాటు ఆయా భావోద్వేగాలు కలిగేట్టుగా రసానుభూతిలోకి తీసుకెళ్ళగలిగే ఉపన్యాసకుడు. మన తెలుగునాట ఈ విషయంలో శ్రీ రామారావు గారి పేరు చెప్పాలి.

పాశ్చాత్యుల్లో ఇలాంటి వాళ్ళల్లో హార్వర్డ్ యూనివర్సిటీ ప్రొఫెసర్, ఛార్లెస్ కోప్‌లాండ్ పేరు చెప్పాలి

ఒకసారి ఈ సంభాషణా కళలోని మెళకువలు నేర్చుకోడానికి ఒక యువకుడు ఆయన దగ్గరకు వచ్చాడు.

"నేను సంభాషణా కళలో ప్రతిభావంతుణ్ణిగా మారడానికి ప్రధమంగా నేర్చుకోదగ్గ అంశం వుందా సార్?" అన్నాడు ప్రొఫెసర్ గారితో.

"లేకపోవడమేమిటి? నువ్వు ఒకసారి జాగ్రత్తగా విని గుర్తు పెట్టుకోగలిగితే, ఆ ప్రాథమిక సూత్రం నీకు చెబుతాను" అన్నాడు.

ఇంతలో మరెవరో వస్తే, వాళ్ళతో మాట్లాడసాగాడు ప్రొఫెసర్ గారు.

చాలాసేపు ఓపికపట్టిన ఆ విద్యార్థి ఆ వచ్చినవాళ్ళు వెళ్ళేవరకు ఆగాడు.

అప్పుడు ప్రొఫెసర్ "ఇక నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడు.

ఆ విద్యార్థికి అర్థంకాక నోరు వెళ్ళబెట్టి చూస్తుంటే "ఇప్పుడు నేను చేసిన సంభాషణ విన్నావుగా. ముందు నువ్వు తెలుసుకోవాల్సింది ఇదే! ఇతరులు ఎలా సంభాషిస్తున్నారో జాగ్రత్తగా వినడం నేర్చుకో" అన్నారు ప్రొఫెసర్ గారు.

## సత్యమూర్తి 'సత్య'మూర్తే!

అవిభక్త మద్రాసు రాష్ట్రంలో, తరువాత పార్లమెంట్‌లో 1930 నుంచి ప్రముఖ పాత్ర వహించిన వాళ్ళల్లో జాతీయవాదిగా, ప్రముఖ దేశభక్తుడుగా శ్రీ సత్యమూర్తికి మంచి పేరుంది.

1934లో మద్రాసు అసెంబ్లీ ఎన్నికల్లో స్వతంత్ర అభ్యర్థిగా సత్యమూర్తి, రామస్వామి మొదలియార్ గారు జస్టిస్ పార్టీ తరఫున పోటీపడ్డారు.

వ్యంగ్య బాణాల్ని ఈటెలుగా విసరే ప్రత్యేకత వున్న సత్యమూర్తి జస్టిస్ పార్టీని, ఆ పార్టీ తరఫున పోటీచేస్తున్న మొదలియార్‌ని మెత్తగా తిడుతూ "జాతి ప్రయోజనాలకు భంగం కలిగేట్టు ప్రవర్తించే జస్టిస్ పార్టీవాళ్ళు తమ సిద్ధాంతాలను తాకట్టు పెట్టే హీనస్థాయికి దిగజారిపోయారు" అన్నాడు

ఈ మాటల్ని జస్టిస్ పార్టీ వాళ్ళు చాలా తీవ్రంగా పరిగణించి "మా పార్టీ సిద్ధాంతాల విషయం ఆయనకెందుకు? ఈ మాటలన్నందుకు ఆయనచేత క్షమాపణ చెప్పించాల్సిందే" అంటూ పెద్ద రభస చేశారు

అయితే సత్యమూర్తి మాత్రం, తొణక్కుండా మరో మీటింగులో మాట్లాడుతూ "నేను అన్నదాంట్లో తప్పులేదు మళ్ళీ ఆలోచిస్తే నేను జస్టిస్ పార్టీ తమ సిద్ధాంతాలను తాకట్టు పెడుతున్నదన్నమాట ఇప్పుడు నిజం కాదనిపిస్తున్నది. ఎందుకనంటే - అసలు వాళ్ళకు సిద్ధాంతమంటూ ఒకటి ఏడిస్తేగా?" అన్నాడు మళ్ళీ.

సత్యమూర్తి విషయం తెలిసిన జస్టిస్ పార్టీవాళ్ళు మళ్ళీ ఆ టాపిక్ ఎత్తలేదు.

## వాల్మీకి వంశీయుణ్ణి - జాగ్రత్త!

ఒకసారి అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు జరుగుతున్నాయి.

ఆ సభలో వేదికమీద మహావీర్ త్యాగి, అనంతశయనం అయ్యంగారు వున్నారు.

వారిద్దరి మధ్య ఓ యువతి కూర్చుని వుంది

కాంగ్రెస్ సభల్లో ఎక్కువసార్లు సభా నిర్వహణ కోసం అక్కడికక్కడే చందాలు వసూలుచేసే సాంప్రదాయం వుంది.

అక్కడ చందాలు ఏ రూపంలోనైనా వసూలు చేస్తారన్న విషయం ఊహించిన అనంతశయనం అయ్యంగారు తన పక్కనే వున్న యువతి మెడవైపు చూశారు

ఆ అమ్మాయికి ఆశ్చర్యంవేసి "ఏమిటీ! అలా చూస్తున్నారు?" అంది.

"ఏం లేదమ్మా! నీ మెడలోని గొలుసు జాగ్రత్తగా చూసుకో" అన్నాడు అనంతశయనం అయ్యంగారు.

ఆ అమ్మాయికి అర్థంకాక కొంచెం భయంగా "ఏం? ఎందుకని?" అంది కంగారు అణచుకుంటూ.

"ఏం లేదు! ఈ మహావీర్ త్యాగి, ఆ గొలుసు కొట్టేస్తాడేమోనని నాకు అనుమానంగా వుంది" అన్నాడాయన.

అయ్యంగారి హాస్యాన్ని అర్థం చేసుకున్న మహావీర్ త్యాగి, "ఔనమ్మా! జాగ్రత్త! నేను దొంగల జాతికి చెందిన వాల్మీకి వంశీయుణ్ణి" అన్నాడు నవ్వుతూ.

అక్కడివారంతా హాయిగా నవ్వుకున్నారు

# విద్యాసాగరుడు దయాసాగరుడే!

ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ది నిరవధిక సానుభూతి హృదయం. ఆయన ఔదార్యం విశాలం. ఆయన మానవతాదృష్టి అపారం, అనంతం.

ఈశ్వరచంద్రునికి సమకాలీన కవి, బెంగాలీ అయి వుండి క్రైస్తవ మతం స్వీకరించిన ప్రముఖుడు మైఖేల్ మధుసూదనదత్తు. ఆయన అమరకావ్యం "మేఘనాధ బాధ" – అనేది రచించి, ఆధునిక బెంగాలీ కవిత్వంలో పెద్ద సంచలనం సృష్టించాడు.

అయితే, ఆయన ఓ ఫ్రెంచి యువతిని పెళ్ళిచేసుకుని, ఫ్రాన్సులో వుంటూ, పిల్లలతో సహా పస్తులుంటూ, కారాగారందాకా వెళ్ళే పరిస్థితి ఏర్పడింది. తన దీనగాధను వెల్లడిస్తూ హృదయం కరిగే ఉత్తరం, ఆయన విద్యాసాగర్‌కు వ్రాశాడు.

ఈ ఉత్తరం విద్యాసాగరుణ్ణి కదిలించివేసింది. తన తోటి రచయిత పరాయి దేశంలో జైలుకెళ్ళి అవమానాలపాలు కారాదని, ఎందరినో కోరాడు మైఖేల్ మధుసూదన దత్తు కోసం విద్యాసాగరుడు.

ఎవరిలోనూ తగిన స్పందన రాకపోవటంతో చివరికి తనే అప్పుచేసి 1500 రూపాయలు (ఆ రోజు అది చాలా పెద్దమొత్తం) ఆ కవికి వెంటనే పంపాడు

అంతేకాదు, అక్కడ, ఆయన వకీలుగా ఎదిగేవరకు ఆ విధంగా డబ్బు క్రమంగా పంపుతూనే వున్నాడు.

విద్యాసాగరుడు వచన రచనలో ఎంత ఘటికుడో, పద్యరచనలో అంత సమఉజ్జీ మైఖేల్ మధుసూదన్. తమ నిర్భీకమైన నవ్యపద్ధతులలో సాహిత్య విప్లవశంఖారావం పూరించినవారే ఆ యిద్దరు సాహితీమూర్తులు.

క్రైస్తవ మతం ఆ రోజుల్లో స్వీకరించటమంటే సామాన్యమైన విషయం కాదు. విద్యాసాగరుడు అవన్నీ పట్టించుకోకుండా,తన తోటి రచయితకు సాయం చేయటానికి ఆ రోజుల్లో వేల రూపాయలు వెచ్చించటం, తను అప్పుల్లో కూరుకుపోవటం జరిగింది

## కుడి ఎడమైతే- ప్రథమ బహుమతే!

ప్రముఖ ఆధునిక చిత్రకళాకారుల చిత్రాలకు ఒక్కోసారి ఎందుకు ప్రథమ బహుమతులు వస్తాయో వారికే తెలియదు.

బ్రిటీషు వైస్రాయి భారత పర్యటనకు వచ్చినపుడు ప్రముఖ ఆంధ్ర చిత్రకారుడు దామెర్ల రామారావు గీసిన 'గోదావరి కనుమ' అనే చిత్రానికి అత్యధిక పారితోషికం ఇచ్చి, కొన్నాడు

ప్రముఖ ఆధునిక చిత్రకారుడు, హుస్సేన్, సినీ నటి మాధురీ దీక్షిత్ అభిమానిగా ఆమెను ఆధునిక చిత్రకళలో చిత్రించగా, ఆ బొమ్మలు లక్షలకు లక్షలు ధరలు పలుకుతున్నాయి.

ఎడ్వార్డ్ డికిన్‌సన్ ఆధునిక చిత్రకారుడుగా అనేక చిత్రకళాప్రదర్శనల్లో ప్రథమ బహుమతులు పొందాడు.

ఒకసారి ఈయన పాల్గొన్న చిత్రకళా పోటీల్లో ఈయన చిత్రానికి ప్రథమ బహుమతి వచ్చింది. తనతోపాటు ఇంకెవరెవరు చిత్రకారులు, వాళ్ళ కళాఖండాలు పోటీపడ్డాయో తిరిగి చూస్తున్నాడు ఎడ్వార్డ్ డికిన్‌సన్. ఆయన చిత్రించి ప్రథమ బహుమతి పొందిన చిత్రకళాఖండం తలక్రిందులుగా గోడకు పెట్టబడి వుంది.

"ఎవరది, ఈ కళాఖండాన్ని ఇలా పెట్టింది?" అన్నాడు ఎడ్వార్డ్ డికిన్‌సన్ కోపంగా.

"మేమే! ఏమైంది?" అన్నారు నిర్వాహకులు భయంగా.

'ఓహో! తలక్రిందులుగా పెట్టటంవల్లే ఈ బహుమతి వచ్చి వుంటుంది' అనుకున్నాడు చిత్రకారుడు లోలోపల.

## ఒక విషయంగా మొరార్జీ-సంజీవయ్యల స్పందన

ఢిల్లీలో కేంద్రమంత్రిగా వుండగా సంజీవయ్య మొరార్జీదేశాయ్‌తో కలిసి చర్చికి వెళ్ళారు. అక్కడ ఒక ప్రముఖ వ్యక్తి కుమారుడి పెళ్ళి.

క్రైస్తవ సంప్రదాయ ప్రకారం చర్చిలో గాంధీ టోపీలు పెట్టుకెళితే బాగుండదని సంజీవయ్యగారు తను పెట్టుకున్న టోపీ తీసివేశారు

మొరార్జీదేశాయ్ తన నెత్తిన వున్న టోపీని మాత్రం తీయలేదు.

పైగా సంజీవయ్యగారి నెత్తిన టోపీ కనిపించకపోవటంతో "మీ టోపీ ఏమైంది?" అని అడిగారు.

"చర్చిలో వున్న క్రైస్తవ సోదర సోదరీమణుల మనోభావాలను నొప్పించినవాడిని అవుతానేమోనని నా టోపీని కారులోనే వదలి వచ్చాను" అన్నారు సంజీవయ్య.

మొరార్జీదేశాయ్ మాత్రం "లేదు లేదు. అది సరికాదు. నేను వివాహానికి హాజరవటమైనా మానుకుంటానుగానీ, నా టోపీని మాత్రం వదలను!" అన్నారు.

గాంధీ టోపీనే కాదు, గాంధీజీ సిద్ధాంతాలను తు.చ. తప్పక పాటించారు మొరార్జీదేశాయ్. అయితే సంజీవయ్యగారు గాంధీజీ సిద్ధాంతాలకు అంకితమైన ఆదర్శమహామహుడు.

ఇద్దరూ ఒకే విషయంగా ఎలా స్పందించారో తెలియజేయటానికే ఈ అంశం ఉదాహరించటం.

## నెహ్రూజీ చెప్పిన నిజం

పైకి నెహ్రూ గారికి ముక్కోపం వున్నా, పసిపిల్లవాడిలా కపటంలేని మనస్తత్వం.

ఆయనది ఏ విషయమైనా దాపరికం లేకుండా గలగల మాట్లాడే మాటతీరు. ఆయన కాంగ్రెస్ అగ్రనాయకుడైనా కాంగ్రెస్‌లో పెద్ద నాయకుల్ని సైతం వదిలే మనస్తత్వం లేనివాడు.

ఒకసారి ఆయన పెద్ద కాంగ్రెస్ మహాసభలో ప్రసంగిస్తూ "ఖాదీ టోపీ విలువ, అది వుండవలసిన స్థానమే కాదు మనకు కావలసింది. అది ఎక్కడైతే పెట్టుకుంటున్నామో ఆ తలలో కూడా కాస్త ఆలోచించే శక్తీ వుండేట్టు చూసుకోవాలి" అన్నాడు.

జయప్రకాష్ నారాయణ్ ఒకసారి "మన అగ్రనాయకులంతా తమ తమ అధికార పదవులు వదలి, ప్రజలలోకి వచ్చి, నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని చేపడితే బాగుంటుంది" అన్నాడు నెహ్రూజీతో.

వెంటనే నెహ్రూజీ "గొప్ప మేధావులెవరూ ప్రభుత్వంలో పని

చేయటానికి ఇష్టపడరులెండి. నాబోటి రెండవస్థాయి నాయకులే ఇలా ప్రభుత్వంలో వుండి, పనిచేయగలిగేది" అన్నారు.

"మీరు మేధావి కాబట్టి, ప్రజల్లో వుండి నిర్మాణాత్మకమైన పనులు చేబట్టటానికి మీరు వుండండి" అని నెహ్రూజీ అన్యాపదేశంగా చెప్పక చెప్పారన్నమాట.

## చివరివరకు వాల్టేర్ నమ్మిన నాస్తికవాదం

వాల్టేర్ ప్రముఖ ఫ్రెంచి రచయిత, మూఢమత భావాలకు, ఆచారాలకు అతీతుడు. ఆయనకు ఫ్రాన్స్ దేశం నుండి దేశబహిష్కరణ జరిగినప్పుడు ఆయన లిస్బన్ నగరంలో వుండగా, ఘోర సంఘటన ఒకటి జరిగింది.

ప్రార్థనలు చేయటానికి పర్వదినాన వేలమంది చర్చిలో వున్నారు. సరిగా అప్పుడే భయంకర భూకంపం వచ్చి, ఆ చర్చిలోనే అంతా మరణించి సమాధి అయ్యారు.

ఈ సంఘటన ఆధారముగా మతాచార్యులు "ప్రజల పాపములు పండి, అది భూకంపరూపము దాల్చింది. ఇకనైనా భగవంతునిపట్ల భక్తివిశ్వాసాలతో మెదలటమే మేలు" అని ప్రచారం చేయసాగారు.

ఈ మాటలు విన్న వాల్టేర్ "ఈశ్వరుడికి ఈ అనర్థాన్ని ఆపే సామర్థ్యము లేదనే ఈ సంఘటన రుజువు చేస్తున్నది. మనుషులు చేసిన పాపాలకే ఈ శిక్ష ఫలమని ఎలా అనుకోగలము – దేవాలయములో, పర్వదినాన ఇంతమంది ప్రార్థన చేస్తుండగా చనిపోవటమేమిటి? దీన్నిబట్టి సృష్టి అంతా హింసామయముగా కనబడుతున్నది" అంటూ వాపోయాడు

వాల్టేర్ మరణశయ్య మీదుండగా, ఓ మతాధికారి ఆయనచేత ప్రార్థన చేయించడానికి వెళ్ళాడు.

"నిన్నెవరు పంపారు?" అడిగాడు వాల్టేరు.

"ఎవరో కాదు ఈశ్వరుడే స్వయంగా పంపాడు" అన్నాడు ఆ మతాధికారి.

"నీ మాటలు నేను నమ్మను నువ్వు దేవుడు పంపిన ప్రతినిధే అయ్యుంటే ఆయన నీకిచ్చిన పరిచయపత్రం, అందులో నిన్ను ఈ పనిమీద పంపినట్లుందా?" అన్నాడు వాల్టేరు

## ఆ చెంపదెబ్బే పదివేలా?

ప్రముఖ ఫ్రెంచి రచయిత, వాల్టేరు సృష్టించినంత వైవిధ్యం ఉన్నత ప్రమాణాలున్న రచనలు చేసినవారు అరుదు.

ప్రష్యానుంచి వాల్టేరు ప్రాణభయంతో తప్పించుకు వెళుతున్నాడు. అప్పుడే ఆయన రచనలను ఇదివరకు ప్రచురించిన ప్రచురణకర్తకు, వాల్టేరు దేశం విడిచిపెట్టి పారిపోతున్న సంగతి తెలిసింది.

అతను వాల్టేరును ఆపి, "నా పైకం వడ్డీతో సహా చెల్లించు. లేకపోతే నిన్ను కదలనివ్వను" అంటూ మొండికెత్తాడు.

దీనితో ఒళ్ళు మండిన వాల్టేరు "ఇదిగో! వడ్డీతో కూడా నీ సొమ్ము ముట్టజెబుతున్నాను తీసుకో" అంటూ, చెంప పగిలేట్టు ఒక్కటి ఇచ్చాడు.

'డబ్బులు ఇవ్వకపోగా అంతదెబ్బ కొట్టిన వాల్టేరును ఏంచేయాలా?' అని ఏడుపు ముఖంతో నిలబడ్డ ఆ ప్రచురణకర్త దగ్గరికి అతని కార్యదర్శి పరిగెత్తుకొచ్చి జరిగింది తెలుసుకున్నాడు.

"ఇంకా మీరు డబ్బు కోసం దిగులుపడకండి. ప్రపంచ మహాపురుషులలో అగ్రగణ్యుడు, మహామేధావి, ప్రసిద్ధరచయితచేత చెంపదెబ్బ తిన్నారు. ఇంత అదృష్టము మరొకరికి లభిస్తుందా. పదండి వెళదాము" అంటూ, నచ్చచెప్పి, ప్రచురణకర్త కార్యదర్శి ప్రచురణకర్తను తీసుకుపోయాడు.

## ఒకే కుటుంబంలో మూడు 'నోబెల్ శాస్త్ర' బహుమతులు

మేడమ్ క్యూరి రేడియం కనిపెట్టడంవల్ల 'కేన్సర్' వ్యాధి నివారణలో అది వహిస్తున్న ప్రధానపాత్ర ఎవరూ కాదనలేనిది.

ఇక్కడ వింత విషయం ఏమిటంటే, ఆ కేన్సర్ వ్యాధికి ఆమె కూడా గురైంది.

1920లో మేడమ్ క్యూరీతో పనిచేయటానికి వచ్చిన ఫ్రెడరిక్ జోలియోతో ఆమె పరిచయం చివరికి ప్రణయమై, వివాహానికి దారితీసింది.

వారి పరిశోధనా ప్రాధాన్యత గుర్తించిన శాస్త్రవేత్తలు వారి ఔన్నత్యాన్ని అభినందించారు. 'రేడియం' కనిపెట్టటంలో వారు చేసిన శ్రమ ఫలితంగా 1935లో వారిద్దరికీ సంయుక్తంగా 'నోబెల్ సైన్సు' బహుమతి లభించింది.

ఇది జరిగిన సరిగ్గా 21 ఏళ్ళకు వారి కుమార్తె తల్లి పర్యవేక్షణలో పరిశోధనలు చేసి మళ్ళీ 'నోబెల్ సైన్సు' బహుమతి పొందింది.

తల్లి కోరిక మీద ఇర్ని క్యూరి (క్యూరీ దంపతుల కుమార్తె) 'రేడియో యాక్టివిటీ' మీద పరిశోధనలు చేసి, తిరిగి 'నోబెల్' బహుమతి పొందింది.

ఒకే కుటుంబంలో, ముగ్గురు నోబెల్ శాస్త్ర బహుమతులు పొందినవారుగా, ఈ కుటుంబం చరిత్రకెక్కింది.

## పాటలే ఇసాక్ వాట్‌కు తిరుగులేని వ్యాధి

ఇసాక్ వాట్–భక్తి గీతాలు ఆంగ్లంలో రచించిన ప్రముఖ రచయిత.

ఆయన గీతాలు అన్ని చోట్లా ప్రపంచవ్యాప్తంగా అందరూ పాడుతుంటారు.

అతను చిన్నపిల్లవాడుగా వుండగానే ఇసాక్, ఆశువుగా పాటలల్లి అప్పటికప్పుడే పాడుతుండేవాడు.

ఇతని పాటల పిచ్చితో తండ్రికి కోపం వచ్చి ఒకరోజు "ఇకనుంచి పాటలు వ్రాయటం–పాడటం మానుతావా లేక తాట తీయమన్నావా?" అంటూ అరిచి గోలచేశాడు.

"ఇక పాటలు వ్రాయను" అంటూ ఇసాక్ చెంపలు వేసుకున్నాడు.

అయితే, ఒకరోజు కుటుంబ సభ్యులంతా దైవప్రార్థనలో మునిగి మోకాళ్ళమీద కూర్చుని వున్నారు.

ఒక ఎలుక తాటిమీద ప్రాకుతూ ఇంటికప్పు వైపుకు పోతోంది.

ఆ ఎలుక పరిస్థితి చూసేప్పటికి ఇసాక్‌కు మళ్ళీ పాట ఆశువుగా నోటినుంచి వెలువడింది.

అంతా ప్రార్థనలో మునిగివుంటే, ఇసాక్ అలా ఆశువుగా పాటలు పాడటంతో తండ్రికి కోపం వచ్చి కొడుకువైపు తీక్షణంగా చూసేప్పటికి, "ముందు మెట్లు లేక, పైకి పోలేక, కిందపడబోతున్న ఆ ఎలుక సంగతి చూడండి" అంటూ ఇసాక్ పాట ఎత్తుకున్నాడు.

తండ్రికి తెలిసింది, ఇసాక్ వ్యాధికి తిరుగులేదని.

## చర్చిల్ కుమార్తె సాధించిన విజయం

గొప్పవారి సంతతి కావటం ఒక్కోసారి గొప్ప ప్రతిభావంతులకు పెద్ద లోపం అయిపోతుంది.

నెహ్రూ కుమార్తె – ఇందిరాగాంధీని ప్రధానమంత్రిని చేసింది ఆమె నెహ్రూగారి ఏకైక వారసురాలు కావటమే.

అలాగే ప్రముఖులైన చిత్రనటులకూ – వారి సంతతికీ ఈ నియమం వర్తిస్తుంది

రెండో ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటీషు సామ్రాజ్య కీర్తి ప్రతిష్టలు ఇనుమడింపజేసిన చర్చిల్ మహాశయుడి కుమార్తె, సారా చర్చిల్‌కూ తండ్రి పేరు ఇబ్బంది కలిగించింది.

సినీ నటిగా సారా చర్చిల్ మంచి పేరు ప్రతిష్టలు సంపాదించినా, ఒకసారి ఒక విలేఖరి "మీరు బ్రిటీష్ ప్రధానిగా పనిచేసిన చర్చిల్ కుమార్తెగా గుర్తింపు పొందటం వలననే నటిగా గుర్తింపు పొందారనుకుంటా?" అన్నాడు.

"ఈ విషయమే నేను, ఒకసారి పోప్ గారినీ అడిగి, పేరు మార్చుకుంటానన్నాను" అంది సారా చర్చిల్.

"మరి ఆయన ఏ సలహా ఇచ్చారు? " అడిగాడు పత్రికావిలేఖరి.

"దానికాయన నవ్వి, తండ్రి పేరుతో గుర్తింపు కోసం ప్రతిభావంతులు ప్రయత్నించరు. తమ స్వీయప్రతిభతో తమ పేరుకు గుర్తింపు—అలాగే తల్లిదండ్రులకు కీర్తి ప్రతిష్టలు తెస్తారు అన్నారు."

సారా చర్చిల్ చెప్పినట్టే ఆమె తన మాట నిలబెట్టుకుంది. మంచి నటిగా గుర్తింపు పొందింది.

## విజయానికి నాంది పలికిన వీడ్కోలు

ప్రముఖ కవి, 'రూపర్ట్ బ్రూక్'కు సముద్రయానమంటే ఇష్టం.

ఒకసారి ఆయన లివర్‌పూల్ నుంచి చిన్న చిన్న పడవల్లో పోటీపడి నడపాలనుకున్నారు.

అందరికీ వీడ్కోలు చెప్పి "మీకు విజయం ఆకాంక్షిస్తున్నాను" అంటూ చెప్పటానికి చాలామంది సముద్రపు ఒడ్డుకు వచ్చారు.

అయితే రూపర్ట్ బ్రూక్‌కు వీడ్కోలు చెప్పటానికి ఒక్కడూ రాలేదు.

"అందరికీ వీడ్కోలు చెప్పే స్నేహితులు–తెలిసినవారున్నారు. అయితే తనకొక్కడికే 'నా' అన్నవాళ్ళు లేకుండాపోయారు" అంటూ రూపర్ట్ బ్రూక్ బాధపడ్డాడు.

ఇంతలో సముద్రపు ఒడ్డున తమాషా చూడటానికి చింపిరి దుస్తులతో ఓ అనాథ బాలుడు వచ్చాడు

ఆ పిల్లవాణ్ణి చూడగానే రూపర్ట్ బ్రూక్‌కు ఓ ఆలోచన వచ్చింది. గబగబ అతని దగ్గరికెళ్ళి "క్షణంలో ఆరు పెన్నీలు నీకొచ్చే మార్గం చెబుతాను నువ్వు చేయవల్సిందల్లా ఇదిగో నీ చేయెత్తి నా పడవకు వీడ్కోలు చెబుతూ చెయ్యి ఊపుతూ వుండు" అంటూ ఆరు పెన్నీలు ఇచ్చాడు

"అదేమిటి, ఆ పిల్లవాడికి ఆరు పెన్నీలిచ్చావు?" అన్నాడు పడవల పోటీలో పాల్గొంటున్న ఒకతను.

"అదే విజయానికి ఊతం!" అన్నాడు బ్రూక్

ఆ పోటీలో బ్రూక్ గెలిచాడు

ఆ అనాథబాలుడు తనకిచ్చిన ఆ చిన్న ప్రోత్సాహమే అతని విజయానికి నాంది అయ్యింది

## లింకన్‌కు అభిమానమైన 'జోక్'

పదహారవ ప్రెసిడెంట్‌గా అమెరికా పాలించిన అబ్రహాం లింకన్ ఒక తమాషా చేసి, తనను చూడటానికి వచ్చిన సందర్శకులను కాస్సేపు తికమక పెట్టేవాడు.

లింకన్ తనను దర్శించటానికి వచ్చిన సందర్శకులను కలుసుకునే గదిలో సీలింగ్ భాగంలో స్పష్టంగా కనిపించేట్టు బూటుకాళ్ళ గుర్తులు జీవం ఉట్టిపడేట్టు చిత్రకారులచేత చిత్రింపచేశాడు

వచ్చిన సందర్శకులు కాస్సేపు అటూ ఇటూ చూసి సీలింగ్‌వైపు చూడగానే మనుషులు సీలింగ్ భాగాన నడచినట్టు కాళ్ళ గుర్తులు కనబడేవి

"ఇదేమిటి? మనుషులు సీలింగ్ భాగాన నడవాలంటే తలక్రిందులుగా నడిస్తేనే గానీ కాలి గుర్తులు పడవుగా! మరి ఎంతమంది తలక్రిందులుగా నడిస్తే ఇన్ని గుర్తులు పడ్డాయో" అంటూ, ఒకరికొకరు ఆశ్చర్యంగా చెప్పుకుంటుండగా విని లింకన్ కూడా కాస్సేపు ఆశ్చర్యం ప్రకటించేవాడు.

చివరికి ఆయన అసలునిజం చెప్పి, అవి గొప్ప చిత్రకారుడు చిత్రించిన కాలి గుర్తులు అని వివరణ ఇచ్చేవాడు.

"భలే ఫూల్స్ అయ్యామే!" అని నవ్వుకుంటూ జనం వెళ్ళేవారు.

లోకోభిన్నరుచి అన్న సామెత ఉన్నదిందుకే.

## సంగీత అభిమానికి 'బిథోవెన్' సలహా

సంగీత కళానిధిగా, ప్రపంచమంతటా గొప్ప గౌరవ మన్ననలు పొందిన సంగీత సమ్రాట్టు బిథోవెన్.

అతను ప్రముఖ చర్చిలలో – అదీ క్రిస్టమస్, ఈస్టర్ వంటి ముఖ్యమైన పండుగలకు మాత్రమే సంగీత కచ్చేరీ చేస్తాడు

బిథోవెన్ సంగీతం వినటమంటే జన్మ ధన్యమైనంత గొప్పగా ఆయన అభిమానులు పిచ్చెత్తిపోతారు

ఒకసారి బిథోవెన్, ఒక కార్యక్రమంలో పియానో మీద కొన్ని గంటలు సంగీతం వినిపించాడు. ఆయన చేతివేళ్ళు పియానో మెట్లమీద వేగంగా లయబద్ధంగా ఆడటం చూసిన ఓ మహిళామణి "అబ్బ! నీ చేతుల్లో వేగం, నీ సంగీత ప్రతిభ భగవంతుడు నాకిస్తే ఎంత బాగుండు?" అంది.

అప్పుడు బిథోవెన్ నవ్వి, "అమ్మా! నువ్వు నా దగ్గర పెద్ద ప్రతిభ వుందనుకుంటున్నావు. అది నిజం కాదు నా స్థాయికి ఎవరైనా చేరవచ్చు. అయితే ఆ స్థాయికి రావటానికి నువ్వు రోజూ చేయవలసింది–రోజుకు ఎనిమిది గంటలు పియానో మీద అభ్యాసం– అదీ నలభై ఏళ్ళు నిరంతరం ఆపకుండా చేయాలి. అప్పుడు నా అంత ప్రతిభ నీకూ ఏర్పడుతుంది. నువ్వూ ఇలాగే మంచి సంగీత కార్యక్రమాలు ఇవ్వవచ్చు" అన్నాడు.

ఈ మాటలతో ఆ మహిళామణి భయంతో నోరు తెరవక తప్పలేదు.

## ఇంగ్లాండ్ ప్రధానిగా ఛాంబర్‌లైన్ వితరణ

పెద్ద పెద్ద డిన్నర్లు ప్రముఖులకిచ్చినప్పుడు అక్కడికొచ్చే ముఖ్య అతిధి మంచి ప్రసంగం చేయటం అనవాయితీ

ఒకసారి ఇంగ్లాండ్ ప్రధాని చేసిన జోసఫ్ ఛాంబర్‌లైన్ ఒక డిన్నరుకు వెళ్ళాడు.

అది ఎవరో పుట్టినరోజు పండుగ సందర్భంగా ఏర్పాటుచేసిన డిన్నరు పార్టీ అయితే, సాంప్రదాయానుసారం కొవ్వొత్తులు టేబుల్ మీద పెట్టి లేవు.

పైగా లైట్లన్నీ ఎవరికీ అందనంత ఎత్తులో ఎలక్ట్రిక్ లైట్ల రూపంలో అమర్చి వున్నాయి. ఎవరో అడిగారు ఛాంబర్‌లైన్‌ని – "ఏమిటీ ఈ ఏర్పాటులో అర్థం?" అని.

"ఏముంది, వెలుగంతా జ్ఞానరూపంలో పైనే అందనంత ఎత్తులో వుంది ఇక అజ్ఞానం–చుట్టూ వున్న చీకటిలా ఆవరించి వుంది" అన్నాడు.

అక్కడికి వచ్చినవారంతా డిన్నరులో వండిన వంటకాలన్నీ తింటూ ఆనందిస్తున్నారు. డిన్నరు చివర ముఖ్య అతిధి ప్రైమ్ మినిష్టర్ గారి ప్రసంగం వుంటుందనే సంగతే అందరూ మరిచిపోయారు.

ఇంతలో ప్రైమ్ మినిష్టరు గారికి వారి ప్రసంగం గురించి గుర్తుచేయగానే "పాపం, వీళ్ళంతా చక్కటి విందు తింటూ ఆనందిస్తున్నారు మనం వాళ్ళని ఇంకాసేపు ఆ డిన్నరు తిననిస్తే మంచిదేమో?" అన్నాడు ముఖ్యఅతిధి.

## కొత్త చరిత్ర సృష్టించిన పుస్తకం

ఒక పుస్తకం ఒక వ్యక్తి జీవితాన్ని సమూలముగా మార్చివేస్తుందంటే నమ్మటం కష్టమే 'అంకుల్ టామ్స్ కాబిన్' నీగ్రోల స్వేచ్ఛను ప్రబోధిస్తే, ఆటమ్ సిద్ధాంతాలను గ్రీకులో విశ్లేషించిన 'ప్లాటో' రచన–'టిమియస్' అనే గ్రంధం జర్మన్ దేశస్థుడైన వెర్‌నర్ హీజెన్‌బెర్గ్ జీవితాన్నే సమూలంగా మార్చివేసింది.

పంథొమ్మిదేళ్ళ వయసులో 'వెర్నర్ హీజెన్‌బెర్గ్' ఒక స్కూల్లో వాచ్‌మేన్‌గా పనిచేస్తున్నాడు కొద్దిగా చదువు వున్నా అతనికి సైన్సుపట్ల మక్కువ ఎక్కువ.

ఒకరోజు లైబ్రరీలో అతనికి ప్లాటో రచన 'టిమియస్' కళ్ళబడింది. సామాన్య వ్యక్తులకు అర్థమయ్యేంత విపులంగా వ్రాసిన 'అణువు–దానికి సంబంధించిన గ్రీకుదేశ సిద్ధాంతాలు' అందులో రాయబడి వున్నాయి.

ఈ పుస్తకం చదవటంతో అతనికి భౌతికశాస్త్రంలో అభిరుచి పెరిగింది. దానితో అతను చదువు కొనసాగించి, నాలుగైదేళ్ళలో ఫిజిక్స్ ప్రొఫెసర్ గారి శిష్యుడయ్యాడు.

24 ఏళ్ళకు అతను యూనివర్సిటీ లెక్చరరు అయ్యాడు 26 ఏళ్ళకు యూనివర్సిటీ ప్రొఫెసరయ్యాడు. 32 ఏళ్ళ వయసులో అత్యంత పిన్నవయసులో, భౌతికశాస్త్రంలో 'నోబెల్ బహుమతి' పొంది, చరిత్ర సృష్టించాడు. ఆ విధంగా ఒక పుస్తకం ఒక వాచ్‌మేన్ జీవితాన్నే మార్చివేసి, కొత్త చరిత్ర సృష్టించింది.

## మార్క్‌ట్వెయిన్ పడ్డ బాధ

ప్రముఖ అమెరికా హాస్య రచయిత మార్క్‌ట్వెయిన్ తన రచనల్లోనే కాక, నిజ జీవితంలో కూడా మంచి హాస్యప్రియుడు.

అతను చిన్నపిల్లవాడుగా వుండగా, ఒకసారి నిజంగా జరిగిన సంఘటన చెప్పాడు.

పేదవాడైన మార్క్‌ట్వెయిన్, చిన్నప్పటి నుండి తిండికి ముఖం వాచి వున్నాడు.

అతనికి ఏమి తిందామన్నా, బ్రహ్మప్రళయంగా వుండేది.

తన ఈడుపిల్లలు తినే చిరుతిళ్ళు అతనికి గగనకుసుమాలే అయ్యాయి.

ఒకరోజు అతనికి పుచ్చకాయల పొలం చూడగానే పుచ్చకాయలు తినాలనిపించింది వాటి కోసం అతను ఎంత ప్రయత్నించినా అవి అతనికి లభ్యంకాలేదు

చివరికి పుచ్చకాయల పొలం రైతు, తన పంటను బండికెత్తించి, అవి అమ్మడానికి వెడుతున్నాడు

'పాపం, ఎంతో శ్రమించి పంట పండించాడు రైతు. ఒక్క కాయకంటే ఎక్కువ తీసుకుంటే పాపం, అతనికి నష్టం' అనుకున్నాడు మార్క్‌ట్వెయిన్

చివరికి ఒక కాయ తీసి తింటే అది పచ్చిగా వుంది మరో కాయ తీశాడు అదీ అలాగే వుంది చివరకి ఒక పండిన కాయ తగిలింది మార్క్‌ట్వెయిన్ సంతోషించాడు.

"ఒక్క కాయ పండింది తీసుకోడానికి ఎన్ని పచ్చికాయలు కొరికి తినాల్సివచ్చిందో" అని తరువాత బాధపడ్డాడు మార్క్‌ట్వెయిన్

## నేను నిమిత్తమాత్రుణ్ణి-శామ్యూల్ మోర్స్

టెలిగ్రాఫ్ కనిపెట్టిన మోర్స్‌ని ఒక ఇంటర్వ్యూలో ఒక పాత్రికేయుడు ఒక వింత ప్రశ్నవేశాడు.

"అనేక పరిశోధనలు చేసిన మీరు, యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా మీరు చేస్తున్న ప్రయోగాలు నిలిచేస్థాయిలో ఏమి చేయటానికీ పాలుపోని పరిస్థితిని ఎదుర్కొన్నారా?" అంటూ అడిగాడు

"అయ్యో, అలాంటి స్థితి ఒకసారి కాదు, అనేకసార్లు ఎదుర్కొన్నాను" అన్నాడు మోర్స్.

"అయితే అప్పుడేం చేసేవారు?"

"నా ప్రయోగాల్లో నాకు ఎదురైన సమస్యల పరిష్కారానికి నేను మానవులనెవరినీ సంప్రదించలేదు. అందుకే తక్కిన లోకానికి నా అశక్తత, పరిమితులు తెలియవు!" అన్నాడు మోర్స్

"మరి మీ సమస్యలకు పరిష్కారం కోసం ఏం చేసేవారు?" అడిగాడు పాత్రికేయుడు

"భగవంతుణ్ణి నాకు శక్తిని, వెలుగును ప్రసాదించమని ప్రార్థించేవాణ్ణి"

"మీ సమస్యలకు మీ ప్రార్థనవల్ల దేవుడు పరిష్కారం సూచించేవాడా?"

"ఆహా! అందుకే నా ప్రయోగ ఫలితాలన్నీ నా తెలివితేటలతో, నేను సాధించానని నేను అనుకోను తక్కిన గొప్ప శాస్త్రవేత్తలకంటే నేను గొప్పవాణ్ణి అనుకోను. మానవులకు భగవంతుడు ఏ శాస్త్రఫలాలు అందించదలచాడో వాటిని నావంటి మానవమాత్రుడిద్వారా మానవులకు ఆయన అందించాడు. నేను నిమిత్తమాత్రుణ్ణి" అన్నాడు శామ్యూల్ మోర్స్

# కెప్లెర్ శాస్త్రవేత్తగా కనిపెట్టలేకపోయిన నిజం

జాన్ కెప్లెర్ జర్మనీకి చెందిన ప్రముఖ గణితశాస్త్రవేత్త, మరియు ఖగోళశాస్త్రవేత్త. చిన్న వయసులో అతని తండ్రి తల్లిని వదలివేస్తే, కెప్లెర్ తల్లి మళ్ళీ వివాహం చేసుకుంది. దీనితో శాస్త్రవేత్తగా ఎంత పేరు ప్రతిష్టలు వచ్చినా అతనికి వివాహం చేసుకుందామన్న కోరిక లేకుండా పోయింది.

అయితే డబ్బు, పేరు బాగా వచ్చాక, అతను వివాహం చేసుకోడానికి సిద్ధపడ్డాడు. తన వివాహప్రకటన పత్రికల్లో ఇవ్వగానే, అతను ఊహించనంతమంది, అందమైన స్త్రీలు ఆ ప్రకటనకు స్పందించారు.

చాలా కష్టపడి, చివరకతను ఓ అందమైన స్త్రీని ఎన్నుకుని, "నేను తక్కిన పురుషుల్లా ప్రేమను కురిపించను! పైగా నాకు చాదస్తం, కోపం, తిక్క వున్నాయి! వీటితో పాటు, బాధ్యతారాహిత్యత, అసహనం వంటి లోపాలూ వున్నాయి! ఇవన్నీ సహించ గలిగితే, నేను వివాహం చేసుకుంటాను!" అన్నాడు.

ఆ స్త్రీ వీటన్నింటినీ ఒప్పుకుంది. పైగా వివాహమైపోయాక, కెప్లెర్‌తో ఎంతో ఒద్దికగా, విధేయతతో సరిపెట్టుకుంటూ జీవితం గడపసాగింది.

కెప్లెర్‌కు అమె సహనానికి ఆశ్చర్యం వేసి, "స్త్రీలలో ఇంత సహనం ఎలా వచ్చిందో నిన్ను చూస్తే ఆశ్చర్యం వేస్తోంది" అన్నాడు భార్యను మెచ్చుకుంటూ.

"ఆ – ఇందులో పెద్ద వింతేముంది! గత నాలుగేళ్ళల్లో దుర్మార్గులైన అయిదుగురు భర్తలతో వేగినదాన్ని! వాళ్ళందరికంటే నువ్వు వెయ్యి రెట్లు నయం. అందుకే నీతో కాపురం ఆనందంగా వుంది!" అన్నది కెప్లెర్ భార్య

అంత గొప్ప సత్యం జీర్ణించుకోడానికి ఆ శాస్త్రవేత్తకు చాలా సమయం పట్టింది.

## ఆకతాయి నోరు మూయించిన షెరీడన్

షెరీడన్ ప్రముఖ ఆంగ్ల నాటక రచయిత. అతను మంచి ప్రసంగకర్త కూడా. శ్రోతల్ని తన సంభాషణాచాతుర్యంతో ఆకట్టుకునే ప్రజ్ఞాశాలి.

అయితే, ఒకసారి ఆయన ఒకచోట ప్రసంగం చేయటానికి వెళితే, అక్కడ ఓ ఆకతాయి షెరీడన్ మాట్లాడిన ప్రతి మాటకు మధ్యలో కల్పించుకుని 'హియర్! హియర్!' (వినండి–వినండి) అనటం సాగించాడు.

మామూలుగా, ప్రసంగకర్త మంచి విషయం–ప్రాధాన్యత వున్నది చెప్పగానే – ఎప్పుడైనా 'వినండి–వినండి' అని శ్రోతలు అనటం ఆనవాయితీ.

అయితే, ఆ ఆకతాయి గొడవ మరీ ఎక్కువయిపోయి, షెరీడన్‌కు తలనొప్పి పుట్టింది అతను ప్రతి మాటకు 'హియర్–హియర్' అనటం సాగించాడు.

షెరీడన్ అతని నోరు మూయించటానికి "అయితే మన శ్రోతల్లో ఒక్కోసారి ఇలాంటి మూర్ఖులు – తెలివితక్కువవారు – పనికిమాలినవారూ వుంటుంటారు ..!" అంటూ ఆపగానే–

"హియర్! హియర్" అంటూ ఆకతాయి మళ్ళీ అరిచాడు

"ఓహో! నువ్వు అక్కడున్నావన్నమాట – నిన్ను గురించే అనుకుంటున్నాను!" అన్నాడు చురక అంటిస్తూ షెరీడన్

(హియర్ అనే పదానికి – ఇక్కడ అనే అర్థం – వినటం అనే అర్థాలున్నాయి)

షెరీడన్–'హియర్'– 'ఇక్కడ'– అనే అర్థం వాడి, ఆకతాయి నోరు మూయించాడు.

## లింకన్ జోక్‌లో అంతర్యం

అబ్రహాం లింకన్ మంచి హాస్యసంభాషణాచతురుడు ఎలాంటి క్లిష్టస్థితిలోనూ ఒక చిన్న 'జోక్' విసిరి, అక్కడి పరిస్థితిని చాలా తేలిగ్గా ఆహ్లాదపరచగలిగేవాడు.

అమెరికాలో అంతర్యుద్ధం జరుగుతుండగా చాలామంది మిలిటరీ జనరల్స్‌కు యుద్ధనైపుణ్యత ప్రదర్శించే అవకాశం అబ్రహాం లింకన్

ఇచ్చాడు. అందరిలోకి జనరల్ గ్రాంట్ మంచి ప్రతిభాశాలిగా గుర్తింపు సాధించాడు అతనంటే లింకన్‌కు ప్రత్యేక గౌరవం ఏర్పడింది.

అయితే, ఇది గిట్టని తక్కిన జనరల్స్ జనరల్ గ్రాంట్‌మీద లేనిపోని చాడీలు చెప్పి, అతని మీద దురభిప్రాయాన్ని కలిగించటానికి పథకాలు వేశారు.

అందులో ఒక మిలిటరీ జనరల్ "సార్! జనరల్ గ్రాంట్ విస్కీ తెగ తాగుతున్నాడు. అతను చాలా వింతగా ప్రవర్తిస్తున్నాడు. అటువంటి వ్యక్తి అంత ఉన్నత స్థాయిలో ఉండి..!" అంటూ చెప్పసాగాడు.

అయితే లింకన్ అతని మాటలు మధ్యలోనే ఆపివేసి "అంత ఎక్కువగా తాగుతున్న ఆ విస్కీ బ్రాండ్ ఏమిటో తెలుసుకోవయ్యా త్వరగా! మన తక్కిన జనరల్స్ అందరికీ తలా ఒక ట్రే ఈ విస్కీ పంపాలని నా ఉద్దేశం!" అన్నాడు నవ్వుతూ.

"జనరల్ గ్రాంట్ విస్కీ కాస్త ఎక్కువ తాగితేనేం! అతనిలా తక్కిన జనరల్స్ మిలిటరీ విజయాలు సాధిస్తే, నేను ఎక్కువ సంతోషిస్తాను" అన్నట్టు అర్థమయ్యేట్టు చేశాడు లింకన్.

## 'మార్క్స్'కు శ్రద్ధాంజలి ఘటించిన సాంకృత్యాయన్

'మహా పండిట్' రాహుల్ సాంకృత్యాయన్ బహుభాషా పండితుడు, రచయిత, చరిత్రకారుడు, గొప్ప తాత్త్వికవేత్త.

ఆయన జీవితంలో అనంత విశ్వాంతరాళంలో నిరంతర యాత్రికుడిగా జీవించాడు తన యాత్రలను, తనకు కలిగిన అనుభవాలను, విజ్ఞానాన్ని గ్రంథ రూపంలో రాశాడు.

రాహుల్‌జీ బౌద్ధసారస్వతాన్ని లోతుగా అధ్యయనం చేసినా, మార్క్సిజం ప్రభావంతో భౌతికవాదిగా పరిణామం చెందాడు.

లండన్‌లో వుండగా, రాహుల్‌జీ కారల్‌మార్క్స్ సమాధి వున్న హైగేట్ శ్మశానంలో ఆయన సమాధిని సందర్శించడానికి వెళ్ళాడు.

కారల్‌మార్క్స్‌కు తన శ్రద్ధాంజలి ఘటించాలని ఆయన ఆశయం.

వేల సమాధులున్న ఆ శ్మశానంలో, కారల్‌మార్క్స్ సమాధి ఎక్కడో అతను గుర్తించలేక సమాధులవద్ద గేటుకు కాపలా వుండే

చౌకీదారుతో "మార్క్స్ సమాధి ఎక్కడుంది?" అంటూ అడిగాడు.

"తెలియదు" సమాధానం చెప్పాడు ఆ చౌకీదారు.

'ఏ వర్గదాస్యాన్ని తొలగించటానికి తన అపూర్వమైన మేధాసంపదను వినియోగించి, అందుకోసం కటికదారిద్ర్యాన్ని అనుభవించాడో, ఆయన సమాధి ఎక్కడున్నదో తెలియకపోవటం ఎంత విషాదకరమైన విషయం!' అనుకున్నాడు సాంకృత్యాయన్. ఇంతలో అటునుంచి వస్తున్న వ్యక్తి ఆయనకి మార్క్స్ సమాధి చూపాడు అది మామూలుగా గడ్డి మొలచి, సామాన్య వ్యక్తి సమాధిలాగానే వుంది.

'ప్రపంచ శ్రామికుల పరిరక్షకుడు, తన జీవితాంతం దారిద్ర్యాన్ని అనుభవించిన ఆయన ఇక్కడ విశ్రమించాడు' అనుకున్నాడు బాధగా—మార్క్స్‌ను గుర్తుచేసుకుంటూ

## పటేల్ గుండెనిబ్బరాన్ని సూచించే సంఘటనలు

గుండెనిబ్బరానికి పటేల్ గారి పేరు చెప్పి, మరొకరి పేరు చెప్పాలి. ఈ విధంగా గుండెనిబ్బరంతో, ధైర్యంగా ప్రవర్తించే అలవాటు పటేల్‌కు చిన్నవాడుగా వుండగానే వుంది

పటేల్ పసివాడుగా వుండగా, వంటిమీద సెగ్గడ్డలాంటిది లేచింది. అప్పటి మొరటి వైద్యం చేసింది పల్లెటూళ్ళలో వుండే క్షురకులు.

సెగ్గడ్డ మీద ఎర్రగా కాలిన కడ్డీతో ఇంకా కాల్చి, ఆ సెగ్గడ్డను చితిపివేసేవారు అలా చేస్తే, మళ్ళీ సెగ్గడ్డ రాదని అప్పటి నమ్మకం.

నాటువైద్యుడు ఎర్రగా కాలిన ఇనప కడ్డీ తెచ్చాడు. కానీ, అది అంత చిన్న కుర్రవాడు ఓర్చుకోగలడో లేదోనని సందేహిస్తున్నాడు.

వెంటనే ఆ ఎర్రటి కడ్డీ తను చేతిలోకి తీసుకుని, తనే కాల్చుకున్నాడు. ఆ బాధను ధైర్యంగా సహించాడు పటేల్.

ఇలాగే పటేల్ పెద్దవాడయ్యాక, ఒక ఆపరేషన్ చేయవలసి వచ్చింది. మత్తుమందు ఇస్తానని శస్త్రవైద్యుడంటే, "నేను చూస్తుండగా నా ఆపరేషన్ చేయాలి! కానివ్వండి" అన్నాడు.

శస్త్రవైద్యుడు పటేల్ కోరిక ప్రకారమే చేయవలసి వచ్చింది.

ఆపరేషన్ జరుగుతున్నంతసేపు పటేల్ చలించకుండా తనకు జరుగుతున్న ఆపరేషన్ చూస్తూ నొప్పి ఓర్చుకున్నాడు.

స్టాలిన్ మహాశయుడికి కూడా ఇలాగే ఆపరేషన్ జరిగిందట, ఆయనా మత్తు మందు లేకుండా ఆపరేషన్ చేయించుకున్నాడుట.

## విప్లవవీరుడు భగత్ సింగ్ చివరిక్షణాలు

భారత స్వాతంత్ర్య విప్లవజ్యోతి, సర్దార్ భగత్ సింగ్ కు ఉరిశిక్ష ఖాయంగా పడుతుందని ముందే తెలుసు. అందుకే కోర్టులో సైతం తనతోపాటు శిక్షపొందనున్న మిత్రులు–రాజగురు, దత్తులకు, లియోనాయిడ్ ఆండ్రీవ్ నవల 'సెవెన్ దట్ వర్ హేంగ్డ్' (ఉరితీయబడ్డ ఆ ఏడుగురు)ను చదివి వినిపిస్తూండేవాడు భగత్ సింగ్.

ఆ నవలలో వచ్చే ఒక పాత్రకు ఉరిశిక్ష పడుతుంది అయితే ఆ పాత్ర– "నన్ను ఉరితీయకండి"– "నన్ను ఉరితీయకండి" – అంటూ చెబుతుంటాడు చివరి అతన్ని ఉరితీయటానికి ఉరికంబానికి తీసుకెళ్ళేప్పుడు కూడా "నన్ను ఉరితీయకూడదు" అంటూ చెబుతూ వుంటాడు.

భగత్ సింగ్ ఆ ఘట్టం వర్ణించేప్పుడు అతని కళ్ళల్లో కన్నీళ్ళు తొణికాయి. మృత్యువంటే రమ్మని సవాల్ చేసే తమ కామ్రేడ్, మరణభయంతో వణికే ఒక నవలా పాత్ర కోసం కన్నీరు కార్చే దృశ్యం చూసి, తక్కిన మిత్రులు ఆశ్చర్యపడేవారు

1931 మార్చి ఇరవై మూడవ తేదీ, భగత్ సింగ్ ఉరిశిక్ష అమలు జరుపుతున్నారు. ఉరికంబం ఎక్కబోతున్న భగత్ సింగ్, అక్కడేవున్న ఆంగ్ల మేజిస్ట్రేట్ తో "మేజిస్ట్రేట్ సాబ్! మీరు నిజంగా చాలా అదృష్టవంతులు. ఒక భారతీయ విప్లవకారుడు, తన మహత్తరమైన లక్ష్యసాధన కోసం నవ్వుతూ ప్రాణా లర్పించటానికి ఉరికంబం ఎలా ఎక్కుతాడో చూసే అవకాశం మీకు దొరికింది" అని చిరునవ్వుతో ఉరితాడు మెడకు తగిలించుకున్నాడు.

అంతకుముందు సోదరుడికి ఉత్తరంరాస్తూ "నా జీవనజ్యోతి ఉదయపు వెలుగులా ఆరిపోయినా, మా ఆదర్శం, మా భావాలు విద్యుత్ లతల్లా ప్రపంచమంతటా జాగృతి వ్యాపింపజేస్తాయి నా పిడికెడు బూడిద నశించిపోతే ప్రపంచానికి నష్టమేమిటి?" అన్నాడు ఆ విప్లవవీరుడు అలా రాలిపోయాడు

## పార్లమెంటు సభ్యుడిగా షెరిడన్

రిచార్డ్ షెరిడన్ ప్రముఖ నాటక రచయితేగాక, ప్రముఖ పార్లమెంట్ సభ్యుడుకూడా

పార్లమెంట్‌లో అతనుండగా ఎంత తీవ్రచర్చనైనా క్షణాల్లో నవ్వులో ముంచివేసేవాడు

ఒకసారి ఫ్రెంచి విప్లవాన్ని బలపరిచే బర్క్ మహాశయుడు ఏకంగా కామన్స్ సభకు ఒక కత్తి తెచ్చిపడవేసి, ఫ్రెంచి విప్లవాన్ని అందరూ బలపరచవలసిన అవసరముందన్నాడు. ఆవేశంగా పెద్ద ఉపన్యాసం కూడా ఇచ్చాడు.

అతని ఉపన్యాసం పూర్తికానిచ్చిన షెరిడన్, అతని ఆవేశాన్ని ఆటలుపట్టిస్తూ, "మన మిత్రుడు ఆవేశంతో వస్తూ వస్తూ కత్తి తెచ్చిపడవేశాడు బాగానే వుంది. కానీ, అతను కత్తితోపాటు తేవలసిన 'ఫోర్క్' తేవటం మరచాడు" అన్నాడు.

అంతే, అంత ఆవేశపడ్డ బర్క్ కూడా పకపక నవ్వాడు.

ఒకసారి పార్లమెంటు సభ్యుల్లో టోరీ పార్టీకి చెందిన సభ్యుణ్ణి విమర్శించాడు షెరిడన్

ఆ విమర్శకు మండిపడ్డ ఆ టోరీ సభ్యుడు కోపంగా "నాకు ఈ షెరిడన్ బుర్ర బద్దలుకొట్టి, మెదడు పీకి పెట్టాలనిపిస్తున్నది" అన్నాడు.

అతని మాటలకు షెరిడన్ నొచ్చుకోకుండా, "నా ప్రత్యర్థి చేస్తానన్న పనికి నా అభ్యంతరం ఏం లేదు. అయితే నా బుర్ర బద్దలుకొట్టి నా మెదడు పీకిపెడతానంటున్నాడు! ఎవరికి ఏది లేదో అది కావాలని కోరుకోవటంలో తప్పులేదనిపిస్తున్నది" అన్నాడు

సభ్యులంతా గోలగా నవ్వారు

## బెర్ట్రాండ్ రస్సెల్ ప్రత్యేకత

'శాంతి నోబెల్' బహుమతి గ్రహీతగా అటు ప్రపంచ ప్రముఖ మేధావుల్లో అగ్రగణ్యుడుగా ప్రసిద్ధికెక్కిన బెర్ట్రాండ్ రస్సెల్ మంచి హాస్యప్రియుడు

ఒకసారి మతమౌఢ్యం ఎక్కువగా వున్న కమ్యూనిష్టులను చూసి "విశాల దృక్పధమును గురించి చెప్పే 'కెథాలిసిజమ్'– 'కమ్యూనిజం' కంటే మంచిదని అనాలి ఎందుకనంటే, 'కెథాలిసిజమ్' పురాతనమైంది కాబట్టి! మతం – సారా (మత్తుపానీయం) వంటిది. అది ఎంత పాతదైతే అంత మెరుగుపడుతుంది"– అన్నాడు

రస్సెల్ ని 1918లో ఆరు నెలల ఖైదు శిక్షకు ప్రభుత్వం గురిచేసింది. దీనికి కారణం మొదటి ప్రపంచయుద్ధాన్ని తిరస్కరిస్తూ "ప్రపంచ పౌరులంతా సోదరభావంతో మెలగాలి" అంటూ రస్సెల్ గట్టిగా ప్రచారం చేయటమే.

ఆ రోజుల్లో రాజకీయ ఖైదీల నుండి ఖైదు గది అద్దె వసూలు చేయటం అనవాయితీ రస్సెల్ కిచ్చిన ఖైదు గది పెద్దదిగా వుంటే రస్సెల్ కు అనుమానం వచ్చి, "ఖైదీలు గది అద్దె ఏమైనా కట్టాలా?" అంటూ అడిగాడు, జైలు అధికారిని

వారానికి రెండు షిల్లింగులు, ఆరు పెన్నీలు అద్దె అని తెలిసి, జైళ్ళ గవర్నర్ దగ్గరికెళ్ళి, "అద్దె కట్టకపోతే ఏం జరుగుతుంది?" అన్నాడు.

అతను సమాధానం చెప్పకుండానే, "జైలు ఖాళీచేయవలసి వుంటుంది! అంతేగా! అయితే నేను ఒక పెన్నీ కూడా చెల్లించను మీ ఇష్టం!" అన్నాడు రస్సెల్

ఒకసారి ఆరవ జార్జి చక్రవర్తికి పరిచయం చేయగానే "నువ్వు ఆశ్చర్యచకితమైన జీవితాన్ని సాహసోపేతమైన విధంగా గడిపావట! అది అందరికీ కుదరదుగదా?" అన్నాడట చక్రవర్తి వ్యంగ్యంగా విమర్శిస్తూ.

"టపాలా బంట్రోతు అందరి ఇళ్ళ వాకిళ్ళు తట్టాడని అందరూ అలా తట్టుతూ తిరగటం సాధ్యమా?" అన్నాడట తన వింత సాహసయాత్రల్ని సమర్థించుకుంటూ రస్సెల్.

## ప్రపంచ సాహిత్యంలో గొప్ప నవల రాయటానికి ప్రోత్సాహం

ప్రముఖ అమెరికా నవలా రచయిత, కధారచయిత 'నెధానియల్ హాధారన్' జీవికకు ఒక ఉద్యోగం వృత్తిగా చేస్తూ – ప్రవృత్తి రీత్యా రచనలు చేస్తుండేవాడు

అయితే అతని కధలకు పెద్ద గుర్తింపు కానీ, డబ్బుగానీ రాలేదు.

అయినా అతను కొత్త పద్ధతిలో రకరకాల కథలు రాసి, పాఠకులను ఆకర్షించగలిగాడు.

దురదృష్టవశాత్తు అతను ప్రభుత్వంలో చేసే ఉద్యోగం పోయింది. నెలకు స్థిరమైన ఆదాయం, కడుపులో చల్ల కదలకుండా నిశ్చింతగా కుటుంబం గడిచే అవకాశం చేజారిపోయింది. దీనితో ఎంతో మానసిక క్షోభకు గురైన హాథారన్ ఉద్యోగం పోయిన సంగతి భార్యకు చెప్పి, తిండి కూడా సహించక, బాధపడుతూ కూర్చున్నాడు.

అయితే హాథారన్ భార్య భర్తకు ధైర్యం చెబుతూ, చలి కాచుకోడానికి ముట్టివుంచిన బొగ్గు కుంపటి దగ్గరగా పెట్టి, అతని భుజం మీద చేయి వేసి, "ఇంతవరకు నీకు ఒక జీవనాధారం ఉద్యోగం వుందనే ధైర్యంతో నీ అసలు ప్రతిభ రచనల్లో కనబరచలేకపోయావు. ఇప్పుడు నీకు నీ రచనే జీవనాధారం అవుతున్నది. ఇప్పుడే నీవు నీ శక్తినంతా ప్రతిభనంతా రచనావ్యాసంగంలో చూపగలవు. ఇక మంచి నవల వ్రాయి" అంది

అంతే–నెథానియల్ హాథారన్ విజృంభించి "ది స్కార్‌లెట్ లెటర్" అనే ప్రసిద్ధ నవలను రాశాడు ఆ ఒక్క నవల మీద ఆధారపడి, అతనికి డబ్బు, కీర్తివచ్చాయి 'స్కార్ లెట్ లెటర్'–అంటే 'రక్తవర్ణంలో వున్న అక్షరము' – అనే అర్థం ఈ నవల ప్రపంచ నవలా సాహిత్యంలో గొప్ప నవల అయిపోయింది

## త్రిపురనేని గోపీచంద్‌గారు వ్రాసిన చిన్నకథ

ప్రముఖ తెలుగు రచయిత, శ్రీ గోపీచంద్ తండ్రి త్రిపురనేని రామస్వామి చౌదరిగారు విశ్వకథాసాహిత్యంలో ప్రముఖులైన చెకోవ్, టాల్‌స్టాయ్, పుష్కిన్, గోర్కీ, మామ్, మపాసా, ఓహెన్రీ, పెరల్‌బక్ వంటి ప్రముఖ రచయితల కథలు, వారి కథనశైలి ఆపోసన పట్టారు గోపీచంద్

పది పేజీలుండే పెద్ద కథ వ్రాసినా, పది వాక్యాల 'గల్పిక' వ్రాసినా, అది పఠితల మనసుమీద చెరగనిముద్ర వేసేది.

'సానుభూతి'– అనే 'గల్పిక' ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు

ఒక కవి తన స్నేహితుడైన ధనవంతుని దగ్గరకు వెళ్ళి. "ఒక అయిదు రూపాయలుంటే బదులివ్వండి. ఇంట్లో బియ్యం లేవు. గోలగా వుంది" అని తడబడుతూ అడిగాడు.

"నా దగ్గర దమ్మిడీ లేదు. డబ్బెక్కడ నుండి వొస్తుంది? నా పెరట్లో పండుతుందా? అదీగాక నేనిన్నిసార్లు ఇవ్వలేను" అన్నాడు ధనవంతుడు.

"నాకెప్పుడిచ్చావు?" అన్నాడు కవి.

"నువ్వు మరణించిన తర్వాత శిలావిగ్రహానికివ్వొద్దూ? ఇప్పుడు ఇచ్చి, అప్పుడూ ఇచ్చి, నాకిదేపనా?" అన్నాడు ధనవంతుడు.

కవికి ఆ రోజు రాత్రి కలలో కనిపించినయి: తన భార్యాపిల్లలు తిండిలేక ఒక పక్కన ఏడుస్తుంటే, ఒక పక్కన తన శిలావిగ్రహం తయారవుతూ వుంది. ఆ శిలావిగ్రహానికి డబ్బిచ్చిన ధనవంతుని దాతృత్వాన్నీ, రసహృదయాన్నీ ప్రజలు వేనోళ్ళ కొనియాడుతూ వుంటారు.

లోకవృత్తాన్ని ఇంత చిన్న కథలో, ఇంత వాస్తవంగా, గొప్పగా చిత్రించటం అనితరసాధ్యం.

## నమ్మిన శాస్త్రవిజ్ఞానం కోసం ఖైదుకెళ్ళిన ప్రపంచ ప్రముఖ శాస్త్రవేత్త గెలీలియో

ప్రపంచ ప్రముఖ ఖగోళశాస్త్రవేత్తగానే కాక, మధ్యయుగాలనాటి మతమౌఢ్యాల మీద గొప్ప తిరుగుబాటు చేసిన ప్రముఖ వ్యక్తిగా గెలీలియో ప్రత్యేకత అయనదే.

అతి దూరమున్నవాటిని స్పష్టంగా చూడటానికి 1609లో టెలిస్కోపు సృష్టించటంతో గెలీలియో పెద్ద సంచలనం సృష్టించాడు ఒక వస్తువును ఇరవై రెట్లు పెద్దదిగా చూడగలిగే మరో పెద్ద టెలిస్కోపు కనిపెట్టాడు. దీని సాయంతో– చంద్రుడు, నక్షత్రాలను, గురుగ్రహం, చివరకు చంద్రమండలాన్ని కూడా చూశాడు. తన టెలిస్కోప్‌తో సూర్యుడివంక చూసి అందులో పెద్ద మచ్చలున్నట్టు కనిపెట్టాడు.

అప్పటికి బైబిల్‌లో చెప్పిన అనేక విషయాలు శాస్త్రీయంగా నిజంకాదని నిరూపించాడు. భూమే సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదని చెప్పాడు భూమిని గురించి, గ్రహాలను గురించి బైబిల్‌లో చెప్పిన విషయాలు

తప్పని, శాస్త్రీయంగా నిరూపిస్తున్న గెలీలియో పెద్ద ప్రమాదకారని మతాధికారులందరూ ఏకమయ్యారు.

పైగా, బైబిల్ మనిషి మోక్షమార్గం సూచించటానికి ఉద్దేశింపబడింది, శాస్త్రవిషయాలు కాదని పెద్ద ఉత్తరం గెలీలియో రాశాడు

దీన్ని ఆధారం చేసుకుని, మతఛాందస న్యాయనిర్ణేతలు ఇతన్ని పిలిపించి, "నీవు చెబుతున్న శాస్త్రవిషయాలు తప్పని ఒప్పుకో లేదా—నీవు బైబిల్ ఔన్నత్యాన్ని కాదన్నందుకు ఖైదుకైనా వెళ్ళు" అంటూ నిర్బంధించారు.

అయితే 70 ఏళ్ళ వృద్ధుడిగా గెలీలియో తను నమ్మిన శాస్త్రవిషయాల కోసం ఖైదుకే వెళ్ళాడు. అక్కడ అంధుడైపోయి, చెవిటితనం రాగా, మతిపోయి, 78 ఏళ్ళ వయసులో ఖైదులో మరణించాడు.

## అన్యోన్య దాంపత్యంలోని ఆంతర్యం

ఒకసారి అమెరికా సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి భారతదేశ సందర్శనార్థం వచ్చాడు. ఆయన వెంట ఆయన సతీమణి వుంది. ఇద్దరూ వృద్ధదంపతులైనా ఎంతో అన్యోన్యంగా, చిలకా గోరింకల్లా ఆనందోత్సాహాలతో ఢిల్లీ, ఆగ్రా, ఫతేపూర్—ఇలా అన్నీ తిరిగి చూశారు

అమెరికా సుప్రీమ్ కోర్టు న్యాయాధిపతి ఢిల్లీ సందర్శిస్తున్న సందర్భంగా ఢిల్లీ ఆకాశవాణి కేంద్రంవారు ప్రత్యేకంగా ఆయనచేత రేడియో ప్రసంగం, ఇంటర్వ్యూ ఏర్పాటుచేశారు

ఆయన తన భారతదేశ పర్యటనానుభవాలు బ్రహ్మాండంగా చెప్పారు

అంతా అయ్యాక "మీ సతీమణి గారు కూడా ఏమైనా సందేశం ఇస్తారా?" అని అడిగారు రేడియో అధికారులు.

న్యాయమూర్తి భార్య "ఊహూ" అంటూ, తనేమీ మాట్లాడనంది

అప్పుడు న్యాయాధిపతి "మేమిద్దరం ఒక ఒప్పందానికి వచ్చాము అదేమిటంటే, ఇంట్లో ఆమె మాట్లాడితే నేను వినాలి; బయట నేను మాట్లాడితే ఆమె వినాలి" అన్నాడు అసలురహస్యం బయటపెడుతూ

ఆ దంపతులు అంత అన్యోన్యంగా వుండటంలోని అసలు ఆంతర్యం అదన్నమాట

## బూకర్ టి. వాషింగ్‌టన్ చెప్పిన పరిష్కారం

నీగ్రోలను ఇప్పటికీ హీనంగా చూడటం అమెరికాలోని తెల్లవారికి అలవాటే.

పైగా నీగ్రోలను బలపరచివారి తరఫున పనిచేసిన ప్రముఖ నాయకులను కూడా వాళ్ళు చంపివేసిన సంఘటనలు ఎన్నెన్నో.

అమెరికా పదహారవ ప్రెసిడెంట్ అబ్రహాం లింకన్, కెన్నడీలు ఇలా చంపబడ్డవారే.

అంతేకాకుండా, నీగ్రో నాయకులను ఎందరినో ఎన్నో అవమానాలకు గురిచేసి వారిని చంపిన సంఘటనలు అమెరికా చరిత్రలో కోకొల్లలు.

అమెరికా గాంధీగా పేరెన్నికగన్న 'మార్టిన్ లూథర్ కింగ్' ఇలా నీగ్రో నాయకుడవటంవల్ల చంపబడ్డవాడే

బూకర్ టి వాషింగ్‌టన్ ప్రముఖ నీగ్రో నాయకుడు ప్రముఖ విద్యావేత్త.

ఒకసారి ఆయన రైలు అందుకోడానికి త్వరత్వరగా, కంగారుగా బయలుదేరాడు అప్పటికి కార్లు అంతగా లేవు త్వరగా వెళ్ళాలంటే గుర్రపు బళ్ళ ప్రయాణమే.

వాషింగ్‌టన్ కంగారుగా వెళ్ళి "త్వరగా స్టేషన్‌కి వెళ్ళాలి గుర్రపు బండిలో తీసికెళతావా? బాడుగ ఇస్తాను" అన్నాడు.

నీగ్రో నాయకుడైనా బూకర్ వాషింగ్‌టన్‌ను గుర్రపు బండిలో ఎక్కించుకోవటం ఇష్టంలేని ఆ బండివాడు– "నేనింతవరకు ఓ నీగ్రోని నా బండి ఎక్కించుకోలేదు– ఎక్కించుకోను కూడా" అన్నాడు.

"అయితే నీ సీటు నాకివ్వు బండి తోలేపని నేను చేస్తాను. ప్రయాణికుడి సీటులో నువ్వు కూర్చో" అన్నాడు, వాషింగ్‌టన్.

## జ్యోతిష్య, గణిత శాస్త్రవేత్త భాస్కరాచార్యుడికి తప్పని విధిలిఖితము

ప్రాచీన భారతీయ గణితశాస్త్రవేత్తల్లో అసాధారణ ప్రతిభావిశేషాలు ప్రదర్శించిన వాళ్ళల్లో అగ్రగణ్యుడు భాస్కరాచార్యుడు

గణితశాస్త్రంలోనేకాక, జ్యోతిష్యశాస్త్రంలో కూడా భాస్కరా చార్యుడు అమోఘ ప్రతిభావంతుడు తన కుమార్తె జీవితంలో వైధవ్య ముందని జ్యోతిష్యశాస్త్రవేత్తగా భాస్కరాచార్యుడు తెలుసుకున్నాడు దుర్ముహూర్తపు దోషం రాకుండా వుంటే, తన కుమార్తెకు వైధవ్యం రాదని ఊహించాడు భాస్కరాచార్యుడు.

ఖచ్చితమైన కాలనిర్ణయం చేయటానికి ఇప్పటిలా పన్నెండో శతాబ్దంలో గడియారాలు లేవు అందుకని కాలాన్ని ఖచ్చితంగా కొలిచే జలఘటికా యంత్రాన్ని స్వయంగా రూపొందించాడు

అయితే, ఆరేళ్ల చిన్నపిల్లగా వున్న లీలావతి జలఘటికా యంత్రం ఎలా పని చేస్తుందో చూడాలని కుతూహల పడింది ఆమె అలా చూస్తున్నప్పుడు ఆమె ముక్కుకున్న ముక్కెరలోని ముత్యం జారిపడి, జలఘటికా యంత్రం ఖచ్చితమైన కాలనిర్ణయాన్ని చేయకుండా చేసింది

ఈ జరిగిన పొరపాటు తెలియని భాస్కరుడు కుమార్తె లీలావతి వివాహం తను నిర్ణయించిన ముహూర్తానికే జరిపించాడు అయితే అది దుర్ముహూర్తం కావటంతో లీలావతికి వైధవ్యం ప్రాప్తించింది

తరువాత జరిగింది తెలిసి, విధి లిఖితం దాట శక్యం కాదనుకున్నాడు తరువాత తనతోపాటు తన కుమార్తె లీలావతినీ గణితశాస్త్రంలో ప్రవీణురాలిని చేశాడు భాస్కరాచార్యుడు

## టాల్‌స్టాయ్ అవసానదశలో పడ్డ బాధలు

ప్రపంచ సాహిత్యంలో అత్యున్నతస్థానం పొందిన రచయితల్లో ప్రథ ముడు టాల్‌స్టాయ్ 1891లో, రష్యాలో వచ్చిన కరువులో టాల్‌స్టాయ్ రష్యన్ ప్రజల పాలిటి పెన్నిధి అయ్యాడు ఆకలితో అలమటించి చనిపోతున్న పేదల కోసం కలం చేతపట్టి రాసిన అతని వ్యాసాలకు స్పందించిన ఇతర దేశాలవాళ్ళు పెద్దమొత్తాలు విరాళాల్లో పంపేవారు ఈ డబ్బుతో కొన్నాళ్ళ పాటు కొన్ని వేల పేదలు మృత్యువాతనుండి బయటపడగలిగారు

అతని నవల 'రిసరెక్షన్' (చైతన్యవంతము) ప్రపంచ సాహిత్యంలో సంచలనం సృష్టించింది అహింసా, సహాయనిరాకరణ ఇతని రచనల్లో ఎంత ఎక్కువగా బోధించాడంటే, చాలామంది యువకులు సైన్యంలో

చేరటానికి, యుద్ధాలు చేయటానికి నిరాకరించసాగారు. టాల్‌స్టాయ్ అహింసా సిద్ధాంతం, సహాయనిరాకరణను గాంధీజీ తరువాత భారతదేశంలో ఆచరణలో పెట్టారు.

టాల్‌స్టాయ్ మతగ్రంధాలమీద, వేదాంత గ్రంధాలమీద; నవలలు, నాటకాల మీద; వ్యాసాలు, తత్త్వరచనల మీద వచ్చే ఆదాయం దేశానికి చెందాలని, రహస్యంగా వీలునామా రాశాడు ఇది టాల్‌స్టాయ్ భార్యకు నచ్చక ఆ పుస్తకాల మీద దండెత్తింది భర్తని రాత్రింబవళ్ళు రాచి రంపాన పెట్టింది. ఈ బాధ పడలేక టాల్‌స్టాయ్ రహస్యంగా ఇల్లు వదలి పారిపోయాడు

ప్రయాణంలో చలి, జ్వరం, ఎనభై రెండేళ్ళ వృద్ధాప్యం పైగా భార్య సోఫియా పంపిన గూఢచారుల బెడద మరోపక్క! ఒక పల్లెటూరి స్టేషనులో, ఆ స్టేషనుమాస్టరు టాల్‌స్టాయ్‌కు ఆశ్రయం ఇచ్చాడు సోఫియా అక్కడికి వచ్చినా, ఆమెను వైద్యులు టాల్‌స్టాయ్ దగ్గరకు రానివ్వలేదు. ఆమె ఎదుటపడితే అతను చనిపోతాడేమోనని భయం చివరి క్షణంలో ఆమె వచ్చి, తన చర్యలకు పశ్చాత్తాపంతో 'నన్ను క్షమించు' అంది అప్పటికే టాల్‌స్టాయ్ కీర్తిశేషుడయ్యాడు ఎంతో సిరిసంపదలు, పేరుప్రతిష్టలున్న టాల్‌స్టాయ్, చివరి నిముషంలో అలా చనిపోయాడు

## ప్రముఖ విహంగశాస్త్ర నిపుణుడు జహంగీర్

కళాపోషకుడుగా, న్యాయవేత్తగా, రాజనీతిజ్ఞుడుగా, పరిపాలనాదక్షుడుగా జహంగీర్ చరిత్ర విద్యార్థులకు తెలుసు

కానీ, జహంగీర్ మంచి విహంగశాస్త్రవేత్త కూడా భారతదేశం గర్వించదగ్గ విహంగశాస్త్ర నిపుణుడు, స్వర్గీయ సలీమ్ అలీ మాటల్లో చెప్పాలంటే, "జహంగీర్ పొందుపరచిన ఆలోచనలు, నివేదికలు, తైలవర్ణ చిత్రాలు, 16, 17 శతాబ్దాల భారతీయ జీవశాస్త్ర చరిత్రను చెప్పటానికి సాక్ష్యాలు "

ఒకసారి మొగల్ ఆస్థాన వేటగాడు ఒక చిన్న పక్షిని తెచ్చి, "పాదుషాజీ.! ఇది ఆడపక్షో, మగపక్షో తెలియటంలేదు!" అన్నాడు

జహంగీర్ ఆ పక్షిని కాస్సేపు నిశితంగా పరీక్షించి, "ఇది ఆడపక్షి! సందేహం లేదు" అన్నాడు

తన మాట రుజువు చేయించటానికి, ఆ పక్షిని కోసి చూడటం కూడా జరిగింది ఆ పక్షి గర్భకోశంలో గుడ్లు కూడా కనిపించాయి.

"ఈ విషయాన్ని మీరెలా ముందే చెప్పగలిగారు పాదుషా?" అన్నాడట ఆశ్చర్యంతో వేటగాడు.

అప్పుడు జహంగీర్ "ఏముంది? నేను ఆ పక్షి ముక్కును పరీక్షగా చూసి చెప్పాను! పక్షి ముక్కు సన్నగా చిన్నదిగా వుండటంవల్ల అది ఆడపక్షి అని గట్టిగా చెప్పాను" అన్నాడు

పక్షి ముక్కు వుండే తీరుని బట్టి పరీక్షించి, అది ఆడపక్షో, మగపక్షో తేల్చటం ఇప్పటికీ విహంగశాస్త్ర నిపుణులు పాటిస్తున్న అంశమే.

కాబట్టే జహంగీర్ కూడా విహంగశాస్త్ర నిపుణుడని, ఇప్పటి శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నది

## అంతా అరటికెక్కట్టుగాళ్ళు

**భా**రతదేశం– భారత్, పాకిస్తాన్‌గా 1947లో విడిపోవడంతో కొందరు ఉర్దూ కవులు భారతదేశంలో వుండిపోయారు అలాగే, కొంతమంది పాకిస్తాన్‌కు వలసపోయారు అయితే అటు ఇటు దేశాల్లో కవులకు మిత్రులున్నారు. దేశాలు విభజన జరిగినా, సాహిత్య విభజన జరగదుగదా! ఈ అంశాన్ని నిరూపించడానికి ప్రముఖ ఉర్దూ కవుల సమ్మేళనం ఢిల్లీలో ఒకసారి జరిగింది

పాకిస్తాన్‌లో ప్రముఖ కవిగా, పాటల రచయితగా ప్రఖ్యాతి పొందిన 'ఖాతిల్ షిఫాయి' ఆ కవి సమ్మేళనానికి వచ్చాడు అక్కడ పాకిస్తాన్‌లో కవులకెంతో మంచి గుర్తింపు, గౌరవం, మన్నన, అనేక రాయితీలు, ప్రోత్సాహకాలూ లభిస్తున్నాయని చెప్పడానికి ఖాతిల్ షిఫాయి – "పాకిస్తాన్‌లో నువ్వు కవివనే హామీపత్రం, ప్రభుత్వం నుంచి వుంటే చాలు – ఏ హోటల్‌లోనైనా మీకు సగం ధరకే అక్కడ అన్ని పదార్థాలు లభ్యమవుతాయి! అలాగే రైలులో మీకు అర్ధఛార్జీతో ప్రయాణం సాధ్యం" అంటూ చెప్పాడు

తన మాటలు వింటున్న సాహిర్ లుధియాన్వివైపు ఖాతిల్ షిఫాయి చూస్తూ "అర్థమైందా?" అన్నట్టు అడిగాడు

"ఆహా! అర్ధమైంది, అక్కడి సాహితీవేత్తలంతా అరటికెక్కాట్టుగాళ్ళని, ఇంకా వాళ్ళు పరిపక్వత వచ్చేలా ఎదగాలని" అన్నాడు చురక అంటిస్తూ

ఇక పాకిస్తాన్‌లో కవుల సౌకర్యాన్ని గురించి నోరెత్తలేదు ఖాతిల్‌గారు.

## సైగల్ మిత్రత్వానికిచ్చిన ప్రాధాన్యత

ప్రముఖ సీనియర్ హిందీ నటుడు మోతీలాల్ తన పుట్టినరోజు వేడుకకు అందరినీ ఆహ్వానించి, ఆప్తమిత్రుడు ప్రముఖ సంగీతనిధి సైగల్‌ని మాత్రం పిలవలేదు.

దీనికి ముఖ్య కారణం సైగల్ బాగా అనారోగ్యంతో బాధపడుతున్నాడు. పుట్టిన రోజు పండుగకు పిలిస్తే అతను తప్పక పాడి తీరుతాడు. దానివల్ల సైగల్ ఆరోగ్యం మరింత దెబ్బతింటుంది. ఇది ఇష్టంలేకే మోతీలాల్ మిత్రుణ్ణి పిలవలేదు.

ఈ సంగతి సైగల్‌కు తెలిసి వెంటనే తన కారులో మోతీలాల్ ఇంటికి వచ్చేశాడు ఇంట్లో అతన్ని వారించడానికి సైగల్ నౌకర్లు ప్రయత్నం చేస్తే "నా మిత్రుడి పుట్టినరోజు పండుగకు నేను వెళ్ళకుండానా! నన్ను ఆపకండి" అన్నాడు

ఉరుములా వచ్చిన సైగల్‌ని చూసి మోతీలాల్ ఆనందించి కావలించుకున్నాడు.

అప్పుడు సైగల్ "మిత్రమా! ఈ సైగల్ ఇంకా బతికే వున్నాడు. మరచిపోకు" అన్నాడు

"నీ ఆరోగ్యం దృష్ట్యా నిన్ను పిలవలేదు" అన్నాడు మోతీలాల్.

"నా ఆరోగ్యం పాడుగాను. నా మిత్రుడి జన్మదినానికి నేను పాట పాడకుండానా! తెప్పించు తంబూర" అంటూ అది మీటుతూ ఆ రాత్రంతా పాట కచేరీ పెట్టాడు, సైగల్

మోతీలాల్ జన్మదినంలో సైగల్ పాల్గొన్నది ఆ చివరిసారి పాటలు పాడుతూనే

# అజాద్ ఔన్నత్యం

గాంధీగారి నాయకత్వంలో, 1921 సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా సాగింది. ఆ ఉద్యమంలో పాల్గొని పికెటింగ్ చేసినందుకు, పధ్నాలుగేళ్ళ బాలుడి మీద కేసు నడిచింది. మేజిస్ట్రేట్ అంత పసివాడు ఉద్యమంలో చేరడంపట్ల ఆశ్చర్యంతో "నీ పేరు?" అంటూ అడిగాడు.

"అజాద్" (స్వాతంత్ర్యము)

"తండ్రి పేరు?"

"స్వేచ్ఛ"

"ఇల్లు?"

"చెరసాల"

ఈ జవాబులతో మండిపడ్డ మేజిస్ట్రేట్, ఆ కుర్రవాడికి పదిహేను కొరడా దెబ్బల శిక్ష విధించాడు. అయితే, శిక్ష అమలుచేస్తూ కొరడాదెబ్బ కొట్టిన ప్రతిసారీ ఆ కుర్రవాడు "మహాత్మా గాంధీకీ జై" అంటూ నినాదం చేశాడు వీపు చీలి రక్తం ప్రవహించినా, ఆ గాంధీజీ పేరు వదల్లేదు ఆ పసివాడు

అతనే తరువాత చంద్రశేఖర్ అజాద్ పేరుతో ప్రసిద్ధుడైన విప్లవవీరుడు.

అతను లాలా లజపతిరాయ్‌ను లాఠీతో కొట్టి చంపిన పోలీసు అధికారిని పిస్టల్‌తో కాల్చి చంపి, తరువాత చిక్కకుండా అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాడు.

అలా అతని జీవితం ఎక్కువకాలం అజ్ఞాతవాసంలో గడుపుతుండగా ఓ మిత్రుడు "ఇన్నాళ్ళు అజ్ఞాతవాసంలో వున్న నీకు నీ తల్లి గుర్తొస్తే ఏం చేస్తావు?" అంటూ అడిగాడు

"అప్పుడు భూమాతే నా తల్లిగా భావించి, నా అసహాయతను మన్నించమని తల నేలకు ఆనించి కన్నీరు కారుస్తాను" అన్నాడు అజాద్. తరువాత ఈ వీరుడు 1931లో అలహాబాద్‌లోని ఓ పార్కులో కాల్చి చంపబడ్డాడు.

## రామమోహన్‌రాయ్ పటాన్ని తీసివేయమన్న 'విద్యాసాగరుడు'

విద్యాసాగరుడి నిరంతర కృషివల్ల, వితంతు వివాహానికి 1856లో గవర్నర్ జనరల్ అంగీకారం శాసనమండలిద్వారా లభించింది

అదే సంవత్సరం బెంగాలులోని కలకత్తాలో రాజకృష్ణ బంధోపాధ్యాయుని ఇంట్లో మొదటి వితంతు వివాహానికి ఏర్పాట్లు జరిగాయి

వరుడు శ్రీ చంద్ర విద్యారత్న వధువు 12 ఏళ్ళ కాళీమతి ఇది నగరంలో సంచలనం సృష్టించడంతో, విద్యాసాగర్ ముందుగానే రక్షణ ఏర్పాటు చేశాడు. జనసందోహంతో ఆ ప్రాంతమంతా క్రిక్కిరిసిపోయింది అసంభవమూ, అనూహ్యమైంది నిజంగా జరుగుతోంది

మహా సంస్కర్త, విద్యాసాగర్‌కు ఆదర్శప్రాయుడైన రాజారామమోహన్ రాయ్ కనిష్టపుత్రుడు రామ్‌ప్రసాద్‌రాయ్ విద్యాసాగరుడికి మిత్రుడు వితంతు వివాహమంటే అతనికి మొదటినుంచి సానుభూతి వుంది వివాహానికి ముందే ఉత్సవానికి రమ్మనమని విద్యాసాగర్, రామ్‌ప్రసాద్‌ను ఆహ్వానించాడు

"నేను పరోక్షంగా వివాహానికి సాయపడతాను కానీ బహిరంగంగా వివాహమహోత్సవంలో పాల్గొనడం నాకు ఇష్టంలేదు" అంటూ రామ్‌ప్రసాద్ తెలియజేశాడు

ఆచరణయోగ్యంకాని ప్రచారాన్ని సహించని విద్యాసాగర్‌కు పట్టరాని కోపమొచ్చింది గోడకున్న రాజా రామమోహనుడి పటాన్ని చూపుతూ "ఆ పటాన్ని క్రిందికి లాగండి, దాన్ని పారవేయండి" అంటూ అరిచాడు మనోవాక్కాయ కర్మల్లో నిజాయితీగా వుండే విద్యాసాగరుడివంటివారు శకానికొకరుంటారేమో!

## నాయకుడిగా 'మావో' ఆదర్శ లక్షణాలు

చైనా రూపురేఖలను, జీవనశైలిని, ఆలోచనాతీరుని ప్రభావితం చేసిన మహానాయకుడు మావో, స్వార్థాన్ని మరచి ప్రజాసేవకు, దీనజనోద్ధరణకు పూనుకోవడం మావోకు చిన్నప్పటినుంచి అలవాటు

గాలివాన, వాగువరద వస్తే తండ్రి తమ పొలం సంగతి చూడమని పంపిస్తే ముందు ఎంతో పేదలైన ముసలీ ముతకా రైతుల పొలాల రక్షణకు పూనుకునేవాడు తరువాత మాత్రమే తమ పొలం సంగతి చూసేవాడు ఇలా చేసి తండ్రిచేత చివాట్లు తినేవాడు.

ఒకసారి మావో తండ్రి తమకు రావలసిన పాతబాకీలు వసూలు చేసుకురమ్మనమని మావోని రైతుల దగ్గరకు పంపాడు అప్పటికే కరవు కాటకాలతో సతమతమవుతూ, తిండికే గడవని రైతులు ఇంక బాకీలు ఏంతీరుస్తారు? అందుకని ఆ బాకీలన్నీ రద్దుచేసింది కాక, వస్తూ వస్తూ తన వంటిమీది చొక్కా ఓ పేదరైతుకు దానమిచ్చి వచ్చాడు మావో.

మావో పెద్ద నాయకుడిగా ఎదిగినా, చైనా ఎర్రసైన్యం తన దీర్ఘయాత్రలో (లాంగ్ మార్చ్) ఒక మామూలు సైనికుడుగా అందరితో పాటు నడుస్తూ, తన గుర్రాన్ని, చలిదుస్తుల్ని జబ్బుగా వున్న సైనికులకిచ్చేసిన ఆదర్శనాయకుడు మావో ఈ ఆదర్శ నాయక లక్షణాలే భవిష్యత్తులో ఈయనను పీడిత ప్రజావిముక్తి నాయకోత్తముణ్ణి చేశాయి

## నెపోలియన్ చెప్పిన సమాధానం

నెపోలియన్ బోనాపార్టీ ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఫ్రెంచ్ చక్రవర్తి. గొప్ప రణరంగ యోధుడుగా చరిత్ర సృష్టించాడు 1895లో ఫ్రాన్స్‌లో రాజరికాన్ని అంతమొందించి, ఫ్రెంచి సామ్రాజ్యాధినేత అయ్యాడు. 1807లో రష్యన్ సైన్యాన్ని ఓడించాడు అతను రష్యాను జయించాలని ఆ దేశంలోకి ప్రవేశించినపుడు, అప్పటికే నిరాశనిస్పృహలకు గురైన వృద్ధవనిత అతని దగ్గరికొచ్చింది ఆమె నెపోలియన్‌తో సూటిగా "ఇది నిజమేనా– ఫ్రెంచి వాళ్ళు భూమికోసం, ధనసంపదకోసం, స్త్రీలకోసం యుద్ధం చేస్తారనేది?" అంది

నెపోలియన్‌కు ఆమె మాటలు వినడంతో వళ్ళు మండింది. అయినా తన కోపాన్ని అదుపులో పెట్టుకుని ముఖాన చిరునవ్వు చిందించి, "మీ దేశస్థులు దేనికోసం యుద్ధం చేస్తారో తెలియచేస్తే తెలుసుకుని సంతోషిస్తాను" అన్నాడు.

ఆ వృద్ధవనిత గర్వంగా, "మేము అలా మీరు పోరాడిన వాటి కోసము పోరాడము మేము పోరాడితే మా గౌరవాన్ని కాపాడుకోడానికే పోరాడుతాము" అన్నది.

వెంటనే నెపోలియన్ "నిజమేనమ్మా! నువ్వు చెప్పిన దానితో నేనూ ఏకీభవిస్తాను ప్రతివాళ్ళూ వారికి ఏది లేదో, దాని కోసమే పోరాడుతారు" అన్నాడు నవ్వుతూ.

## మార్క్ ట్వయిన్ సభారంజకత

ప్రముఖ అమెరికా హాస్యరచయిత మార్క్ ట్వయిన్‌కి సభికుల్ని ఎలా రంజింప చేయాలో తెలిసినట్లుగా మరొకరికి తెలియదు

పుస్తక ప్రచురణ రంగంలో లక్షలు, కోట్లు సంపాదించవచ్చని ఆశపడ్డాడు మార్క్ ట్వయిన్ దురదృష్టవశాత్తు అతనికి వ్యాపారలక్షణాలు లేక అందులో లౌక్యం తెలియక లక్షల డాలర్ల నష్టం వచ్చింది ఆ అప్పులు తీర్చుకోడానికి హాస్య ప్రసంగాలు చేస్తూ, టిక్కెట్టు పెట్టి, అవి అమ్మగా వచ్చిన డబ్బుతో అప్పులు తీర్చసాగాడు మార్క్ ట్వయిన్ హాస్యప్రసంగం అంటే జనం విరగబడేవారు.

ఒకసారి అయిదువేలమంది వున్న అలాంటి హాస్య ప్రసంగానికి మార్క్ ట్వయిన్ రాలేకపోయాడు సరిగ్గా అదే ప్రసంగం, అదే టిక్కెట్టు పైన మరునాడు రమ్మనమని ప్రేక్షకుల్ని కోరాడు మార్క్ ట్వయిన్ టెలిగ్రాములద్వారా మరునాడు మళ్ళీ అదే విధంగా టెలిగ్రాం ఇచ్చాడు. మూడోరోజు అయిదొందలమందే వచ్చినా అంతా కోపంగా వున్నారు. అన్నిసార్లు సభ వాయిదా పడడం నచ్చలేదు

ఇది కనిపెట్టిన మార్క్ ట్వయిన్, "మొన్న, నిన్న వచ్చిన అయిదు వేలమంది గుంపుకి నా హాస్య ప్రసంగం వినిపించాలని నేను ఇష్టంలేక రాలేదు అయిదువందలమందయినా మీరు పాలమీగడవంటి నిఖార్సయిన అభిరుచులున్నవారు అందుకే మీ కోసం ఇలా నా ప్రసంగం వాయిదావేస్తూ ఇలా చేశాను" అనేప్పటికి ఆ వచ్చినవాళ్ళు ఆ పొగడ్తకి ఎంతో ఆనందించారు. అతను తన ప్రసంగం కొనసాగించాడు.

## 'బలహీనమైన భాగానికే దెబ్బ తగిలింది' అని ఛలోక్తి విసిరిన నెహ్రూ

నెహ్రూగారికి చిన్నప్పటి నుంచి గుర్రపుస్వారీ అంటే చాలా ఇష్టం. కాశ్మీరుకు ఎప్పుడు వెళ్ళినా తప్పక గుర్రపుస్వారీ చేసేవారు

ఒకసారి నెహ్రూ; ఇందిరాగాంధీ, షేక్ అబ్దుల్లా, మియాన్ ఇఫ్టికురుద్దీన్ గుర్రాల మీద స్వారీకి బయలుదేరారు ఇఫ్టికురుద్దీన్‌కి గుర్రపుస్వారీ తెలియదు అయినా "తెలివితేటలు బుర్రలో వుంటే ఆ మాత్రం గుర్రపుస్వారీ చేయలేనా?" అన్నాడు ధైర్యంగా గుర్రమెక్కి.

పండిట్ నెహ్రూ, షేక్ అబ్దుల్లా గుర్రాల మీద కొంతదూరం వెళ్ళాక తెలిసింది ఇఫ్టికురుద్దీన్ గుర్రంమీదనుంచి పడిపోయాడని

నెహ్రూ, షేక్ అబ్దుల్లా వెంటనే వెనక్కి తిరిగి వచ్చారు

అప్పటికే లేవలేకపోతున్న ఇఫ్టికురుద్దీన్‌ని కొందరుపట్టి లేపి కూర్చోబెట్టి సపర్యలు చేస్తున్నారు

"ఎలా వుంది? ఎక్కడ దెబ్బ తగిలింది?" అంటూ షేక్ అబ్దుల్లా అడగగా –

"తలకు దెబ్బ తగిలింది" అన్నాడు ఇఫ్టికురుద్దీన్

"శరీరంలో ఏ భాగం బాగా బలహీనమో ఆ భాగానికే దెబ్బ తగిలిందే" అన్నాడు నెహ్రూజీ ఇఫ్టికురుద్దీన్‌ని నవ్విస్తూ

## చార్లీచాప్లిన్‌ను నవ్వించిన గాంధీజీ!

గాంధీగారి ఆటోగ్రాఫ్ తీసుకోవాలని, ఆయన చిన్నప్పటి ఫోటో సంపాదించిన ఒక ఫోటోగ్రాఫరు ఆయన దగ్గరకెళ్ళాడు అప్పుడు గాంధీజీ ఢిల్లీకి దగ్గరగా హరిజనుల కోసం ఆయన ఏర్పాటుచేసిన ఆశ్రమంలో వుంటున్నారు

గాంధీగారు తన చిన్నప్పటి ఫోటోచూసి పడిపడి బిగ్గరగా నవ్వసాగారు

"ఏమిటి అలా నవ్వుతున్నారు?" అంటూ అడిగాడు ఫోటోగ్రాఫర్ ఆశ్చర్యంగా

గాంధీజీ ఇంకా నవ్వుతుంటే ఫోటో గ్రాఫరు "మీ పోలికలు స్పష్టంగా వున్న ఫోటోల్లో బాగున్నది ఇదే! మరి మీరు నవ్వడానికి కారణం?"

"ఈ ఫోటో బ్రహ్మాండంగా వుందయ్యా! నేను ఒకప్పుడు ఎంత కురూపిరూపంలో వుండేవాణ్ణో ఇది నాకు ఇప్పుడు గుర్తుచేస్తోంది" అన్నారు నవ్వుతూ.

గాంధీజీకి సినిమాలు చూడడం అలవాటు లేదు. అయితే అహింసా విప్లవనేత గాంధీజీని చూడాలని చార్లీచాప్లిన్ కుతూహలపడి ఆయన్నే ఇంటర్వ్యూ అడిగాడు.

చాప్లిన్ సినిమాలు చూడని గాంధీ మొదట చాప్లిన్ ఇంటర్వ్యూ కాదన్నా - అతను నిరుపేద కుటుంబంలో పుట్టి, కష్టపడి ప్రపంచ ప్రఖ్యాత నటుడయ్యాడని తెలిసి ఇంటర్వ్యూ ఇచ్చారట.

అయితే ఆ ఇద్దరి సమావేశంలో గాంధీజీని చాప్లిన్ యాంత్రిక విప్లవాన్ని గురించి అడిగాడట. అయితే గాంధీజీ మాత్రం చాప్లిన్‌ని తెగ నవ్వించేట్టు సమాధానాలు చెప్పారు. అంతా అయ్యాక "ప్రపంచ ప్రేక్షకుల్ని నవ్వించే నన్నే గాంధీజీ నవ్వించారంటే ఆయన గొప్పతనం అర్థమైంది" అన్నాడట చాప్లిన్ నవ్వుతూ.

## నిర్మొహమాటి కృష్ణమీనన్

కృష్ణమీనన్ రక్షణ మంత్రిగా వున్నప్పుడు నావిక, రక్షణ, వైమానిక దళాధిపతులతో ఒకరోజు చర్చ జరుపుతున్నాడు. రష్యా నుంచి "MIG" విమానాలు కొనే విషయంగా ఎయిర్‌మార్షల్ ఇంజనీర్ మాట్లాడుతూ (అప్పుడాయన వైమానిక దళాధిపతి) "ఈ రష్యా విమానాలలో నాకు కొన్ని లోపాలు కనిపిస్తున్నాయి" అన్నాడు.

వెంటనే కృష్ణమీనన్‌కు వళ్ళుమండి "నువ్వు వైమానిక దళాధిపతి అయ్యుండవచ్చు. నీ పేరులో "ఇంజనీర్"అనే పదం వుండవచ్చు. అంతమాత్రంచేత నువ్వు ఆ యుద్ధ విమానాలు సృష్టించిన ఇంజనీర్లకంటే నిజంగా గొప్పవాణ్ణనుకుంటున్నావా?" అన్నాడు.

అమెరికాకు వెళ్ళినప్పుడు కృష్ణమీనన్ మాట్లాడిన ఇంగ్లీషు పదాలకంటే ఇంకొన్ని మాట్లాడి వుంటే బాగుండేదని అన్నాడు పియర్‌సన్ డిక్సన్ కృష్ణమీనన్‌కు సలహా ఇస్తూ

కృష్ణమీనన్ పాశ్చాత్య విశ్వవిద్యాలయాల్లో ఇంగ్లీషు అభ్యసించినవాడే. అందుకే కోపంవచ్చి "ఇంగ్లీషు భాషలో నాకు సలహాలిచ్చేవాడివా? ఆ భాష నేను కష్టపడి నేర్చుకున్న వాణ్ణి. నీలా కంఠతా పట్టిన నాలుగు పదాలతో మాట్లాడుతున్నవాణ్ణి కాదు" అన్నాడు కృష్ణమీనన్

"బ్యాంకుల జాతీయకరణ విషయంగా మీ అభిప్రాయం ఏమిటి?" అంటూ, ఒక విలేఖరి అడగ్గా "దేశంలోని బ్యాంకులన్నీ ప్రపంచ బ్యాంకు సూచనలు పాటిస్తూ నడుస్తుంటే–అవి జాతీయంచేసి ఏమిటి, చేయకేమిటి లాభం?" అన్నాడు నిర్మొహమాటంగా కృష్ణమీనన్.

## పీలూమోడీ చతురోక్తులు

పీలూమోడీ మంచి భారమైన కాయంతో చూడడానికి నవ్వు వచ్చేట్టుండేవాడు వృత్తిచేత శిల్పి, కట్టడాలకు సంబంధించిన విషయ పరిజ్ఞానంలో అఖండుడు(ఆర్కిటెక్ట్)

అయితే, అనుకోకుండా రాజకీయాల్లోకి వచ్చాడు ఆయన ఇదే విషయం అడిగితే "దీనికి ఒక ముఖ్య కారణముంది. భారతదేశంలో ఒక గొప్ప శిల్పాచారి అభిప్రాయాలకన్నా, ఆ విషయం ఏమీ తెలియని జగ్‌జీవన్‌రామ్‌వంటివారి అభిప్రాయాలకే ఎక్కువ విలువ వుంది దీనికి కారణం ఆయన రాజకీయవేత్త కావడమే నేనూ అంతే! వృత్తిచేత నేను శిల్పిని. అందుకే నా వృత్తిలో నాకు గౌరవం, మన్ననలు లేక రాజకీయాల్లోకి దిగాను" అన్నాడు.

పార్లమెంట్‌లో ఉషా మల్‌హోత్రా అడిగిన ప్రశ్నకు పీలూమోడీ సమాధానం చెబుతున్నాడు. అయితే ఉషా మల్‌హోత్రా సీటు పీలూ మోడీ సీటుకు వెనక వుంది

పీలూమోడీ లావుగా వుండి, కదలలేని స్థితిలో అలాగే తలతిప్పి సమాధానం చెబుతున్నాడు.

ఆడవాళ్ళకు తగిన మర్యాద ఇచ్చి సమాధానం చెప్పాలనే ఉద్దేశ్యంతో అప్పటి ఛైర్మన్ హిదయతుల్లా "మీరు కొంచెం ముందుకు తిరిగి మాట్లాడితే బాగుంటుంది" అన్నాడు

"నేను ఎక్కువ లావుగా వున్నానుగా! నాకు ముందు వెనుక అంటూ ఏమీ వుండవు" అన్నాడు పీలూమోడీ

## మాలవ్యాగారు వేసిన ఎత్తుగడ

బెనారస్ యూనివర్సిటీ నిర్మాణం కోసం మదనమోహన మాలవ్యా అందరు ధనికుల దగ్గర డబ్బు వసూలు చేశారు అయితే అప్పటి నిజామ్ నవాబు మాత్రం మాలవ్యాగారికి చందారూపంలో దమ్మిడీ ఇవ్వలేదు

అయినా మాలవ్యా చందా వసూలు చేయకుండా వెనక్కు తిరిగి బెనారస్‌కు వెళ్ళకూడదనుకొని గట్టి పట్టుదలతో వున్నారు.

ఇంతలో ఒకరోజు హైదరాబాద్‌లో ఒక పెద్ద ధనికుడు చనిపోతే అంత్యక్రియల సందర్భంగా డబ్బులు చల్లుతున్నారు. మాలవ్యా క్షణం ఆలస్యం చేయకుండా, ఆ అంత్యక్రియలు నిర్వహించేవారు చల్లుతున్న డబ్బు తను ఏరుకోవడం ప్రారంభించారు

మదనమోహన మాలవ్యా అంతటి గొప్ప వ్యక్తి అలా చల్లిన డబ్బు ఏరుకుంటుండడం ఆశ్చర్యంగా చూసినవారు "ఇదేమిటీ! ఇది మాలవ్యాజీ గారు చేయదగిన పనికాదే?" అన్నారుట

వెంటనే మాలవ్యా "ఏం చేయమంటారు? హైదరాబాదు సంస్థానానికి వెళ్ళి వచ్చాను, నిజామ్ అంతటి గొప్ప కోటీశ్వరుడు ఏం చందా ఇచ్చాడంటే-ఏమీ ఇవ్వలేదంటే నిజాముగారికెంత అవమానం? కనీసం ఈ డబ్బునైనా నిజామ్‌గారి సంస్థానం ఇచ్చిన డబ్బుగా ప్రకటిస్తాను" అన్నారట

ఈ వార్త పత్రికల్లో రావడంతో మరునాడే నిజామ్ మాలవ్యాకు క్షమాపణ చెప్పి పెద్దమొత్తం బెనారస్ యూనివర్సిటీకి అందజేశాడు.

## జగ్జీవన్‌రామ్ అంటించిన చురక

పార్లమెంట్‌లో జోక్స్ పేల్చడంలో, సమయానుకూలంగా వాతావరణాన్ని తేలిక పరచడంలో, చణుకు విసిరినా ప్రతిగా తిరిగి చణుకు తినడానికి వాజ్‌పాయ్‌గారు గొప్ప సమర్థులు

అప్పుడు కేంద్ర మంత్రివర్గంలో బాబూ జగ్జీవన్‌రామ్ రైల్వేమంత్రి అప్పుడున్న పార్లమెంట్ సభ్యులకు ఇప్పుడున్న పార్లమెంట్ సభ్యులకున్నన్ని రాయితీలు లేవు

రైల్వేమంత్రిగా వున్న జగ్జీవన్‌రామ్ ఎం.పి ల అభీష్టానికి తగ్గట్టు ఫస్ట్‌క్లాస్‌లో ఎం పి.లతోపాటు, వాళ్ళ శ్రీమతులు కూడా ప్రయాణం చేయడానికి (ఉచితంగా అవకాశం) పాసుతో ఇవ్వాలని ఒక బిల్లు ప్రవేశపెట్టారు

అయితే, వాజ్‌పాయ్‌గారు బ్రహ్మచారి. అందుకని ఆయన "ఎం పి లతోపాటు తోడుగా మరొక స్త్రీని తీసికెళ్ళడానికి వీలుంటుందా జగ్‌జీవన్‌రామ్‌గారూ?"అంటూ అడిగారు.

వెంటనే జగ్జీవన్‌రామ్ "మేము చట్టం చేస్తున్నది "స్పవుస్" (భార్య–లేక–భర్త)కు అవకాశం కల్పిస్తూ. అంతేకాని, "స్పయిస్" (మసాలాపొడి) (భార్యకాని స్త్రీలకోసం) కాదు ఎం.పి.గారూ" అన్నారు చురక అంటిస్తూ

## 'ఆ తట్టా-బుట్టా వదలి వెళ్ళండి'-రాజాజీ

అప్పటికింకా భారతదేశానికి స్వాతంత్ర్యం రాలేదు.

బ్రిటీషు వాళ్ళను ఇక దేశం నుంచి తరిమివేయాలని, "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని గాంధీజీ 1942లో ప్రారంభించారు.

గాంధీగారి ప్రముఖ శిష్యగణమంతా "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని, దాని ప్రాముఖ్యతను తెలియజేస్తూ, ప్రసంగాలు చేస్తూ, ఉద్యమాలు నడిపిస్తున్నారు

ఒక రోజు "క్విట్ ఇండియా" (దేశం వదలి వెళ్ళండి) అంటూ రాజాజీ ఓ బ్రిటీషు పౌరుడితో చెబుతున్నారు.

ఆ బ్రిటీషు పౌరుడు "కోట్లాది పౌండ్లు ఖర్చుచేసి శ్రమించి, నగరాలు నిర్మించాము. రోడ్లు వేయించాము, కాలువలు తవ్వించాము, రైలు మార్గాలు ఏర్పాటు చేశాము ఇప్పుడు ఒక్కసారిగా నిజంగానే మమ్మల్ని "తట్టా–బుట్టా" (బాగ్–అండ్ బాగేజ్) సర్దుకుని ఇండియా వదిలి వెళ్ళమని సీరియస్‌గా చెబుతున్నారు! ఇదెలా సాధ్యం?" అన్నాడు వాదిస్తూ.

అతని మాటలు విన్న రాజాజీ "మిమ్మల్ని మాత్రమే వెళ్ళమంటున్నాం– ఆ తట్టా బుట్టా మాత్రం ఇక్కడే వదిలి వెళ్ళమంటున్నాం" అన్నాడు ఇంకాస్త చురక అంటిస్తూ

## ముత్తయ్‌కు కృపలానీ కొట్టిన దెబ్బ

పెద్ద పెద్ద హోదాల్లో వున్నవాళ్ళదగ్గర పనిచేసేవాళ్ళు చిన్నవాళ్ళయినా ఆ పెద్ద వాళ్ళకంటే తామే గొప్పవాళ్ళమనే మనస్తత్వం వుంటుంది.

అందుకే వేమన్న అంతటివాడే "స్థానబలిమికాని-తన బలిమికాదయా" అని అంది.

నెహ్రూగారు దేశప్రధానిగా వుండగా ఆయన అంతరంగికుల్లో అత్యంత ప్రధాన వ్యక్తి ఎమ్.ఎ. ముత్తయ్.

ఈ మహానుభావుడే తరువాత నెహ్రూగారి అంతరంగిక జీవితచరిత్ర రాసి ప్రపంచానికి తెలియని అనేక విషయాలు బయటపెట్టాడు

నెహ్రూగారితో పనులు చేయించాలనుకునే పెద్ద సెంట్రల్ కేబినెట్ మినిష్టర్లు, రాష్ట్ర ముఖ్యమంత్రులు ఈయనను ముందు ప్రసన్నం చేసుకునేవారు. అంత ప్రాధాన్యత వుండేది ముత్తయ్‌కి

ఒకసారి ముత్తయ్ ప్రధానమంత్రి నిలయంనుంచి ఫోనులో మాట్లాడుతూ "నేను ప్రధాని కార్యాలయంనుంచి మాట్లాడుతున్నాను" అన్నాడు ఆచార్య కృపలానీతో.

దానితో కోపం వచ్చిన కృపలానీ తిరిగి అదే ధోరణిలో దర్పం ఉట్టిపడేట్టు "నేను నా స్వగృహం నుంచి, నా సొంత ఫోనులో మాట్లాడుతున్న సామాన్యవ్యక్తిని" అంటూ చురక అంటించాడు.

దెబ్బతో ముత్తయ్‌కు గర్వం దిగిపోయింది.

## 'గామా' - ప్రపంచ మల్లయోధుడి ఫిర్యాదు

ప్రపంచ ప్రసిద్ధ మల్లయోధుడుగా కీర్తిగాంచిన "గామా" 1947లో పాకిస్తాన్ ఏర్పడగానే, తను ముస్లిం పహిల్వాన్ కాబట్టి తనకు అక్కడ బాగా గుర్తింపు వస్తుందనుకుని వెళ్ళాడు.

అయితే పాటియాలా సంస్థానంలో ఆయన మల్లయోధుడుగా వున్నప్పుడు అక్కడ అతనికి లభించిన గౌరవం, మర్యాద, తిండి, ఆదరణ అంతా స్వాతంత్ర్యానికి ముందే లభించాయి

పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రంలోకి వెళ్ళి అక్కడ చేరిన "గామా"ను గురించి పట్టించుకున్నవాళ్ళే లేరు తిండికే గడవక, మల్లయోధుడుగా

పాటియాలా మహారాజు ఇచ్చిన తిండికి అలవాటుపడ్డ మనిషిగా అక్కడ పాకిస్తాన్‌లోని పంజాబ్ రాష్ట్రంలో వుండలేక, ఒకరోజు ఆ రాష్ట్ర గవర్నర్ దర్శనం చేసుకుని తన బాధ చెప్పుకున్నాడు గామా.

"మీకు పాటియాలా మహారాజు రోజూ తిండి క్రింద ఏమేమి ఇచ్చేవాడు?" అని అడిగాడు గవర్నర్.

"ఆరు గాలన్‌ల పాలు, అంతే బరువుండే వెన్న, బాదం పప్పు కిలో, ఆరుకోళ్ళు – ఇవి రోజూ పొద్దునా సాయంత్రం ఉచితంగా ఇచ్చేదికాక, నెలసరి జీతం, ఉచితవసతి, తాలింఖానా" అంటూ చెప్పాడు గామా.

ఇది విన్న గవర్నర్ "ఈ ఖర్చు రాష్ట్ర ప్రభుత్వం భరించలేదు. కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేస్తాను" అన్నాడు చెమటలు తుడుచుకుంటూ.

## నెహ్రూజీ అంటించిన చురకలు

**త**రచు తనను కలుసుకొని రకరకాల ప్రశ్నలతో వేధించే పత్రికా విలేఖరులను నెహ్రూజీ వాళ్ళ కొంటె ప్రశ్నలకు కొంటె సమాధానాలు చెప్పి నవ్వించేవారు

భారతదేశం – ఇండియా, పాకిస్తాన్‌గా విభజన జరిగిన కొత్తలో మతోద్రిక్తతవల్ల అటూ ఇటూ కొందరు చనిపోయారు.

నెహ్రూజీ అలా మతోద్రిక్తతలున్న ప్రాంతాల్ని స్వయంగా దర్శిస్తున్నారు ఒక పత్రికా విలేఖరి అప్పుడు నెహ్రూజీని "భారత్, పాకిస్తాన్ రెండు దేశాలలో మతకల్లోలాల్లో ఎక్కువమంది చనిపోయారు ఎటు ఎక్కువమంది చనిపోయి వుంటారనుకుంటున్నారు?" అంటూ అడిగాడు

వెంటనే నెహ్రూజీ "మన భారతదేశంలో ఈ మతకల్లోలాలవల్ల అరడజనుమంది చనిపోతే, అటు పాకిస్తాన్‌లో ఆరుగురు చనిపోయి వుంటారు" అన్నారు

"జర్నలిస్ట్‌లకి, రాజకీయ నాయకులకు మధ్య ఏ విషయంలో ఎక్కువ సామ్యం వుందంటారు?" అన్నాడు ఒక జర్నలిస్ట్

అప్పుడు నెహ్రూజీ "ఇద్దరూ తమకు ఏమీ తెలియకపోయినా ఎక్కువగా తెలుసనుకుంటారు ఒకళ్ళు ఎక్కువ మాట్లాడితే ఒకళ్ళు ఎక్కువ రాస్తారు. తమాషా ఏమిటంటే – నిజానికి ఇద్దరికీ ఏ అర్హతలూ అవసరముండవు" అన్నారు

## గాంధీజీ చందా వసూలుచేసే తీరు

అది 1937వ సంవత్సరం. గాంధీజీ నాయకత్వంలో దేశవ్యాప్తంగా సహాయనిరాకరణోద్యమం ముమ్మరంగా సాగుతోంది

గాంధీజీ మాటకు కట్టుబడి దేశవ్యాప్తంగా కొన్ని లక్షలమంది తమ ప్రభుత్వ ఉద్యోగాలు తృణప్రాయంగా వదిలివేశారు.

ఇలాటి పరిస్థితుల్లో గాంధీజీ ఆశ్రమానికి ఒక పత్రికా విలేఖరి ఆయనను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాడు.

అతను వచ్చి కూర్చుంటూనే "గాంధీజీ! మీరొకపక్క సహాయ నిరాకరణ పేరుతో ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వమని భారతీయుల్ని కోరుతున్నారు. మరి ఇలాంటి పరిస్థితుల్లో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారం చేపడుతుందా?" అంటూ అడిగాడు

వెంటనే గాంధీగారు నవ్వుతూ "ఏమిటీ? మీరేమన్నా మంత్రి అవుదామనుకుంటున్నారా?" అంటూ ఎదురు ప్రశ్న వేసేప్పటికి ఆ పత్రికా విలేఖరి బిత్తరపోయాడట

తరువాత గాంధీజీ ఆ విలేఖరి నెత్తిన ధరించిన టోపీ చూస్తూ-

"మీ టోపీని భిక్షా పాత్రగా ఉపయోగించుకుంటాను! అభ్యంతరం లేకపోతే ఇవ్వండి" అన్నారు

ఆ విలేఖరి వెంటనే టోపీ తీసి, గాంధీగారి చేతిలో పెట్టగానే - "ఛారిటీ బిగిన్స్ ఎట్ హోమ్! (దానం మీతోనే ప్రారంభించండి)" అని- "మీరే బోణీ కొట్టాలి" అంటూ, ఆ విలేఖరి నుంచి చందా వసూలు చేశారట.

## గాంధీజీ అంటించిన 'చురక'

గడుసుగా చిలిపి ప్రశ్నలు వేసినవాళ్ళకు తగ్గట్టుగా, గడుసు సమాధానాలివ్వడంలో గాంధీజీ ఘనాపాఠి

"గాంధీజీ టోపీ"గా ప్రసిద్ధమైన టోపీలను స్వాతంత్ర సమరకాలంలో జాతీయాభిమానులు, గాంధీజీ శిష్యులు ఎక్కువగా ధరించేవారు

అయితే గాంధీ టోపీ గాంధీగారు ధరించేవారు కాదు

ఇదే విషయం ఒక మార్వాడీ సేర్ గాంధీగారినే అడిగాడు.

అయితే గాంధీ దానికి సమాధానం చెప్పకుండా "మార్వాడీ సేర్‌గా మీరు తలకు చుట్టుకున్న తలపాగ ఎన్ని గజాలుంటుంది?" అంటూ అడిగారు.

"అది పదిగజాలకు తక్కువ వుండదులెండి" అన్నాడు మార్వాడీ సేర్.

"చూశారా! పదిమంది మనుషులకు సరిపోయే వస్త్రాన్ని మీరొక్కరు చుట్టుకుంటున్నారు. అంటే, దీని అర్థం మిగతా తొమ్మిదిమందికి తలకు టోపీ కూడా పెట్టుకునే వీలు లేకుండా మొత్తం మీరే సరిచేశారన్నమాట మీవంటి వారివల్ల నష్టపడిన ఆ తొమ్మిదిమందిలో నేనొకణ్ణి అందుకే నాకు కనీసం మీరు చెబుతున్న 'గాంధీ టోపీ' దక్కలేదు" అన్నారు గాంధీజీ.

మెత్తగా మొట్టినట్టున్న ఆ సమాధానం విన్న సేర్‌జీ మళ్ళీ ఇంకో ప్రశ్న వేయకుండా నోరు మూసుకున్నాడు.

## సర్దార్ పటేల్ ఇచ్చిన వార్నింగ్

అప్పుడు గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా సాగుతోంది. ప్రముఖశ్రేణి నాయకులంతా గాంధీజీ ఆదేశాల మేరకు అరెస్ట్ అయ్యారు.

గుజరాత్‌కు చెందిన నాయకుడొకరు డిసెంబరు నెలలో అరెస్టయి జైలుకు వెళ్ళాడు. చలి అమితంగా వుంది అయితే పొద్దున్నే జైల్లో ఖైదీలకు చన్నీళ్ళ స్నానమే గతి.

అయితే, ఆ గుజరాత్ ఖైదీ మాత్రం పెద్ద జైలర్‌ని పిలిచి "ఏమయ్యా, ఈ చలిలో చన్నీళ్ళ స్నానం నాకు పడదు వెంటనే వేడినీళ్ళ ఏర్పాటు చేయించు" అన్నాడు.

"జైలు నిబంధనల ప్రకారం వేడినీళ్ళు మేమివ్వం. అంతగా కావాలనుకుంటే ఆ వేడినీళ్ల ఏర్పాటు నువ్వే చేసుకో" అన్నాడు జైలర్ నిర్లక్ష్యంగా.

"అయితే పెద్ద జైలర్‌గా నీకు చెప్పవలసింది చెబుతున్నాను. రేపటినుండి వేడి నీళ్ళు నాకు అందకపోతే నా వేడినీళ్ళు నేనే కాచుకుంటాను

అయితే అందుకు అవసరమైన వంటచెరకుగా, ఇదిగో ఈ బల్లను, కుర్చీలను వాడుకుంటాను. ఇక నన్ను మాత్రం తప్పుపట్టొద్దు. తరువాత నీ ఇష్టం, ఏం చేసుకుంటావో నాకనవసరం" అని ఖైదీ గంభీరంగా కుండబద్దలు కొట్టినట్టు చెప్పేశాడు.

ఆ జైలరు జీవితకాలంలో అలా ఒక ఖైదీ జైలరుకు హెచ్చరికగా హుకూం జారీ చేయగా వినలేదు రెండోరోజు వేడినీళ్ళు ఏర్పాటు చేయించాడు ఇంతకీ ఆ ఖైదీ ఎవరో కాదు – ఉక్కు మనిషిగా ప్రసిద్ధుడైన సర్దార్ వల్లభభాయి పటేల్

## తిట్టినవాడికి గాలిబ్ వేసే శిక్ష

ఉర్దూ ప్రముఖ కవులలో మీర్జా గాలిబ్ పేరు ముందు వరుసలో వుంటుంది

"కవి నిరంకుశుడు" అనే లోకోక్తి, అయనపట్ల అక్షరాలా నిజం చేసుకున్నాడు అయన ఎవరినీ లెక్క చేసేవాడు కాదు

గాలిబ్ కీర్తి ప్రతిష్టలను చూసి ఓర్వలేనివాళ్ళు గాలిబ్ ని బండబూతులు తిడుతూ ఉత్తరాలు రాశారు.

అంతటితో ఆగక కొందరు ఒక పుస్తకాన్నే గాలిబ్ ని విమర్శిస్తూ, ప్రచురించి, "ఖాతే ఉల్ ఖాతే" అని దానికి పేరుపెట్టి దాన్ని దేశం మీదికి వదిలారు.

కొన్ని విమర్శలకు గాలిబ్ శిష్యులు సమాధానాలు రాశారు గాలిబ్ మాత్రం ఆ పుస్తకం చూసి నవ్వుకున్నాడు అయనకు రోజు రోజుకు అలాటి విమర్శలున్న ఉత్తరాలు కోకొల్లలుగా వచ్చి పడుతుండేవి.

గాలిబ్ అవి చదివి నవ్వుకోడమేకాక, ఇతరులకు చదివి వినిపిస్తుండేవాడు

"మిమ్మల్ని ఇలా తిడుతూ రాస్తే మీరు మౌనంగా ఊరుకోవడమేమిటి?" అని ఒక శిష్యుడు ధైర్యంగా అడిగితే–

"ఒక గాడిద నిన్ను తన్నిందనుకో–మళ్ళీ నీవు దాన్ని తంతావా? ఇదీ అంతే నాయనా!" అన్నాడు గాలిబ్ నవ్వుతూ

## థామస్ ఎడిసన్ చేసిన మొదటి ప్రయోగం

ప్రపంచ శాస్త్ర చరిత్రలో 1300 పేటెంట్ హక్కులు పొందిన ఏకైక శాస్త్రవేత్త థామస్ ఆల్వా ఎడిసన్

వైర్ లెస్ టెలిగ్రఫీ, ఎలక్ట్రిసిటీ, టెలిఫోన్, ప్రింటింగ్, సినిమావంటి అనేక సంచలనాత్మకమైన శాస్త్రరంగాలను కనుగొనడమో లేక వున్నవాటిని అభివృద్ధి చేయడమో చేసిన ప్రముఖ శాస్త్రవేత్త ఎడిసన్.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్టు అతని బాల్య సంఘటనలే అతని భవిష్యత్ ను సూచించాయి.

పెద్దమంటలెలా వుంటాయో చూడాలనే తలంపుతో ఒకసారి ఎడిసన్ పూరిపాకకు నిప్పు పెట్టాడు అది చూసిన వాళ్ళ నాన్న దాన్ని ఎలాగో ఆర్పాడు

ఒకరోజు ఎడిసన్ కనబడలేదని భయపడ్డ తల్లి "నాయనా ఎడిసన్! ఎక్కడున్నావు?"అంటూ ఇల్లంతా వెతుకుతోంది

పెద్దమంచంక్రింద పొట్టమీద పడుకుని వున్న ఎడిసన్ కదలకుండా కనిపించాడు తీరా చూస్తే అతను కోడిగ్రుడ్లు పొట్టకింద పెట్టుకుని పొదుగుతున్నట్టు పడుకుని వున్నాడు

ఈ సంగతి తల్లి ఎడిసన్ తండ్రికి చెప్పగా అయన కొడుకుని బుజ్జగిస్తూ "ఎందుకలా చేశావు?" అంటూ అడిగాడు

అప్పుడు ఎడిసన్ "కోడి గ్రుడ్లపైన పడుకొని పొదుగుతోందికదా! మరి మనం కూడా ఆ విధంగా పడుకొని గ్రుడ్లను పొదగలేమా? అందుకే ఆ ప్రయోగం చేస్తున్నా"నని అన్నాడు. తరువాత ఎన్నెన్ని కొత్త పరికరాలు ఎడిసన్ తన మేధస్సుతో మానవాళికి అందించాడో చరిత్రే సాక్ష్యం

## ప్రముఖ ఫ్రెంచిరచయిత వాల్టేర్ వింతప్రవర్తన

ప్రముఖ ఫ్రెంచి రచయిత వాల్టేర్ బహుముఖ ప్రజ్ఞాశాలి అయన రాసిన జీవిత చరిత్రలు, చరిత్ర గ్రంథాలు, నాటకాలు, నవలలు, కథలు జనం వెర్రిగా చదివేవాళ్ళు. ఆయనను చూడడానికి, ఆయన విప్లవ భావాలు వినడానికి ఎందరో ఆయన ఇంటిని దర్శిస్తూ వుండేవారు

ఒకసారి ఒక ఇంగ్లీషువాడు తాను వాల్టేర్‌ని దర్శించుకున్నానని చెప్పకోడానికి ఆయన దర్శనం కోరాడు.

ఆ వ్యక్తి ఎందుకు వచ్చాడో ఊహించిన వాల్టేర్ "నేను మరణావస్థలో వున్నాను కాబట్టి కలుసుకోలేనని చెప్పు" అంటూ నౌకరుకి చెప్పి పంపాడు

అయినా ఆ ఆంగ్లేయుడు "వాల్టేర్ దర్శనం చేసుకోనిదే నేను ఇక్కడినుంచి కదలను" అంటూ అదే నౌకరుతో వర్తమానం పంపాడు

ఈ మొండిఘటాన్ని వదిలించుకోవడానికి మరో మార్గంలేక వాల్టేర్ "నేను కీర్తిశేషుడినయ్యానని అతనికి చెప్పు" అంటూ మళ్ళీ నౌకరును పంపాడు

"అయితే ఆ మహానుభావుడి అంత్య దర్శన భాగ్యం నాకు కలిగిందని సంతోషిస్తాను అనుమతించండి" అంటూ ఆ వ్యక్తి మళ్ళీ కబురు చేశాడు.

"ఆయన అంత్యక్రియలూ పూర్తయ్యాయి ఇంకా ఆయన దర్శనం చేసుకోవాలనుకుంటే యమసదనానికి వెళ్ళమను" అంటూ వాల్టేర్ తనే తన ఇంటినుంచి వెళ్ళిపోయాడు

## ప్రముఖ ఫ్రెంచి రచయిత వాల్టేర్

ప్రపంచ చరిత్రలో ప్రసిద్ధమైన ఫ్రెంచి విప్లవానికి మొదటి సూత్రధారుడు వాల్టేర్. మొదటినుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, మానవత్వానికి వాల్టేర్ ప్రతీక ఇతను ఫ్రెంచి దేశ రచయిత

ఒకసారి రాజప్రతినిధి ప్రభుత్వ వ్యయం తగ్గించడానికి గుర్రపుశాలలోని గుర్రాలను సగం అమ్మివేశాడు

ఈ సంగతి తెలిసిన వాల్టేర్ "ఈ రాజప్రతినిధి ఎంతో బుద్ధిమంతుడనుకున్నాను అత నమ్మిన అశ్వాలతోపాటు ఆస్థానంలో వున్న గాడిదలను(కవులను) కూడా అమ్మిపారేస్తే పీడా వదలిపోయేది" అన్నాడు

అంతటితో ఆగక, ఆ రాజప్రతినిధి చర్యనే ఇతివృత్తంగా తీసుకుని ఒక నాటకం రాశాడు దీనితో వళ్ళుమండిన ఆ రాజప్రతినిధి వాల్టేర్‌ను జైలుకు పంపాడు

కథ, నవల, నాటకం, జీవితచరిత్ర, లేఖారచన - ఇలా అన్ని సాహిత్య ప్రక్రియల్లో అగ్రగణ్యుడైన వాల్టేర్‌ను ప్రష్యారాజు ఫ్రెడరిక్ తన ఆస్థానానికి ఆహ్వానించాడు. అక్కడ వాల్టేర్ తన వాక్చమత్కృతితో, రచనలతో అతనికి ఎంతో ఆనందం కలిగించాడు.

ఒకరోజు ప్రష్యారాజు ఫ్రెడరిక్ "ఈ వాల్టేరు మనకు ఇంకొక సంవత్సరంకంటే ఎక్కువ కాలం అవసరం కాకపోవచ్చు. రసం పిండుకునేదాకేగా ఫలం అవసరం. ఇంకా పై డొక్కుతో ఏంపని" అంటుండడం వాల్టేర్ చెవిన పడింది.

ప్రష్యారాజు మనస్తత్వం అర్థమైన వాల్టేర్, "రసం పిండుకోకమునుపే డొక్కు రక్షించుకోవడం క్షేమం" అంటూ రహస్యంగా రాజభటుల కన్నుగప్పి ఆ దేశం నుంచి పారిపోయాడు.

## స్వామి రామతీర్థనే విస్మయపరచిన వృద్ధుడు

స్వామి రామతీర్థ ప్రముఖ ఆధ్యాత్మికవేత్తగా అంతర్జాతీయ గౌరవ మన్ననలు పొందినవారు. ఒకసారి ఆయన ఓడలో జపాన్ వెళుతున్నారు. ఆ ఓడలో 90 ఏళ్ళ వయసు దాటిన వృద్ధుడు దళసరి కళ్ళద్దాలు ధరించి చైనాభాష నేర్పే పుస్తకంలోని ఒక పాఠం చూసి రాస్తున్నాడు. ఆ వయసులో అంత కష్టమైన భాష అంత శ్రమకోర్చి నేర్చుకోవడమెందుకో రామతీర్థకు అర్థంకాలేదు.

అదే విషయం అడుగుతూ "ఏ ప్రేరణ మిమ్మల్ని కష్టమైన ఈ చైనాభాష నేర్చుకోడానికి దోహదం చేస్తున్నది? చూస్తే మీ ఆరోగ్యం బాగున్నట్టు లేదు?" అంటూ రామతీర్థ అన్నారు.

"బ్రతికి వున్నంతకాలం ఏదో కొత్త విషయం నేర్చుకోవాలన్నది నా కోరిక. కొత్త కొత్త విషయాలు నేర్చుకోవడమనే అంశం జీవితలక్ష్యంగా లేకపోతే ఇక జీవితానికి అర్థమేమిటి?" అన్నాడు వృద్ధుడు

రామతీర్థను ఆ వృద్ధుడి మాటలు ఎంతో ప్రభావితం చేశాయి.

"అసలు జీవితమే ఒక అనంత అగాధ ప్రవాహం. నిరంతరం ప్రవహించే జీవన ధారమధ్య కొత్త జ్ఞానం, కొత్త భావాలు, కొత్త సూత్రాలు

నేర్చుకోడానికి ఒక్క క్షణం వ్యవధి లభించినా, దానిని వదలకూడదు" అన్నాడా జపాన్ వృద్ధుడు తిరిగి

సర్వవేద వాఙ్మయసారం ఆ వృద్ధుడి మాటల్లో వినిపించింది రామతీర్థకు.

## గురువును మించిన శిష్యుడు వినోబాజీ

1916లోనే చిన్నవాడుగానే వినోబా తన తమ్ముడు బాలకోబాతో సబర్మతీ ఆశ్రమంలో చేరాడు గాంధీజీ కర్మయోగం అయనకు బాగా నచ్చింది. ఆ ఆశ్రమంలో గాంధీజీ వుండేవారు.

ఒకరోజు గాంధీజీ ఏదో పర్యటన నిమిత్తం ఎటో వెళ్ళి వున్నారు. ఆశ్రమంలో పాకీదొడ్లు శుభ్రం చేయడానికి పాకీవాళ్ళు వచ్చేవాళ్ళు.

ఆరోజు మలంతో నిండిన బక్కెట్లు మోయడానికి ఒక చిన్న పిల్లవాడొచ్చాడు. వాడు ఆ బక్కెట్లు ఎత్తలేక ఏడ్వడం ప్రారంభించాడు అవి దొర్లిపడితే అశుద్ధముతో ఆ ప్రాంతం చెడగొట్టినందుకు అంతా తంతారు అతను నిశ్చేష్టుడై నిలబడి ఏడుస్తున్నాడు.

ఈ దృశ్యం వినోబా తమ్ముడు బాలకోబా కంటపడింది అతను ఆ బక్కెట్లన్నీ బయటికి మోసి, పాకీదొడ్లన్నీ శుభ్రం చేశాడు మరునాడు ఈ విషయం తెలిసిన వినోబా రంగంలోకి దిగి తమ్ముడికంటే ఎక్కువగా విజృంభించాడు

"బ్రాహ్మణులై పుట్టి వీళ్ళు పాకీపని చేయడమా? ఇది కూడని పని" అంటూ వెళ్ళి ఈ విషయం గాంధీగారికి చెప్పారు ఆశ్రమవాసులు

"అన్ని పనుల్లోకి పాకీపనియే శ్రేష్ఠమైంది ఇకనుండి ఆశ్రమవాసులంతా వంతుల వారీగా పాకీదొడ్లు స్వయంగా శుభ్రం చేసుకోవాలి. అందులో నేనూ వుంటాను. ఈ కొత్త ఆశ్రమ నిబంధన ఇష్టంలేనివాళ్ళు వెంటనే ఆశ్రమం నుంచి వెళ్ళిపోవచ్చు" అన్నారు గాంధీజీ

అలాటి పాకీపని ఇష్టంలేని ఉన్నత కులస్థులు ఆశ్రమం వదలి వెళ్ళారు అందులో గాంధీజీ సోదరి కూడా వుంది

## "లోకమాన్య"తిలక్ మహాశయుడి దేశభక్తి ఔన్నత్యం

1908లో స్వాతంత్ర్య సమర విప్లవకారులను సమర్థిస్తూ తన పత్రికలో వ్యాసాలు రాసినందుకు లోకమాన్య తిలక్‌కు బ్రిటీషు ప్రభుత్వం ఆరేళ్ళ కఠిన కారాగార శిక్ష విధించింది ఆ శిక్ష పూర్తిచేయడానికి ఆయనను బర్మాలోని మాండలే జైలుకు పంపారు.

జైలులో వుండగా తిలక్ భార్య మరణించింది ఆ విషయం తంతిద్వారా మాండలే జైలులోని తిలక్‌కు అందించబడింది.

జైలు అధికారి టెలిగ్రాం తిలక్‌కు అందించగా, ఆయన అది చదివి మరల దానిని జైలులోని బల్లమీద వుంచాడు

తిలక్‌లో ఎక్కడా శోకముగాని, దుఃఖముగాని కనిపించకపోవడంతో ఆశ్చర్యపోయిన జైలు అధికారి "మీ అర్థాంగి చనిపోయిన వార్త తెలిసినా మీ కంటినుంచి, కనీసం ఒక్క కన్నీటిబిందువైనా రాలలేదేం?" అని అడిగాడు.

అప్పుడు తిలక్ "ఈ దుఃఖ సమయములో నా కళ్ళనుండి ఒక్క కన్నీరు బొట్టూ కారలేదు దీనికి ముఖ్య కారణం నా కళ్ళలో వుండే కన్నీటి బిందువులనన్నింటినీ, నా మాతృభూమి కోసం ఇదివరకే కార్చాను. ఇంకా కన్నీరెక్కడుంటుంది?" అన్నాడు

ఆయన ఆరాధించి చదివే భగవద్గీతలో సారం ఆచరణలో పెట్టిన మహనీయుడి దేశభక్తి అంత గొప్పది

## దేశం అంతా నాదే అయినప్పుడు ఇంకా నాలుగెకరాలెందుకు?

బ్రిటీషు సామ్రాజ్యవాదులతో పోరాడిన విప్లవకారులలో, శ్రీ వినాయక దామోదర్ సావర్కార్ గొప్ప నాయకుడు.

ఆయనను అండమాన్ జైలుకు యావజ్జీవ శిక్ష విధించి పంపుతున్నారు అప్పుడాయన వయసు 27 ఏళ్ళు. ఆయన భార్య వయసు 19. దేశభక్తి ప్రేరితుడైన సావర్కార్ "నీకు యాభై ఏళ్ళ కఠిన ఖైదుశిక్ష విధించబడింది" అని ఆంగ్లజడ్జి తీర్పు చెప్పగానే–

"మీ ఆంగ్ల పాలన నా దేశంలో యాభై ఏళ్ళు వుండబోయిందా?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

ఆయన ఊహించినట్టే బ్రిటీషు సామ్రాజ్యం భారతదేశంలో అంతరించి స్వాతంత్ర్యము వచ్చింది.

కానీ గాంధీజీ హత్య కేసులో అనుమానంతో వీరసావర్కార్‌ను కాంగ్రెస్ ప్రభుత్వం ఇరికించింది.

నిజంగానే గాంధీజీ హత్యలో సావర్కార్ ప్రమేయముందన్న అనుమానంతో, ఆయన ఇంటిని ప్రజలు ముట్టడించి, ఆయనను హింసించారు.

సావర్కార్ తను గాంధీజీని హత్య చేసేంత దుర్మార్గుడిని కానని కన్నీళ్ళు పెట్టుకున్నారు.

అప్పటి బ్రిటీషు ప్రభుత్వం, అప్పటి దేశభక్తుల ఇళ్ళను, పొలాలను జప్తుచేసేది. స్వరాజ్యం వచ్చి కాంగ్రెస్ ప్రభుత్వపాలన వచ్చినా, సావర్కార్‌కు చెందిన నాలుగెకరాల భూమిని ఆయనకు తిరిగి ఇవ్వలేదు.

ఈ విషయం సావర్కార్‌కు తెలియజేస్తే "భారతదేశమే నాది అయినపుడు అందులో నాలుగెకరాలు నాది కాకపోయినా నష్టమేమిటి" అన్నారట ఆయన.

## సోక్రటీసు చెప్పిన సలహా

సోక్రటీసు భార్య స్కాలలిపి పెట్టినన్ని బాధలు ఏ గయ్యాళి భార్యా భర్తను పెట్టి వుండదు సోక్రటీసు ఏ పనిపాటా చేయకుండా యువతరానికి విద్యగరపడంలో గడిపేవాడు.

భర్త ఔన్నత్యం తెలియని గయ్యాళి ఒకరోజు భర్తను అరచి అరచి చివరికి కోపంపోక ఒక కుండెడు నీళ్ళు తెచ్చి అతని తలమీద కుమ్మరించింది.

సోక్రటీసుకు కోపము రాకపోగా "ఇంతవరకు ఉరిమిన మేఘం ఇప్పుడు వర్షించి చల్లబడింది" అన్నాడు నవ్వుతూ.

ఆయన శాంత స్వభావానికి ఆయన శిష్యులు ఆశ్చర్యపడ్డారు.

ఒక శిష్యుడు అప్పుడు "గురుదేవా, మీ పరిస్థితి చూస్తుంటే, అసలు నన్ను వివాహం చేసుకోమంటారా? వద్దంటారా?" అన్నాడు.

అప్పుడు సోక్రటీసు "పెళ్ళి తప్పకుండా చేసుకోవాలి. మంచి భార్య

లభిస్తే అదృష్టవంతుడివి. జీవితం సుఖమయమైపోతుంది అదృష్టం వక్రించి గయ్యాళి భార్య లభిస్తే- ఇక ఎలాగూ వేదాంతిగా మారే అవకాశముంది" అన్నాడు.

"అలాటప్పుడు-అసలు వివాహం చేసుకోకుండా బ్రహ్మచారిగా వుండి పోతే?"

"గృహస్తుడిగా మారినా-బ్రహ్మచారిగా వుండిపోయినా ఏదో ఒక దశలో పశ్చాత్తాపం పడక తప్పదు. అలాంటప్పుడు వివాహమే మంచిది" అన్నాడు సోక్రటీస్.

## ఐన్‌స్టీన్‌ని అంచనా వేయగలవాడు

ఒకసారి ఐన్‌స్టీన్- ప్రాణమిత్రుడి పెళ్ళికి వెళ్ళాడు దంపతులు ఆనందంగా వున్నందుకు సంతోషించాడు.

కొన్నాళ్ళ తరువాత వాళ్ళు పద్దెనిమిది నెలల వయసున్న పిల్లవాడితో మళ్ళీ ఐన్‌స్టీన్‌ని కలిశారు

తల పిచ్చుకగూడులా, కళ్ళు లోతుగా, ముఖం అంతా ముడుతలతో వున్న ఐన్‌స్టీన్‌ని చూడగానే ఆ పసివాడు 'బూచి'ని చూసినట్టు భయపడి కెవ్వుమని కేకవేసి. గుక్కపట్టి ఏడపసాగాడు

ఐన్‌స్టీన్‌ని చూసి పసిపిల్లవాడు అలా భయపడి ఏడవడం తల్లిదండ్రులకు అవమానం అనిపించింది

అయితే ఐన్‌స్టీన్ ముఖం ఆ పిల్లవాడి ప్రవర్తనకు విప్పారింది కళ్ళు కాంతివంతమై అతను ఆ పిల్లవాడి తల నిమురుతూ-

"ఇంతవరకు నా జీవితంలో నన్ను గురించి నువ్వు అనుకుంటున్నదేమిటో నిర్భయంగా చెప్పింది నువ్వు ఒక్కడివే బాబూ!" అన్నాడు

"చిన్నపిల్లవాడు - వాడికేం తెలుసు మీ ఔన్నత్యం" అని ఆ పిల్లవాడి తండ్రి అంటుంటే -

"అందుకే మనిషిని మనిషిగా అంచనా వేయడం తెలిసినవాడు పసివాడే! అందుకే తన అంచనా ఏమిటో నన్ను గురించి అంత నిర్భయంగా చెప్పాడు" అన్నాడు ఐన్‌స్టీన్

## స్కాట్ నవలలంటే ఎందుకంత ఇష్టం?

పంధొమ్మిదో శతాబ్దానికి చెందిన ప్రముఖ కవిగా, చరిత్రకథాంశాలు నవలలుగా రాసిన రచయితగా సర్ వాల్టర్ స్కాట్ ప్రసిద్ధుడు

ఆయన కాలంలో స్కాట్ మంచి ప్రాచుర్యము, ప్రఖ్యాతి వున్న రచయిత.

ఆయనకు 'టామ్' అనే పేరున్న నమ్మకమైన నౌకరు వుండేవాడు

అతనొక రోజు "మీ నవలలు చాలా మంచి నవలలు సార్! అవి చదవకుండా వుండలేను" అన్నాడు

సామాన్యమైన చదువు సంధ్యలున్న వ్యక్తులూ తన నవలలు చదువుతుండడం తెలిసి స్కాట్ ఎంతో ఆనందించాడు టామ్ తన నవలలన్నీ అలాగే చదివి తన అభిప్రాయం చెబుతాడని స్కాట్ ఎంతో సంతోషించాడు

ఇలా కొంతకాలం అయ్యాక స్కాట్ ఓ రోజు టామ్‌ని దగ్గరగా పిలిచి "నా నవలలంటే నీకెందుకంత ఇష్టం?" అన్నాడు, అతని మనసులో మాట తెలుసుకుందామని

"నిజం చెబితే బాధపడరుగా?" అన్నాడు నౌకరు

"అబ్బే – లేదు చెప్పు" అన్నాడు స్కాట్

"రాత్రిళ్ళు నిద్ర పట్టకుండా వుంటే నిద్ర పట్టడానికి మీ నవలలు తెరుస్తుంటాను. నాలుగు వాక్యాలు చదివేప్పటికి నిద్ర ముంచుకొస్తుంది నిద్ర పట్టడానికి మీ నవలలు పరోక్షంగా నాకు సహకరిస్తున్నాయి" అన్నాడు నౌకరు టామ్

## 'డ్యూమాస్'ని దెబ్బతీసిన మిత్రుడు

ప్రపంచ ప్రసిద్ధ నవల, నాటక రచయితల్లో అలెగ్జాండర్ డ్యూమాస్ పేరు ముందు వరుసలో వుంటుంది

'కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో', 'ది త్రీ మస్కెటీర్స్' ఆయన రాసిన మంచి నవలలు

ఒకసారి డ్యూమాస్‌కి, అతని మిత్రుడు సోమెట్ అనే మరో రచయితకు "ఎవరి నాటకాలు బాగా ప్రదర్శితమవుతున్నాయి?" అనే విషయం మీద పోటీ వచ్చింది.

ఈ విషయం తేల్చుకోవడానికి డ్యూమాస్ నాటకం ప్రదర్శితమవుతున్న నాటకశాలకు ఇద్దరూ వెళ్ళారు. జనం బాగా నిండి వున్నారు నాటశాలలో.

అనుకోకుండా ఒక వ్యక్తి నిద్రపోతున్నాడు "చూశావా? నీ నాటకం నచ్చకే అతను అలా నిద్రపోతున్నాడు" అన్నాడు సోమెట్.

మరునాడు సోమెట్ నాటకం ప్రదర్శించారు అదే నాటకశాలలో. మిత్రులిద్దరూ వచ్చారు అక్కడ జనం పెద్దగా లేరు. అయితే ఒక వ్యక్తి కుర్చీలో నిద్రపోతున్నాడు

"చూశావా? జనం నీ నాటకాన్ని చూడడానికి పెద్దగా రాలేదు పైగా ఒకతను నిద్రపోతున్నాడు" అన్నాడు డ్యూమాస్.

అప్పుడు సోమెట్ తగ్గకుండా "అ వ్యక్తి నిన్న నీ నాటకం చూస్తూ మూర్ఛపోయినవాడే! నిన్నటినుంచి అతను ఇంకా నిద్రపోతున్నాడంటే నీ పనికిమాలిన నాటకం అతన్ని అంత షాక్‌కు గురిచేసిందన్నమాట" అన్నాడు

## 'యూదు' కావడంవల్ల కలిగిన లాభాలు

ప్రముఖ అమెరికా యూదు రచయిత ఇసాక్ సింగర్ పిల్లల కోసం, పెద్దల కోసం అనేక వందల రచనలు చేశాడు

మొదట సింగర్ పోలండ్‌లో వుండే అక్కడే నుంచి అమెరికా వలస వెళ్ళాడు

సింగర్‌కు ఇంగ్లీషు రాదు. అతను ఇంగ్లీషు నేర్చుకుని, ఆంగ్లంలో రచయితగా నిలదొక్కుకోడానికి చేపట్టని సాహిత్య ప్రక్రియ లేదు.

యూదు మతస్థులు (ఇప్పటి ఇజ్రాయెల్ దేశస్థులు) ప్రపంచంలోని అన్ని తెగల ప్రజలకంటే ఎక్కువగా గొప్ప మేధావులు నోబెల్ బహుమతుల్లో నూటికి తొంభై అయిదు పాళ్ళు వీరివే.

ఒకసారి ఒక పత్రికా విలేఖరి ఈయనను ఇంటర్వ్యూ చేస్తూ "పుట్టుకతో యూదువై వుండడంవల్ల రచయితగా మీకేమైనా నష్టం కలిగిందా?" అన్నాడు

"నష్టం కలగలేదు. పైగా పెద్ద లాభం కలిగింది" అన్నాడు సింగర్ నవ్వుతూ.

"ఎలా?"

"యూదులు ఎదుర్కొంటున్న సమస్యలు మరెవరు ఎదుర్కొన్నారు? ఈ సమస్యలు చాలవా కథలు, నవలలు రాయడానికి? పైగా, నేను స్వయంగా యూదును కావడంవల్ల నా సమస్యలు నాకంటే బాగా ఎవరికి తెలుస్తాయి?" అన్నాడు కుండబద్దలు కొడుతూ

## నాటక రచయితగా 'ఛార్లెస్ లాంబ్' పాట్లు

షేక్స్పియర్ నాటక కథలు మంచి గద్యంలో రాసిన రచయితగా ఛార్లెస్ లాంబ్ ఆంగ్ల సాహిత్య చరిత్రలో నిలిచిపోతాడు.

అయితే, అతనూ అప్పటి తోటి రచయితల్లా నాటకాలు కొన్ని రాసి వాటిని స్వంత ఖర్చుతో ప్రదర్శింపజేసి ఆనందించాలని, తనూ మంచి నాటక రచయితగా గుర్తింపు పొందాలని కలలు కనేవాడు.

ఒకసారి ఎంతో కష్టపడి ఓ నాటకం రాసి, నటుల్ని ఎన్నుకుని, నాటకాన్ని డైరెక్ట్ చేసి, నాటకశాల అద్దెకు తీసుకుని, నాటకాన్ని ప్రదర్శించే ఏర్పాట్లు చేసుకున్నాడు.

నాటకాన్ని చూడడానికి తన మిత్రులందరినీ పిలుచుకున్నాడు

వారు తన నాటక ప్రదర్శన తనతోపాటు ప్రేక్షకులుగా చూసి, తమ అభిప్రాయాలు చెబుతారని ఎదురుచూశాడు.

అయితే ఎవరూ ఊహించని విధంగా నాటక ప్రదర్శన మొదట్లోనే కుంటి నడక నడచి, ప్రేక్షకులను విసిగించి, వాళ్ళ సహనాన్ని పరీక్షకు పెట్టింది.

ఈ పరిస్థితిలో కొందరు ప్రేక్షకులు "బూ–బూ–" అంటూ అరచి తమ నిరసనను ఘోరంగా తెలియజేయసాగారు

కాస్సేపటికి తనూ "బూ–బూ–" అంటూ ఛార్లెస్ లాంబ్ అరవడం సాగించాడు.

ఒక మిత్రుడు "ఇదేమిటి! ఈ నాటకం నీదేగా?" అంటూ ఆశ్చర్యంగా అడిగితే–

"అది ఎవరికీ తెలియకూడదనే ఈ ప్రయత్నం" అన్నాడు ఛార్లెస్ లాంబ్.

## గొప్ప ప్రసంగం వినే ఛాన్స్‌లేని లాంబ్

అత్యంత ప్రతిభావంతుడైన కవిగా–వర్డ్స్‌వర్త్ తర్వాత అంతటి స్థాయి కవిగా కాల్‌రిడ్జ్ మహాకవికి పేరుంది

అయితే కాల్‌రిడ్జ్ కవికి నల్లమందు తినే అలవాటుంది ఈ నల్లమందు మత్తులో పడి నిద్రపోతూ, ఆ నిద్రలో వచ్చిన కలలనే కవితలల్లి మహాకావ్యరచన చేసేవాడు

ఇదేకాక ఎదుటి మనిషితో గంటలు గంటలు సంభాషించే అల వాటుండేది అలా మాట్లాడుతున్నప్పుడు కళ్ళు మూసుకుని పూనకం వచ్చినట్లు మాట్లాడడం కాల్‌రిడ్జ్‌కు అలవాటు

ఒకరోజు ఛార్లెస్ లాంబ్ రోడ్డుమీద కనబడగానే ప్రాణం లేచి వచ్చినట్లయి, అతనిని ఒక తోట ప్రక్కకు తీసికెళ్ళి, అతని కోటు గుండీ చేతితో పట్టుకుని తిప్పుతూ అనువుగా గొప్ప ప్రసంగం చేయడం ప్రారంభించాడు కాల్‌రిడ్జ్.

అలా మాట్లాడుతున్నప్పుడు చుట్టుపక్కల పరిసరాలు, కాలం ఆయనకు తెలిసేది కాదు.

అయితే కాల్‌రిడ్జ్ ప్రసంగం వింటున్న ఛార్లెస్ లాంబ్‌కి చర్చి గంట వినబడి అప్పుడు సమయం ఎంతైందో తెలిసింది

ఇక లాభంలేదని కోటు గుండీని బటన్ నైఫ్‌తో కోటు నుంచి తొలగించి అతని చేతిలో గుండీనిపెట్టి, ఇంటికి వెళ్ళి సాయంత్రం అటు వస్తున్నాడు.

అయిదు గంటల వ్యవధి గడచిపోయినా కాల్‌రిడ్జ్ మాత్రం ఇంకా కళ్ళు మూసుకునే అనర్గళ ప్రసంగం చేస్తున్నాడు

ఛార్లెస్ లాంబ్‌కు ఆశ్చర్యంవేసి, "ఇంత గొప్ప వ్యక్తి చేసిన అంత సుదీర్ఘ ప్రసంగం విన్నా ఎంతో బాగుండేది" అని, తన తప్పుకు బాధపడ్డాడు

## ఇంటిపేరు మార్చుకున్న 'నోబెల్'

'డైనమైట్' కనిపెట్టింది ఆల్‌ఫ్రెడ్ నోబెల్ కొండలు, పర్వతాలు తేలిగ్గా బద్దలు కొట్టడానికి డైనమైట్ ఉద్దేశింపబడింది

అయితే, యుద్ధంలో శత్రువుల్ని చంపడానికి డైనమైట్ ఉపయోగించడం వల్ల లక్షల, కోట్ల డాలర్లు ఆల్‌ఫ్రెడ్ నోబెల్‌కు ఆదాయం వచ్చింది తన పరిశోధనా ఫలితమైన 'డైనమైట్' దుర్వినియోగం చేయడంవల్ల ఆల్‌ఫ్రెడ్ బాధపడి ఆ డబ్బంతా మానవాళికి మేలుచేసే కార్యక్రమాలకు, అందుకు కృషి చేస్తున్నవారికి ఇవ్వడానికి 'నోబెల్' బహుమతులు ఏర్పాటు చేశాడు

అయితే, ఇతను జీవితమంతా శాస్త్రీయ పరిశోధనలకే వెచ్చించి, చివరికి బ్రహ్మచారిగా మిగిలాడు

ఇటలీలో ప్రశాంతంగా వుండే గృహాన్ని 1891లో కొని, దానికి 'నా గూడు' (మై నెస్ట్) అని పేరు పెట్టుకున్నాడు.

ఈ ఇంటికొచ్చిన ఒక మిత్రుడు 'గూడు' అనేది పక్షులు జంటగా కట్టుకునేది సంతతి కోసం అవి జతకూడి గూడు కడతాయి మరి నువ్వు బ్రహ్మచారివిగా! ఇంటిపేరు మార్చేయాలి" అన్నాడు

ఆల్‌ఫ్రెడ్‌కు కోపం వచ్చి "నా గూటిలో నాకొక్కడికే స్థానం ఇకనుంచి నా ఇంటి పేరు 'నోబెల్ విల్లా'– 'నోబెల్ గృహం" అన్నాడు

## యుద్ధఖైదీ కావడంవల్ల లాభం-చర్చిల్

రెండో ప్రపంచ యుద్ధం ముమ్మరంగా జరుగుతుండగా చర్చిల్ దక్షిణాఫ్రికాకి అక్కడి యుద్ధవార్తలు సేకరించడానికి పంపబడ్డాడు

బ్రిటీషు సైన్యంలోని ఒక విభాగంతో కలసి వుంటూ, చర్చిల్ యుద్ధవార్తలు సేకరిస్తూ, అవి ఇంగ్లండ్‌కు పంపుతున్నాడు

అనుకోకుండా బోయర్ సైనికులు అత్యధిక సంఖ్యలో ముట్టడించి నపుడు, చర్చిల్ వున్న ఆంగ్ల సైనిక విభాగం, వీరోచితంగా ఎదురుతిరిగి పోరాడింది

అయినా బోయర్ సైనికులు, ఆంగ్ల సైనికుల్ని చర్చిల్‌తో సహా పట్టుకుని యుద్ధ ఖైదీలుగా తమ దేశానికి తరలించి, అక్కడ ఖైదులో బంధించారు

యుద్ధఖైదీగా వున్న చర్చిల్ తను సైనికుణ్ణి కానని, కేవలం పత్రికా విలేఖరినని, మామూలు యుద్ధ సైనికులు–యుద్ధ ఖైదీలుగా పట్టుబడితే వర్తించే నియమాలు తనకు వర్తించవని–తనను విడుదలచేయమని, బోయర్ సైన్యాధికారి ఫీల్డ్‌మార్షల్ జాన్ స్మట్స్ అనే ఆయనకు పిటీషన్ పెట్టుకున్నాడు

ఫీల్డ్ మార్షల్ చర్చిల్ విడుదలకు సంబంధించిన కాగితాలు పంపేలోపే, చర్చిల్ ఖైదునుంచి తప్పించుకుని ఇంగ్లండ్ చేరాడు. తరువాత చర్చిల్ ఇంగ్లండ్ ప్రధానిగా కలిసినప్పుడు ఫీల్డ్‌మార్షల్ ఇదే విషయం అడిగితే "నేను బోయర్ ఖైదునుంచి ఎలా తప్పుకున్నది ఓ పత్రికకి సీరియల్ రాసి ఆ రోజుల్లో తొమ్మిదివేల పౌండ్లు సంపాదించి ధనికుణ్ణయిపోయాను నీ దయాదాక్షిణ్యాలవల్ల విడుదలై వుంటే ఆ ధనమంతా వచ్చేది కాదుగా!" అన్నాడు నవ్వుతూ.

## డాక్టర్ జాన్సన్ వింత అనుభవాలు

డాక్టర్ జాన్సన్ ఆంగ్ల ప్రథమ నిఘంటు రచయిత. ఆయన మహా పండితుడు, బహుభాషావేత్త. ఆయన జీవితంలో అన్నీ వింతలే.

డాక్టర్ జాన్సన్ తిండిపోతు. అయితే ఆయన హాస్య ప్రసంగాలు వినాలని, అందరూ ఆయనను విందులకు ఆహ్వానించేవారు.

ఒకసారి డాక్టర్ జాన్సన్ ఓ విందుకు వచ్చి రుచిగా వున్న పదార్థాలన్నీ తింటూ అసలు తన ప్రసంగ విషయం మరచిపోయాడు

ఆయన శిష్యుడు ఈ విషయం గుర్తుచేయగానే "అసలు సంభాషణలు –ప్రసంగాలు దేనికి?" అన్నాడు ఎదురుప్రశ్న వేసి డాక్టర్ జాన్సన్

"అదేమిటి సార్?"

"జ్ఞానయ్యా! మన భావాలు ఇతరులకు చెప్పే పరిస్థితి వస్తే, హాస్య సంభాషణే అపహాస్య సంభాషణ ఔతుంది అలాటి పరిస్థితికంటే, నోరు మూసుకుని డిన్నర్ ఎంజాయ్ చేయడం మంచిది" అన్నాడు జాన్సన్.

ఒకసారి ఒక ప్రముఖ రచయిత తను రాసిన అముద్రిత గ్రంథాన్ని జాన్సన్‌కు ఇచ్చాడు

"ఇది మంచి గ్రంథమే కాదు–మంచి ఒరిజినాలిటీ వున్నగ్రంథమని నా ఉద్దేశ్యం. మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పాలి" అన్నాడు.

డాక్టర్ జాన్సన్ ఆ గ్రంథాన్ని చదివి తిరిగి ఆ రచయితకు ఇచ్చివేస్తూ, ఏమీ చెప్పకుండా ఊరుకున్నాడు

"మీ అభిప్రాయం చెప్పనే లేదు?" అన్నాడు రచయిత

"ఏముంది? బాగున్నభాగంలో ఒరిజినాలిటీ లోపించింది. ఒరిజినాలిటీ లోపించిన చోట బాగుంది" అన్నాడు డాక్టర్ జాన్సన్.

## మార్క్‌ట్వెయిన్ చమత్కార సమాధానాలు

మార్క్‌ట్వెయిన్ ప్రముఖ అమెరికా హాస్యరచయిత.

మార్క్‌ట్వెయిన్ రచయితగా ఎంత గొప్పవాడో అంతకుమించిన ఉపన్యాసకుడు, సంభాషణాచతురుడు.

ఒకసారి ఒక ఔత్సాహిక ప్రసంగకర్త, మార్క్‌ట్వెయిన్‌ని కలసి "నేను ప్రసంగించడం కొంతసేపు కొనసాగిందో లేదో సభికులు చప్పట్లు కొడుతున్నారు. అంటే, నా ప్రసంగం వాళ్ళు మెచ్చుకుంటున్నట్లేనా?" అంటూ అడిగాడు.

"చప్పట్లు మెల్లిగా కొడుతున్నారా – గట్టిగా కొడుతున్నారా?" అడిగాడు మార్క్‌ట్వెయిన్.

"మెల్లిగా కొడుతున్నారు" చెప్పాడు ఔత్సాహికుడు.

"అయితే మీ ప్రసంగం ఇక ఆపమని దానర్థం" అన్నాడు మార్క్‌ట్వెయిన్

"అలా ఆపమంటున్నారని మీరెలా చెబుతారు?" అడిగాడు ఔత్సాహికుడు సందేహంగా, కోపంతో.

"స్వానుభవంతో." చెప్పాడు మార్క్‌ట్వెయిన్

ఓ నటుడు మార్క్‌ట్వెయిన్‌ని కలుసుకున్నప్పుడు "నా నటనకు ప్రజలందరూ గొప్పగా బ్రహ్మరథం పడుతున్నారు. అయితే నాకో చిన్న అనుమానం" అన్నాడు

"ఏమిటది?" అడిగాడు మార్క్‌ట్వెయిన్.

"నేను ఈ నటనారంగం నుంచి విరమించుకున్న తరువాత కూడా ప్రజలు నన్నింతగా ఆరాధిస్తారంటారా?" అన్నాడు, నటుడు.

"ఇంతకంటే ఎక్కువగా ఆరాధిస్తారు, ఆదరిస్తారు" అన్నాడు మార్క్‌ట్వెయిన్.

మార్క్‌ట్వెయిన్ మాటల్లోని వ్యంగ్య చమత్కారం ఆ నటుడికి చాలాసేపటికిగాని అర్థం కాలేదు. అప్పటికి 'ట్వెయిన్' అక్కడ లేదు.

## స్టాలిన్ ఇచ్చిన రెండు మంచి సలహాలు

స్టాలిన్ తను చనిపోవడానికి ముందు రష్యాను పరిపాలించే, తన వారసుడుగా కృశ్చేవ్‌ని పిలిచి రెండు కవర్లు ఇచ్చాడు.

"ఏమిటివి?" అడిగాడు కృశ్చేవ్

"అత్యవసర పరిస్థితులు నీ పాలనాకాలంలో ఏర్పడ్డప్పుడు మాత్రమే ఈ కవర్లు తెరువు. ఈ కవర్లలో నేను రాసిన విషయాలే నువ్వు పాటించు, నీ పరిపాలనను అందరూ మెచ్చుకుంటారు. తరువాత నీకు వారసులుగా వచ్చేవారికీ నువ్వు మార్గదర్శకుడవవుతావు" అన్నాడు స్టాలిన్.

కృశ్చేవ్ స్టాలిన్ మాట ప్రకారమే పరిపాలన సాగించాడు ఆరేళ్ళ తరువాత అతనికి సమస్యలు వచ్చినప్పుడు మొదటి కవరు తెరిచాడు.

అందులో "నీ వైఫల్యాలకు స్టాలిన్, ఆయన అనుసరించిన పద్ధతులే కారణమని తప్పులన్నీ అతని మీదకు నెట్టి పరిపాలన సాగినన్నాళ్ళు సాగించు" అని వుంది.

ఆ సలహా పాటించి కృశ్చేవ్ కొన్నాళ్ళు పాలన సాగించాడు

కొన్నాళ్ళ తరువాత మళ్ళీ పెద్ద సమస్య వచ్చి ఈ సారి రెండవ కవరు తెరిచాడు.

అందులో "ఇప్పుడు నువ్వు స్టాలిన్‌లా రెండు కవర్లు తయారుచేసి, నీ వారసుడికి ఇచ్చివేసి దిగిపో" అని వుంది.

తప్పని పరిస్థితుల్లో కృశ్చేవ్ రెండో కవరులో ఇచ్చిన సలహాను పాటించాడు.

## డాక్టర్ జాన్సన్ చెప్పిన వేదాంతం

డాక్టర్ జాన్సన్‌కు గొప్ప పేరు రావడానికి అసలు కారణం ఆయనకు 'బాస్‌వెల్' వంటి మంచి శిష్యుడు దొరకడమే

శిష్యుల ప్రతిభవల్ల గురువులకు పేరొచ్చిన ఉదాహరణలు – వివేకానందుడు– రామకృష్ణపరమహంస; నెహ్రూ–గాంధీ మంచి ఉదాహరణలు.

సాహిత్యరంగంలో పెద్ద, భీష్మాచారివంటి డాక్టర్ జాన్సన్ జీవితచరిత్ర రాయడానికి బాస్‌వెల్ గురువుగారి వెంట వుండి ఆయన రాసిన, మాట్లాడిన, ప్రసంగించిన వివరాలన్నీ తు.చ. తప్పకుండా గ్రంథస్థం చేశాడు

ఒకరోజు బాస్‌వెల్‌ని ఒక సాహితీవేత్త ఘోరంగా అవమానించాడు

మనసునొచ్చిన బాస్‌వెల్ బాధగా వెళ్ళి "గురూజీ, నన్ను ఫలానా

వాడన్న మాటలు చాలా బాధ పెడుతున్నయ్! ఈ అవమానం మరచిపోలేకపోతున్నాను" అన్నాడు.

డాక్టర్ జాన్సన్ ఓ నిముషం ఆలోచించి "అయితే ఈ అవమానాన్ని ఓ సంవత్సరం వరకు మరచిపోయినట్టుగా భావించు తరువాత చెబుతా ఏం చేయాలో" అన్నాడు వేదంత ధోరణిలో.

సంవత్సరం తరువాత డాక్టర్ జాన్సనే ఆ విషయం అడిగితే "ఇప్పుడు ఆ అవమానం ఏమంత పెద్దదిగా అనిపించడంలేదు" అన్నాడు బాస్‌వెల్

"సుఖమయ జీవితానికి ఇదే సుగమమార్గం అన్నింటినీ మరచిపోవడమే" అన్నాడు జాన్సన్.

## చార్లీచాప్లిన్ అభిప్రాయాలు

చార్లీ చాప్లిన్ పేరు చెప్పగానే మనకు వెంటనే స్ఫురించేది, విషాద ఘట్టాల్లో నుంచి వచ్చే హాస్యంతో నిండిన ఆయన చిత్రాలు.

సినిమాల్లోనే కాకుండా నిజజీవితంలో ఎంతో హాస్య చమత్కారాలుండే సమాధానాలు చెప్పడం చార్లీ చాప్లిన్ అలవాటు.

ఒకసారి ఒక మిత్రుడు చాప్లిన్‌ను "మన ప్రముఖ మతబోధకుల మీద మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు

వెంటనే చాప్లిన్ "మన ప్రముఖ మతబోధకులపై నాకు ఎప్పుడూ సదభిప్రాయమే! ఎందుకనంటే, ప్రపంచంలో స్త్రీలను కాస్సేపయినా మౌనంగా కూర్చోపెట్టగల సమర్థులు వారే" అన్నాడు నవ్వుతూ

ఒక హాలీవుడ్ హాస్యనటుడు చాప్లిన్‌ని తన నటనతో మెప్పించి, ఆయన అభిప్రాయం తెలుసుకోవాలని, ఆయనకు రకరకాల జోక్స్ చెప్పి, వాటిని రకరకాలుగా అభినయంతో మేళవించి చూపాడు

చివరికి అతనికి చాప్లిన్ అభిప్రాయం తెలుసుకోవాలని "నా నటన, నా జోక్స్ మీకు బ్రహ్మాండంగా నచ్చాయనుకుంటాను నవ్వించడంలో నేను కృతకృత్యుణ్ణి అయినట్లేనా?" అన్నాడు

అప్పుడు చాప్లిన్ అక్కడి నుంచి వెళ్ళిపోతూ "నవ్వించడం ఎంత కష్టమైన పనో మీ నటన చూశాక ఇప్పుడు అర్థమైంది – గుడ్ బై" అంటూ వీడ్కోలు పుచ్చుకున్నాడు

## షాకు 'షాక్' ఇచ్చిన శిల్పి

రకరకాల ప్రాంతాలు తిరగడం, రకరకాల మనుషుల్ని కలుసుకోవడం ముఖ్యంగా నటులు, శిల్పులు, సంగీతకారులంటే జార్జి బెర్నార్డ్‌షాకు అమిత ఇష్టం

ప్రముఖ శిల్పి జాకోబ్ అనే అతని స్టూడియోకు వెళ్ళాడు జార్జ్ బెర్నార్డ్ షా.

పెద్ద పెద్ద బండరాళ్ళు, ఎత్తయిన బల్లల మీద నిలబెట్టి వున్నాయ్.

ఆ రాళ్ళలో తన ప్రతిభతో కోరిన శిల్పాన్ని మలచడం జాకోబ్ చేసే పని.

షాకు ఆ రోజు స్టూడియోలో ఒక మూల వున్న పెద్ద సైజు బండరాయి ప్రత్యేకంగా కనిపించింది

"ఆ పెద్ద బండరాయిలో ఏమి చెక్కాలని మిత్రమా?" అంటూ అడిగాడు షా.

"ఆ పెద్దరాయిలో ఏ బొమ్మ చెక్కాలో ఇంకా ప్లాన్లు సిద్ధం చేసుకోలేదు" చెప్పాడు శిల్పి

"అయితే నువ్వు చెక్కే ప్రతి శిల్పానికి సంబంధించి నువ్వు ముందే పథకాలు తయారుచేసుకుంటావా? భలే కళాకారుడివయ్యా! అయితే నేను రచనలు చేసేటప్పుడు క్షణక్షణాల్లో మనసు మార్చుకుని, చేసిన రచన చించి పారవేసి మళ్ళీ రచన చేస్తానే!" అన్నాడు షా నవ్వుతూ

"మీరు రాసేది నాలుగు తెల్లకాగితాలు అవి చించిపారేసినా పర్వాలా మరి నేను చెక్కేది నాలుగు- అయిదు టన్నుల రాళ్ళు. అవి పారేయడం కుదరదుగా" అన్నాడు శిల్పి.

## వర్డ్స్‌వర్త్ తెలుసుకున్న తప్పు

ఆంగ్లకవుల్లో ప్రథమస్థానం – ముఖ్యంగా ప్రకృతి ఆరాధకుడిగా, వర్డ్స్‌వర్త్ మహా కవిదే. అంత గొప్ప కవి అయిన వర్డ్స్‌వర్త్ ఆంగ్ల నాటక రచయిత షేక్స్‌పియర్ రచనలంటే ఎంతో ఆరాధనాభావంతో వుండేవాడు.

షేక్స్‌పియర్ కల్పనాచాతురితోపాటు నాటకాల్లో ఆయన వాడిన కవిత్వం వర్డ్స్‌వర్త్‌ను మరింత మంత్రముగ్ధుడ్ని చేసేది. వర్డ్స్‌వర్త్‌లాగే

ఆయన సమకాలీన ప్రముఖ రచయిత మిత్రుడు లాంబ్ కీ- షేక్స్పియర్ రచనలంటే ఎంతో ఆరాధనాభావముండేది.

ఒకసారి మాటల్లో పడి "నేను మనసులో గట్టిగా పూనుకోవాలిగాని, షేక్స్పియర్‌లా వ్రాయలేనా?" అన్నాడట వర్డ్స్‌వర్త్.

వర్డ్స్‌వర్త్ గొప్పకవి, మంచి మిత్రుడైనా ఆ మాటలకు లాంబ్‌కు కడుపుమండిపోయి "ఔనయ్యా! నువ్వు మనసులో గట్టిగా పూనుకుంటే రాయగలవు, కాదనను కానీ అలా పూనుకునే శక్తి ఒక్క షేక్స్పియర్‌కే వుంటుంది- వుంది. అది మరచిపోకు", అంటూ చురక అంటించాడు

షేక్స్పియర్ అంతటి మహోన్నత నాటక రచయిత, కవితో తనను పోల్చుకున్నందుకు అంత గొప్ప వర్డ్స్‌వర్త్ తన తప్పు తెలుసుకున్నాడు

## అబ్రహాంలింకన్ ఒకప్పుడు పాత సరుకుల షాపులో పనిచేస్తే ఏం?

అబ్రహాం లింకన్ ఎంత పేద కుటుంబాన్నుంచి వచ్చాడో లోకవిదితమే అడవుల్లో కట్టెలు కొట్టే పేదవాడు లింకన్ తండ్రి. కాళ్ళకు చెప్పులు కొనే స్థితిలో లేక చదువుకోడానికి పుస్తకాలు లేక కూలిపనులు, పొలం కాపలా పనులు చేసేవాడు లింకన్

అలాంటి కటిక పేదవాడు కష్టపడి పోస్టుమాస్టరయి, లాయర్ అయి, క్రమేపీ పదహారవ అమెరికా ప్రెసిడెంట్ అయ్యాడు

1858లో లింకన్‌తో అమెరికా ప్రెసిడెంట్ స్థానానికి పోటీపడ్డ డగ్లాస్-లింకన్ పేదరికాన్ని ఎన్నికల్లో ఎద్దేవా చేసేట్టు మాట్లాడుతున్నాడు

"ఇప్పుడు అమెరికా ప్రెసిడెంట్‌గా పోటీ చేస్తున్న ఈ లింకన్ ఒకప్పుడు నా సరుకులమ్మే షాపులో విస్కీ అమ్మే విభాగంలో పనిచేశాడు ఈ విషయం మరచిపోకండి" అన్నాడు లింకన్ గతాన్ని తవ్వి తీస్తూ

ఈ విషయం తెలిసిన లింకన్ "ఔను! అతని షాపులో నేను ఒకప్పుడెప్పుడో పని చేసిన మాట నిజం. అయితే అతను ఇంకా ఆ షాపులోనే ఇంకా సరుకులమ్ముకుంటూ జీవిస్తున్నాడు అంటే, అతని స్థాయి ఇప్పుడేమిటో మీరే చెప్పండి" అన్నాడు దెబ్బకు దెబ్బతీస్తూ.

డగ్లాస్ మళ్ళీ పాత సరుకుల షాపు సంగతి ఎత్తలేదు

## గణిత శాస్త్రవేత్త వింత సమాధానం

ఆధునిక గణిత శాస్త్రవేత్తగా (ఎనలిటికల్ జామెట్రీ), తాత్త్వికవేత్తగా, ప్రసిద్ధుడైన రేనీ డిస్కారియటస్ ఐరోపాకు చెందిన ఒక మహారాణి ఆహ్వానిస్తే, ఆమె ఆస్థానానికి వెళ్ళాడు.

మహారాణి అతనిని చూడగానే "నువ్వు నా అందానికి సరిజోడువాడివి కాకపోయినా, నీ పేరు ప్రతిష్ఠలకు ఆకర్షితురాలినై నిన్ను వివాహం చేసుకుందామనుకుంటున్నాను" అంది

అయితే డిస్కారియటస్ ఆమె కోర్కెను తిరస్కరించాడు అతని ప్రవర్తనను ఎంతో అవమానంగా భావించిన మహారాణి అతన్ని ఖైదు చేయించింది

అక్కడ కొన్నాళ్ళు ఖైదీగా వుంటే, డిస్కారియటస్ లొంగివస్తాడని, మహారాణి ఊహించింది అయితే ఆమె ఊహించినదానికి భిన్నంగా ఆ ఖైదులోనే అతను నేలమీద గణిత శాస్త్ర విషయాలు రాస్తూ, అధ్యయనం చేయసాగాడు

మహారాణి ఒకరోజు స్వయంగా అతని ఖైదులోకే వెళ్ళి "నిన్ను వివాహమాడితే నీ భార్యగా నీ పేరుతోపాటు నా పేరు ఆచంద్రతారార్కమవుతుందనుకునే నన్ను వివాహమాడమని కోరాను. నిన్ను ఖైదులో వేస్తే నువ్వు లొంగిపోతావనుకున్నాను. కానీ రెండూ కాలేదు" అంది బాధగా

అప్పుడు డిస్కారియటస్ "నా పేరుతో మీ పేరూ ఆచంద్రతారార్కంగా వుండడానికి, నన్ను వివాహమాడవలసిన పనిలేదు. నన్ను ఖైదు చేసిన వ్యక్తిగా మీ పేరు ఆ చంద్రతారార్కంగా వుంటుంది సెలవ్" అంటూ ఖైదు నుంచి బయటపడ్డాడు

డిస్కారియటస్ చెప్పింది నిజమేననిపించడంతో మహారాణి సంతోషించింది.

## నెపోలియన్‌ని వీరోచితుణ్ణి చేసిన సంఘటన

నెపోలియన్ నిఘంటువులో 'అసంభవం' అనే పదమే లేదన్నాడు. 'అసంభవం' అనేది మూర్ఖులు, తెలివితక్కువవాళ్ళు, తమ అసమర్థతను కప్పిపుచ్చుకోడానికి వాడే పదం అని నెపోలియన్ నమ్మకం.

నెపోలియన్ ఫ్రాన్స్‌దేశ అధినేతగా అనేక యుద్ధాలు చేశాడు. ఒకసారి నెపోలియన్ తన సైన్యంతో ఆల్ప్స్ పర్వత ప్రాంతానికి వెళ్ళాడు. తన సైన్యంతో ఆ పర్వతాన్ని అంత మంచులో దాటడం ప్రాణాంతకమని అతను తెలుసుకున్నాడు.

అక్కడి పర్వత ప్రాంతాల్లో నివసించే స్థానికులకు ఆ పర్వతం దాటే దగ్గరదారి ఏమైనా తెలుసేమో తెలుసుకుందామనుకున్నాడు.

పర్వత ప్రాంతంలో నివసించే ఓ వృద్ధురాలితో "అవ్వా, ఈ పర్వతం దాటే దగ్గరదారి ఏమైనా వుంటే చెప్పు" అన్నాడు.

"పిరికివాళ్ళు, మూర్ఖంగా ఈ పర్వతప్రాంతం దాటబోయి ప్రాణాలు పోగొట్టుకున్నారు" అంది అవ్వ.

ఆ మాటలతో ఉక్రోషం కలిగిన నెపోలియన్ ధైర్యంగా ముందుకెళ్ళి తన సైన్యాన్ని అవలీలగా ఆల్ప్స్ పర్వత ప్రాంతం దాటించాడు.

తిరిగివస్తూ "నీ మాటలు నాలో ఉక్రోషాన్ని, తరువాత పౌరుషాన్ని కలిగించాయి కృతజ్ఞతలు" అన్నాడు నెపోలియన్ ఆ అవ్వతో.

"అసాధ్యమైనది, ధైర్యవంతుడైనవాడికి ఈ లోకంలో ఏదీ వుండదు" అన్నది వృద్ధురాలు.

ఈ సంఘటనే నెపోలియన్‌ని వీరోచితుణ్ణి చేసింది.

## నెపోలియన్ సరిదిద్దిన పదాలు

నెపోలియన్ ఎన్ని యుద్ధాలు చేసినా, సమయం దొరికితే తన ఇంట్లోని స్వంత గ్రంధాలయంలో చదువుతూ కూర్చునేవాడు. ఆయనకు పుస్తకపఠనం ఎంతో అభిమాన కాలక్షేపం

షెల్ఫ్‌లు ఒకదాని తరువాత ఒకటి తిరుగుతూ తిరుగుతూ చివరికి తనకు కావలసిన పుస్తకం ఎక్కడుందో కనుక్కున్నాడు నెపోలియన్.

ఆ పుస్తకం ఎత్తయిన షెల్ఫ్ పైఅరలో కనిపించింది. అది తీయడానికి మడమలు ఎత్తి ప్రయత్నించినా, అది చేతికి అందలేదు

అయినా ఆయన ఆ ప్రయత్నం మానలేదు.

ఇంతలో అక్కడే వున్న మార్షల్ ఒకతను ఆ పుస్తకం తేలిగ్గా తీయడానికి వచ్చాడు

ఫ్రాన్సు సైనిక ఉన్నతోద్యోగుల్లో అందరికంటె ఎత్తయిన వ్యక్తి కావడం, ఆ సమయంలో అతనికెంతో ఉపకరించింది.

అతను పుస్తకం చేతితో తీస్తూ "నేను చక్రవర్తికంటే ఎత్తుగా వున్నవాణ్ణి" అంటూ పుస్తకం నెపోలియన్‌కు అందించాడు.

అయితే నెపోలియన్ ఆ మార్షల్‌కు కృతజ్ఞత చెప్పకపోగా అతను వాడిన మాటల్లో శ్లేష (రెండో అర్థం) స్ఫురించి– "నేను చక్రవర్తికంటే పొడగరిని అనాలి" అంటూ అతనన్న పదాలు సరిదిద్దాడు.

## నిజంకాని మీర్జా గాలిబ్ జ్యోతిష్యం

ప్రముఖ ఉర్దూ పారశీక కవి మీర్జా గాలిబ్ ఎటువంటి దీనపరిస్థితుల్లో వున్నా తన దర్జాను, అంతకంటే తన హాస్య చమత్కృతిని వీడలేదు.

ఒకసారి తిండి గడువని పరిస్థితి ఏర్పడింది

గాలిబ్ చేతిలో చిల్లిగవ్వలేదు.

మరో మార్గంలేక బిడియపడుతూనే, పాతబట్టలు అమ్మే దుకాణానికి వెళ్ళి, అక్కడ తన ఉన్ని కోటును విక్రయించి వేశాడు

ఇది ఎంత రహస్యంగా చేసినా, చివరికొక మిత్రుడు దీన్ని చూడనే చూశాడు

"ఏమిటి కవిగారూ, ఈ పని?" అన్నట్టు చూశాడు

"అందరూ ఆకలికి రొట్టెలు తిని నింపుకొంటుంటే నేను నా బట్టలమ్ముకొని జీవిస్తున్నాను" అన్నాడు తన జాలిగాథ చెప్పలేక చెబుతూ.

గాలిబ్‌కు కవిత్వమేకాక, జ్యోతిష్యంలో మంచి ప్రవేశముంది

జీవితం చివరి దశలో, గాలిబ్ తను రాసిన పద్యంలో తన మరణం ఏ సంవత్సరం జరుగుతుందో ఖచ్చితంగా సూచించాడు.

అయితే, ఢిల్లీ నగరంలో ప్లేగు ఘోరంగా వ్యాపించిందిగాని గాలిబ్‌కు దానివల్ల ఏ విధమైన కష్టమూ కలగలేదు

"మీరు మృత్యువును గురించి చెప్పిన జోశ్యం మీ విషయంలో నిజం కాలేదు ఎందుకని?" అంటూ ప్రశ్నిస్తే–

"అంటువ్యాధితో మరణించడం నా దర్జాకు భంగం. నా జోశ్యంలో మాత్రం లోపం లేదు" అన్నాడట మీర్జా గాలిబ్

## హెన్రీ ఫోర్డ్ మాట చమత్కారం

ప్రపంచ ప్రసిద్ధ పారిశ్రామికవేత్త హెన్రీ ఫోర్డ్ కొత్త రోల్స్ రాయిస్ కారు డ్రైవ్ చేసుకుంటూ, ఒక పెద్ద విందుకు హాజరయ్యాడు.

హెన్రీ ఫోర్డ్ వచ్చిన ఆ విందుకు, అయిదవ జార్జి చక్రవర్తి అప్పటికే వచ్చి వున్నాడు.

హెన్రీ ఫోర్డ్, ఫోర్డ్ కంపెనీ కారు వాడకుండా దాని బదులు రోల్స్ రాయిస్ కారు వాడడం జార్జి చక్రవర్తికి ఆశ్చర్యం కలిగించింది.

అందుకే చక్రవర్తి "ఇదేమిటి! మీరు మీ కంపెనీ ఫోర్డ్ కారు వాడకుండా మరో కంపెనీ 'రోల్స్ రాయిస్'" కారు వాడడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. కారణం ఏమిటి?" అన్నాడు.

ఫోర్డ్ కంపెనీ తయారుచేసే 'ఫోర్డ్' మోడల్ చాలా పాత మోడల్. కానీ రోల్స్ రాయిస్ కారు కొత్త మోడలే కాక చాలా ఖరీదైనది.

అయితే, అద్భుతమైన తెలివితేటలతోపాటు మంచి సమయస్ఫూర్తి వున్న ఫోర్డ్ మాత్రం ఆ ప్రశ్నకు "నేనెప్పుడు మా మేనేజర్ని మా ఫోర్డ్ కంపెనీ కారు నా కొకటి ఇమ్మన్నా, మా కంపెనీ కార్లు తయారవగానే క్షణాల్లో ఖర్చయిపోతున్నాయట ఇక మరో మార్గం లేక సరే ఏదో ఒక కారు ఇవ్వమంటే చివరికి అమ్ముడుపోని ఈ రోల్స్ రాయిస్ కంపెనీ కారిచ్చాడు" అన్నాడు

తన 'ఫోర్డ్' కంపెనీ 'స్టాండర్డ్ కారు' కున్న డిమాండ్, మరో కంపెనీ కారుకుండదని అలా తమాషాగా చెప్పాడు, ఫోర్డ్ మహాశయుడు.

## అగాథాక్రిష్టీపట్ల ఆమె భర్త ఆసక్తి

ప్రపంచ ప్రసిద్ధ డిటెక్టివ్ కథారచయిత్రి, 'అగాథాక్రిష్టీ' రాసినన్ని మంచి డిటెక్టివ్ కథలు, నవలలు రాసినవారు అరుదు.

అయితే నిత్య జీవితంలో ఆమె భర్త ప్రముఖ పురావస్తు శాస్త్రవేత్త.

వారి ఇద్దరి దాంపత్యం ఎంతో అన్యోన్యంగా సాగింది.

పైగా రచయిత్రిగా, అగాథాక్రిస్టీ రచనల విషయంగా, అతను ఆమెకెన్నో పురావస్తు శాస్త్ర విషయాలు, వివరాలు అందించేవాడు.

అగాథాక్రిస్టీ ప్రత్యేకత ఏమిటంటే – ఆమె రాసిన ప్రతి డిటెక్టివ్ నవలకు సంబంధించిన 'కాపీరైటు' హక్కు, దానిమీద వచ్చే 'రాయల్టీ' ఆమె తన బంధువుల్లో, ప్రతివారికి ఒక్కో నవల ఇచ్చి ఆ విధంగా వాళ్ళూ కోటీశ్వరులయ్యేట్టు సహకరించింది

ఒకరోజు ఒక ఇంటర్వ్యూలో, ఒక పత్రికా విలేఖరి ఆమెను "మీ వృద్ధాప్యంలో భార్యాభర్తలుగా మీ అన్యోన్యత ఎలా వుంది?" అంటూ అడిగాడు

అప్పుడామె "నా భర్త ప్రఖ్యాత పురావస్తు శాస్త్రవేత్తకదా!" అంది

"భార్యాభర్తలుగా మీ మధ్య అన్యోన్యతకూ– ఆయన పురావస్తు శాస్త్రవేత్త అవడానికి సంబంధం ఏమిటి?" అని పత్రికా విలేఖరి మళ్ళీ ప్రశ్నించాడు

అప్పుడు, అగాథాక్రిస్టీ "చెప్పాగా, మా వారు పురావస్తు శాస్త్రవేత్తని నేను వృద్ధురాలయినకొద్దీ ఆయన నన్నో పురాతన వస్తువుగా భావించి ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నారు" అంది

## 'ఆంధ్రరత్న'గారి బహుపాత్రాభినయం

'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి పేరు వినగానే ఒక మహోన్నత దేశభక్తుడి రూపు మనకు కళ్ళముందు నిలుస్తుంది

ఒకసారి విజయవాడలో, పుష్కరాల సమయంలో కృష్ణానదీతీరాన కాంగ్రెస్ ప్రచార సభను ఏర్పాటుచేయాలని గోపాలకృష్ణయ్య ఉద్దేశ్యం

అయితే పుష్కరాలకు వచ్చే జనం నదీస్నానం చేసి వెళతారు, అక్కడ ఏ సభ ఏర్పాటుచేయడమైనా వట్టి వృధా అని విజయవాడ ప్రముఖ కార్యకర్తలు చెప్పారు

అయితే గోపాలకృష్ణయ్య గారు నిరుత్సాహపడకుండా ఒక బల్ల తెప్పించి దాన్ని కృష్ణ ఒడ్డున వేసి–

"రాజు వెడలె రవి తేజము నొనరగ" అంటూ పాట పాడుతూ నృత్యం చేయసాగారు

ఈ గందర గోళానికి జనం పోగయ్యారు. ఆయన వారందరిచేత 'శ్రీమద్రామారమణ గోవిందో హరి' అనిపించి వాళ్ళని అలా ఆకట్టుకుని, కాంగ్రెస్ కార్యక్రమాన్ని, బ్రిటీషువాళ్ళ దురాగతాలని, స్వాతంత్ర్యపు ఆవశ్యకతని హరికథలా, తన మృదుమధుర కంఠంతో ఆశువుగా చెప్పి – అక్కడ వేలకొలది జనం పోగయ్యేట్టు చేశారు.

ఎడిన్ బరోలో ఎం.ఏ. చదివి, వైస్ ప్రిన్స్‌పాల్‌గా, లెక్చరర్‌గా పనిచేసిన గోపాలకృష్ణయ్య గారు దేశ స్వాతంత్ర్యం కోసం తన సర్వస్వం అర్పించారు. ఆదిశంకరాచార్యుల్లా, వివేకానందుడిలా నలభై ఏళ్ళు నిండని పిన్న వయసులో కీర్తిశేషుడైన మహాత్ముడు గోపాలకృష్ణయ్య 'ఆంధ్రరత్న' కాదు – 'జాతిరత్న.'

## 'ఆంధ్రరత్న'గారి ఎత్తుగడ

**కాం**గ్రెస్ ఉద్యమం దేశ స్వాతంత్ర్య సముపార్జన కోసం ముమ్మరంగా సాగుతున్నది అప్పట్లో దక్షిణ భారత ప్రాంతంలో అతి ముఖ్యుడైన నాయకుడు 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

ఒకసారి ఒక ఊళ్ళో శైవులు–వైష్ణవులు సమానంగా వున్నారు వాళ్ళమధ్య విభేదాలు ఎంత తీవ్రంగా వుండేవంటే – ఒకళ్ళొచ్చిన సభకు మరొకరు చస్తే వచ్చేవారు కాదు.

ఇది తెలిసిన గోపాలకృష్ణయ్యగారు తన సభకు అందరినీ ఆహ్వానించడానికి ఒక ఎత్తుగడ వేశారు

శ్రీవెంకటేశ్వరస్వామి–శివుని అవతారమా? విష్ణువు అవతారమా? అనే అంశం మీద తాను ఉపన్యసించబోతున్నట్టు ఆయన దండోరా వేయించాడు

అంతే! ఆయన ఊహించినట్టు జనం ఇరుపక్షాలవాళ్ళు వచ్చారు.

శ్రీవెంకటేశ్వరస్వామి శివుని అవతారమని కొంతసేపు, విష్ణువు అవతారమని కొంతసేపు పురాణ గ్రంథాల నుంచి వందల ఉదాహరణలు ఇస్తూ ఆశువుగా పద్యాలు చెబుతూ జనాన్ని కట్టిపడవేశాడు. ఆయన గాన మాధుర్యం అందరినీ ఆకర్షించింది

గోపాలకృష్ణయ్య గారి ఉపన్యాసం ఇరుపక్షాలకు బాగా నచ్చడంతో దేశ స్వాతంత్ర్యం కోసం చివర్లో గాంధీజీ సందేశం వినిపించారు శైవులు–వైష్ణవులు ఆయనపట్ల విశ్వాసం కుదిరి, జాతీయవాదులయ్యారు

## ప్రేమ్‌చంద్ కలెక్టరుకిచ్చిన సమాధానం

రచనల్లో ప్రేమ్‌చంద్ ఎప్పుడూ స్వతంత్ర భావాలే వ్యక్తం చేశాడు అంతేకాదు, రచనల్లోలాగా నిత్య జీవితంలో కూడా ఆయన సర్వస్వతంత్రుడే

ఆయన వ్యక్తిత్వం అసాధారణమైంది. అప్పట్లో ప్రేమ్‌చంద్ ఒక స్కూలు మాష్టరు ఉద్యోగం చేస్తున్నాడు

ఆయన వుండే ఇంటికి దగ్గర్లోనే ఆంగ్లదొర జిల్లా కలెక్టర్ గారిల్లుండేది.

సాయంత్రపుపూట జిల్లా కలెక్టర్ ప్రేమ్‌చంద్ ఇంటిముందు నుంచి వ్యాహ్యాళికి వెళుతుండేవాడు

అయితే ప్రేమ్‌చంద్ ఏదో చదువుతూ, వ్రాస్తూ ఎప్పుడూ లోకం పట్టనట్టు తన ధ్యాసలో తను వుండేవాడు.

ఒకరోజు కలెక్టర్‌గారికి కోపం వచ్చి ప్రేమ్‌చంద్‌ని పిలిపించాడు

కారణం తెలియని ప్రేమ్‌చంద్ వెళ్ళాడు "ఏమయ్యా! రోజూ నేను నీ ఇంటిముందు నుంచి వెళుతున్నాను ఒకసారయినా నువ్వు నాకు ఎదురొచ్చి అభివందనం చేశావా? నేను జిల్లా అధికారిని గదా?" అన్నాడు

ప్రేమ్‌చంద్‌కు వళ్ళు మండి "నేను చేయవలసిన పని నాకుంది. అయినా రోడ్డు మీద వెళ్ళేవాళ్ళకు అభివందనాలు చెప్పుకుంటూ వుండే పని నాకు లేదు!" అంటూ, నిర్భీతిగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు

తరువాత తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు ప్రేమ్‌చంద్.

## నెహ్రూజీ చతురోక్తులు

నెహ్రూజీ ఎంత పని వత్తిడిలో వున్నా ఎప్పుడూ హాస్యప్రవృత్తిని వదలలేదు

1964లో ఫిబ్రవరి నెలలో నెహ్రూగారు కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యులతో కాలక్షేపం చేస్తూ ఆనందిస్తున్నారు ఆయన ప్రక్కనే మహావీర్ త్యాగి కూర్చుని వున్నాడు అయనకు నెహ్రూ దగ్గర చనువుంది

ఆయన నెహ్రూవైపు, ఆయన జేబువైపు కాస్సేపు చూసి అకస్మాత్తుగా ఆయన జేబులోని బాల్‌పాయింట్ కలం లాక్కుని "ఈ పెన్నుతో

మీరు చాలా పనిచేశారు. ఇక మీరు విశ్రాంతి తీసుకోవాలని మేము కోరుతున్నాం" అన్నాడు

"అది బాగానే వుంది, సంతోషం! కానీ జేబులు కొట్టేది ఇలాగా? సరిగా నేర్చుకో" అన్నారు నెహ్రూ చురక అంటిస్తూ.

నెహ్రూగారు ఒకసారి లండన్ టూర్‌లో వున్నప్పుడు ఒక పత్రికా విలేఖరి ఆయనను ఇంటర్వ్యూ చేస్తున్నాడు

పెద్ద దేశం అప్పటికే అరవై కోట్ల పైచిలుకు జనాభాతో, అనేక సమస్యలతో సతమతమవుతున్న దేశం

ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకున్న పత్రికా విలేఖరి "భారతదేశంలో ప్రధానిగా మీకెన్ని ప్రధాన సమస్యలున్నయ్?" అన్నాడు

వెంటనే నెహ్రూజీ "అరవై కోట్ల ప్రధాన సమస్యలున్నాయ్" అన్నారు.

## భారతరత్న మహర్షి కార్వే విసరిన చణుకు

విద్యారంగంలో ముఖ్యంగా నిరక్షరాస్యతను పారద్రోలడంలో 'భారత రత్న' బిరుదాంకితుడు మహర్షి కార్వే ప్రముఖుడు 1958లో కార్వే సేవలకు గుర్తింపుగా 'భారతరత్న' బిరుదును కేంద్ర ప్రభుత్వం ఇచ్చింది

ఆయన మంచి హాస్య సంభాషణా చతురుడు కూడా

ప్రముఖ కన్నడ రచయిత యోగనరసింహం ఆయన జీవత చరిత్రను హిందీ నుంచి కన్నడంలోకి అనువదించాడు

అయితే యోగనరసింహం కార్వేని ముఖాముఖిగా కలుసుకోలేదు

పూనా నగరంలో వుండే కార్వే స్వగృహానికి యోగనరసింహం వెళ్ళాడు.

మామూలు యోగక్షేమాల ప్రసక్తి అయిపోయాక "మీకెందరు పిల్లలు నరసింహం గారూ?" అంటూ అడిగారు కార్వే

"నాకు ఎనిమిదిమంది పిల్లలు." సమాధానం చెప్పాడు నరసింహం

"అయితే నాకంటే మీరు దేశానికి రెట్టింపు సేవలందించారన్నమాట" అన్నాడు కార్వే

నరసింహం ఆశ్చర్యపోయి "మీ అంతటి మహామహుడికంటే, నా సేవలు రెట్టింపుగా చెబుతున్నారా? అదెలా?" అన్నాడు

"నాకు నలుగురు పిల్లలు. మీకు ఎనిమిదిమంది పిల్లలు. నాలుగును రెట్టింపు చేస్తే ఎనిమిదికదా?" అన్నాడు కార్వే.

కార్వే నిజజీవితంలో లెక్కల మేష్టారు. అందుకే ఆ ఫక్కీలో చణుకు విసిరాడు.

## విశ్వకవి ఠాగూర్ ప్రతిభ

1913 నవంబరులో రవీంద్రనాథ్ ఠాగూర్‌కి స్వీడన్ దేశపు ఎకాడమీ 'గీతాంజలి' పద్య కావ్యానికి 'నోబెల్ సాహిత్య బహుమతి' ప్రకటించింది. ఈ అఖండ గౌరవం అంతకు పూర్వంకాని, అటు తరువాత కాని ప్రాచ్యదేశవాసి అయిన ఏ కవికీ లభించలేదు. అంతవరకు బెంగాలీ ప్రాంతానికి పరిమితమైన ఆయన సాహితీ ఔన్నత్యం దిగంతాలకు వ్యాపించింది

అపూర్వమైన అంతర్జాతీయ విఖ్యాతిని సంపాదించిన రవీంద్రుని అభినందించడానికి కలకత్తా నుంచి ఎందరో ప్రముఖులు ప్రత్యేకమైన రైలులో శాంతినికేతనానికి బయలుదేరారు వాళ్ళ ఆర్భాటం, వారు పలుకుతున్న ప్రశంసా వాక్యాలు ఆయన్ని మురిపించలేకపోయాయి.

అందుకే, ఆయన "నా సాహిత్యంలో ఒక అక్షరమైనా చదివిన పాపాన పోని మీరంతా పెద్ద మనుషుల్లా నన్ను అభినందించడానికి ఆత్రంగా తోసుకొంటూ ముందుకు వస్తున్నారు యాభై ఏళ్ళకు పై చిలుకు నేను సాహిత్య సేవ చేస్తున్నా ఒక్క ప్రోత్సాహకవాక్యం పలికి ఎరుగని మీవంటి పెద్దలు, స్తోత్రపాఠాలు ప్రారంభించారు.

"ఎన్నడూ కవిగా గుర్తించని మీరు, నన్ను ఇవ్వాళ ఎక్కడలేని అభిమానాన్ని కుమ్మరించి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నారు

"మీలో కొందరు సహృదయులు, మిత్రులు, నా కవితాశక్తిని గుర్తించి గౌరవించడానికొచ్చారు మిగిలిన పెద్దలు నా కవిత్వాన్ని కాదు – విదేశీయులు ఇచ్చిన బహుమానాన్ని గౌరవిస్తున్నారు ఒక పరాయిదేశం వేలెత్తి చూపితేనేకాని మీ మధ్య జీవిస్తున్న కవి గొప్పతనం మీకు తెలియలేదు. మీ సత్కారాలేవీ వద్దు" అంటూ ఠాగూర్ వాళ్ళ అభినందనలను కోపంగా తిరస్కరించాడు

## గొప్ప రచయిత 'గోర్కీ'ని గురించి ప్రేమ్‌చంద్

ప్రముఖ రచయిత ప్రేమ్‌చంద్ 1936లో తీవ్రంగా జబ్బుపడ్డాడు.

ఆయన జబ్బు తీవ్రంగా వున్న సమయంలో ప్రముఖ రష్యా రచయిత మాక్సిమ్ గోర్కీ గతించాడని తెలిసింది.

ఆ సందర్భంగా జరిగే సంతాప సభలో తను ప్రసంగించడానికి ప్రేమ్‌చంద్ తన ఉపన్యాసం ప్రొద్దుపోయినా ఇంకా రాస్తూనే వున్నాడు.

భార్య వచ్చి చూసి "ఏమిటీ ఏదో రాస్తున్నారు ఇంత పొద్దుపోయి – ఆరోగ్యం బాగోలేదుగా?" అంది

"ప్రముఖ రష్యా రచయిత 'మాక్సిమ్ గోర్కీ' సంతాప సభ కోసం ప్రసంగం రాస్తున్నాను." చెప్పాడు ప్రేమ్‌చంద్.

"గోర్కీ శోకసభకు మీరు సంతాప ప్రసంగం రాయకపోతేనేం? పైగా అతను హిందూ దేశస్థుడు కూడా కాదు" అంది భార్య.

ప్రేమ్‌చంద్ కోపంపట్టలేక, "ఇదే మన సంకుచిత మనస్తత్వం. గోర్కీలాంటి మహా రచయితకు జాతీయత, దేశం అడ్డురావు" అన్నాడు.

"ఆ మహా రచయిత మనదేశానికి ఏంచేశాడు?" భార్య మళ్ళీ అడిగింది.

"నువ్వు పొరబడుతున్నావు రాణీ! రచయిత దగ్గర పంచి పెట్టడానికి ఏముంటుంది? అతని దగ్గర వుండేది అతని తపస్సే. అదే అందరిముందూ పెడతాడు కానీ తన కోసం ఏమీ మిగుల్చుకోడు

"సాధారణ వ్యక్తి తన కోసమే తపస్సు చేసుకుంటాడు. రచయిత విశ్వమానవ కళ్యాణం కోసం తపస్సు చేస్తాడు" అన్నాడు ప్రేమ్‌చంద్.

ఆయన చెప్పిన నిర్వచనం గొప్ప రచయితలకు వర్తిస్తుంది

## లాల్ బహదూర్ శాస్త్రి త్యాగనిరతి

నెహ్రూజీ తరువాత, దేశప్రధాని అయిన లాల్ బహదూర్ పట్టుదల, ఆత్మగౌరవం, కర్తవ్యపరాయణత్వం ఎవరికైనా ఆదర్శప్రాయమైనవి

లాల్ బహదూర్ స్వాతంత్ర్య సమరకాలంలో జైలులో వుండగా, ఆయన కుమార్తె తీవ్రంగా జబ్బు పడింది.

పెరోల్ మీద వెళ్ళి కుమార్తెను చూడాలని ఆయన కోరిక.

ఆ అవకాశాన్ని ఉపయోగించుకుని, "పెరోల్ మీద బయటికి వెళ్ళినపుడు కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొనను" అంటూ వ్రాసివ్వండి అన్నాడు జైలు అధికారి.

ఏ క్షణంలోనైనా మరణించడానికి సిద్ధంగా వున్న కుమార్తెను చూడడానికైనా ఆయన తిరస్కరించాడు కాని, జైలు అధికారులు పెట్టిన నిబంధనకు లొంగలేదు చివరికి జైలు అధికారులే దిగివచ్చి ఆయనను పెరోల్ మీద వదిలారు.

ఆయన ఇంటికి వచ్చినరోజే కుమార్తె మరణిస్తే ఆమె అంత్యక్రియలుచేసి మళ్ళీ వెంటనే జైలుకు వచ్చాడు

మరోసారి లాల్‌బహదూర్ కుమారుడికి 105 డిగ్రీల జ్వరం లాల్‌బహదూర్ ఇంటికి మళ్ళీ పెరోల్ మీద వచ్చాడు. కాంగ్రెస్ కార్యక్రమాల్లో పాల్గొనని వ్రాసి ఇస్తే పెరోల్ తారీకు పొడిగిస్తామన్నారు జైలు అధికారులు.

105 డిగ్రీల జ్వరం, వణుకుతున్న పెదిమలతో "బాబూజీ, మీరు వెళ్ళకండి! నా దగ్గరే వుండండి" అంటూ పిల్లవాడు ఏడుస్తున్నాడు తండ్రి కోసం

లాల్‌బహదూర్ చెక్కిళ్ళ వెంట బొటబొట కన్నీరు కారింది ఆయన ఏదో కలనుంచి తెప్పరిల్లినట్టు పిల్లవాడివంక ఒకసారి చూసి, జైలుకు వెళ్ళాడు.

లాల్‌బహదూర్ జైలుకు వెళ్ళగానే, ఆ పిల్లవాడు శాశ్వతంగా కన్నుమూశాడు.

దేశంకోసం ఇంత గొప్ప మనసుతో, ఇలా త్యాగాలు చేయగలవా రెక్కడుంటారు? అందుకే ఆయన బహదూర్

## ప్రముఖ కవి 'ఫయాజ్'కు లభించిన అతిథి

ప్రముఖ ఉర్దూకవి, ఫయాజ్–అహ్మద్–ఫయాజ్ మంచి దయార్ద్ర హృదయుడు ఎవరొచ్చినా, వాళ్ళకు ఏదో విధంగా సాయంచేసి ఆదుకునేవాడు.

ఇతని మంచితనం ఆసరాగా తీసుకుని ఇతని మిత్రుడొకడు ఇంట్లో తిష్టవేసి, అతిధిని అంటూ వంకపెట్టి రాజభోగాలు అనుభవిస్తూ ఫయాజ్ ఇంటినుంచి వెళ్ళకుండా వుండిపోయాడు. అతని బాధ భరిస్తూ, ఫయాజ్‌కు తలప్రాణం తోకకొచ్చింది.

ఒకరోజు సహనం నశించిపోయిన ఫయాజ్ కోపం లోలోపల అణచుకుంటూ "నీ ప్రవర్తన ఎంతో వింతగా వుంది. నీ భార్య, పిల్లల విషయం అసలు పట్టించుకోవడం మరచినట్లున్నావు. నువ్వు ఇక్కడే వుండిపోతే పాపం, వాళ్ళు వంటరిగా నీ దిగులుతో, బాధపడుతుండి వుంటారు" అంటూ ఇక వెళ్ళమని సూచించాడు.

అయితే ఆ అతి తెలివిగల అతిధి, ఆ మాటకు సమాధానంగా "అబ్బే, వాళ్ళను గురించి బాధపడకు మిత్రమా! వాళ్ళు అలా వంటరిగా బాధపడకూడదనే మా ఆవిడను, పిల్లలను వెంటనే బయలుదేరివచ్చి నీ ఆతిధ్యం స్వీకరించిన నీకు ఆనందం కలిగించమని రాశాను ముందుగానే" అన్నాడు.

తన మెతకతనం ఎంతవరకు వెళ్ళిందో ఫయాజ్ కవికి అర్ధమై తనే దేశాటనకని బయలుదేరాడు అంతకంటే మంచిమార్గం ఆ అవాంతరం దాటటానికి అతనికి మరొకటి కనిపించలేదు

## మాలవ్యా బోధించిన నీతి

బెనారస్ హిందూ యూనివర్సిటీ స్థాపకులలో మదన్‌మోహన్ మాలవ్యాది అగ్ర తాంబూలం దేశవ్యాప్తంగా తిరిగి రకరకాలుగా చందాలు వసూలు చేసిన మహాత్ముడాయన అయన ఆ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ కూడా

ఒకరోజు ఆయన యూనివర్సిటీ హాస్టలు గదులవైపు వెళుతుండగా తెల్లటి గోడమీద నల్లగా రాసిన అక్షరాలు కనిపించాయి

మాలవ్యా దగ్గరికెళ్ళి చూశాడు ఆ గోడమీద పెన్సిలుతో రోజువారి పాల ఖాతా వివరాలు, చాకలి బట్టలు ఉతికిన ఖర్చు, తక్కిన సాదరు ఖర్చు తెల్ల కాగితం మీద రాసినట్టు వివరాలతో రాసివుంది గోడమీద అలా రాయటంవల్ల తెల్లగా పాలపాయిలా వుండవలసిన దాని అందం చెడిపోయి వుంది

మాలవ్యా వెంటనే ఆ గది విద్యార్థిని పిలిచి "ఈ విశ్వవిద్యాలయం ఒక పవిత్ర దేవాలయం ఈ పవిత్ర దేవాలయ నిర్మాణంలో ఉపయోగించిన ప్రతి ఇటుకా నా చెమటతో తడిసిందే ఈ దేవాలయం పవిత్రంగా వుండేట్టు చూసుకునే బాధ్యత ఇకనుంచి భావిభారత పౌరులైన మీది. నీకు తెలిసే వుంటుంది పవిత్రత ఎక్కడ వుంటుందో, దైవం అక్కడ వుంటాడని నువ్వు చదువుకునే చోటు, నిద్రించే చోటు, నివసించే చోటు శుభ్రంగా వుంచుకోవాలని విశ్వవిద్యాలయ స్థాయి విద్యార్థికి విడిగా చెప్పాలా? వెళ్ళి ఈ జేబురుమాలుతో నువ్వు గోడమీద రాసినది చెరుపు" అంటూ తన జేబురుమాలు అందించారు.

జీవితంలో తనకొక గుణపాఠం నేర్పిన మాలవ్యాపట్ల మరింత గౌరవం పెరిగింది ఆ విద్యార్థికి

## ఆత్మాభిమానంలో 'గిడుగు'వారు పిడుగే!

భాషాశాస్త్ర విషయాల్లో గిడుగు వేంకటరామమూర్తి గారు ఎంత గట్టివారో, అంతగా ఎవరిఎదుటా తలవంచటానికి ఇష్టపడని సమున్నత గౌరవాభిలాషి

ఒకసారి విజయనగర సంస్థానంలో రామమూర్తి పంతులుగారితోపాటు, గురజాడ అప్పారావుగారుండగా, రాజావారి సంస్థానంలోకి వెళ్ళారు

ఇద్దరికీ సంస్థానంలో ఉద్యోగం

ఆ రోజు రాజావారి సంస్థానంలో బోగంమేళం జరుగుతోంది మిత్రుడైన గిడుగువారిని తనతో రమ్మన్నారు గురజాడవారు

రామమూర్తిగారికి ఇష్టంలేకపోయినా ఉద్యోగధర్మం అని వెళ్ళారు

అక్కడ రాజావారితోపాటు, ఆయన బోగం సాని కూడా ఒకే సోఫామీద దర్శనమిచ్చింది. అంతే! గిడుగువారు సభామర్యాదలు కూడా పాటించకుండా సభలోనుంచి బయటకు వచ్చేశారు

అప్పారావుగారుకూడా ఏదో మిషతో బయటికి వచ్చి, "రామమూర్తీ! మనకు ఇష్టం వున్నా లేకపోయినా జమీందారుల సర్వీసు చేస్తున్నంత కాలం ఏవో కొన్ని నియమాల్ని పాటించక తప్పదయ్యా! నీలా ముక్కుకు సూటిగా పోతే, కొన్ని ఇబ్బందుల్లో పడతామయ్యా!" అన్నారు.

"ఇతరుల సంతోషం కోసం నా వ్యక్తిత్వాన్ని చంపుకోలేను నేను ఆత్మద్రోహిని కాను" అన్నారు గిడుగు

తరువాత ఎవరో చెప్పిన కొండాలు విని "మీ పద్ధతి మార్చుకోండి. పాత పద్ధతిలో పాఠాలు చెప్పండి లేదా ఈ నెలాఖరుదాకా పనిచేసి మీరు ఉద్యోగం మానివేయవచ్చు!" అంటూ రాణిగారు అనగానే–

"నెలాఖరుదాకా ఎందుకు? ఇప్పుడే మీ ఉద్యోగం మానివేస్తున్నాను" అంటూ గిడుగువారు కోటకు వెళ్ళటం మానివేశారు

## సంజీవరెడ్డిగారు చెప్పిన నిఖార్సయిన నిజం

**భా**రతదేశ చరిత్రలో రాజకీయవేత్తగా శ్రీ మొరార్జీదేశాయ్ ఒక ప్రత్యేకత, వ్యక్తిత్వం వున్న వ్యక్తి

ఆయనవి నిశ్చితమైన, నిశ్చలమైన అభిప్రాయాలు

అలవాట్లలో నిజమైన గాంధేయ వాది వజ్రసంకల్పంతోపాటు, నిష్కళంకమైన వ్యక్తిత్వం, నిర్భయత్వం ఆయన ప్రత్యేకతలు

మొదట బొంబాయి మంత్రిగా, ముఖ్యమంత్రిగా, 1956 నుంచి 1963 వరకు నెహ్రూగారి మంత్రివర్గంలో, 1967 నుంచి 1969 వరకు ఇందిరాగాంధీ మంత్రివర్గంలో ఉపప్రధానిగా వున్నారు

జనతా ప్రభుత్వం ఏర్పడ్డప్పుడు సంజీవరెడ్డి రాష్ట్రపతి, శ్రీ మొరార్జీదేశాయ్ ప్రధానమంత్రి

అయితే, అప్పటికే 82 ఏళ్ళ వయసున్న కురువృద్ధుడు మొరార్జీ ఎక్కువ కాలం బ్రతకడని, ఇక దేశ ప్రధానిగా తమకు ఛాన్సు వుందని ప్రముఖ నాయకులు కొందరు కలలు కనేవారు

ఈ ఆలోచనలు పసిగట్టిన సంజీవరెడ్డి, "మీరేదో ఊహిస్తూ కలల్లో వున్నట్టున్నారు! ఆరోగ్య నియమాలు తుచ తప్పక పాటించే ఆయన (మొరార్జీ) ఎక్కువ కాలం జీవిస్తారు వెర్రి మొర్రి ఆలోచనలు కట్టిపెట్టండి" అంటూ హితవు చెప్పారు

ఆయన చెప్పినట్టే నెహ్రూ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ వంటి ప్రముఖ ప్రధానులు ఆయన ముందు కీర్తిశేషులయ్యారు

సంజీవరెడ్డి గారు ఊహించినట్టుగానే మొరార్జీ నిండు నూరేళ్ళు జీవించారు

## పింగళి అమ్మగారి చమత్కారం

విజయావారి చిత్రాలన్నీ 'హిట్స్' అవటానికి కథ, మాటలు, పాటలు ఒకదానితో ఒకటి పోటీపడుతున్నట్టు, చాలా సాదాసీదాగా వున్నా, వాటిలో మంచి చమత్కారం, కొత్తదనం తొంగిచూస్తున్నట్టుండేది.

ఈ విజయావారి విజయవంతమైన ఆ చిత్రాల రచనాసారధి పింగళి నాగేంద్రరావుగారు

పింగళివారిది అసలు బందరు

చిన్నప్పటి నుంచి పింగళి వారికి ఆట పాటలు, నాటకాలంటే బహుప్రీతి

నాగేంద్రరావు గారికి తల్లి అంటే అమిత గౌరవం

ఆమెను దేవతలా చూసేవారు

ఆమెతో ఆడి పాడి, నవ్వుతూ గంతులు వేస్తూ కాలక్షేపం చేసేవారు.

తల్లిగారి మాటతీరు, చమత్కారం పింగళివారికి బాగా వంటబట్టాయని, ఆమె ప్రభావం ఈ విషయంలో పింగళివారి మీద ఎక్కువని చెప్పక తప్పదు.

ఒకసారి ప్రముఖ హాస్య రచయిత రావూరు, పింగళి వారింటికి వెళ్ళి "నాగేంద్రరావు గారున్నారా?" అంటూ అడిగారట, వారి తల్లిని.

"లేడు నాయనా! ఊరు బయట ఎవరో తన్నుకుంటున్నారట మూడు రోజుల నుంచి అక్కడికి వెళుతున్నాడు వాళ్ళంటే బలముండి తన్నుకుంటున్నారు వీడెందుకు బక్కపీనుగలాగా" అన్నదట.

రావూరుకు అర్థంకాలేదు

తరువాత తెలిసింది–పింగళివారు వెళ్ళింది 'కుస్తీ పోటీలు' చూడటానికని

## వాల్టేర్‌కు నచ్చని ప్రముఖ రచయిత

వాల్టేరు ప్రముఖ ఫ్రెంచి రచయిత బహువిద్యా విశారదుడు.

సాహిత్యం, తత్త్వశాస్త్రం, గణితం, రాజనీతి, చరిత్ర, తాత్త్విక శాస్త్రాలను అధ్యయనం చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి

అనేక విప్లవభావాలు తన రచనల్లో కనబరచటంతో అనేకసార్లు దేశబహిష్కరణ శిక్షలను పొందిన ధైర్యశాలి.

ఆయన జీవితంలో కొంత భాగం విదేశీ పర్యటనల్లో గడిపాడు. ఆయా సందర్భాల్లో అక్కడి ప్రముఖులను కలుసుకునేవాడు

ప్రముఖ ఆంగ్ల నాటక రచయిత కాంగ్రేవ్ దర్శనార్థం అతను ఇంగ్లాండ్ పర్యటనలో ప్రయత్నించాడు.

విప్లవభావాలను, ప్రగతి భావాలను తన రచనల్లో కనబరచకపోవటంవల్ల, వాటిని ప్రేమించే వాల్టేర్ తనను విమర్శిస్తాడనే భయం పట్టుకునేది కాంగ్రేవ్‌కు.

అందుకే వాల్టేర్ రాగానే "నా రచనలు కేవలం ఉబుసుపోకకు రాసినవేకానీ, వాటిలో ప్రత్యేక విశేషములేవీ లేవు లెండి" అన్నాడట కాంగ్రేవ్.

"మంచి నాటక రచయితవని తెలిసి, నీ మౌలిక భావాలేమిటో తెలుసుకుందామని వచ్చాను. కాలక్షేపానికి రచనలు చేస్తూ, పెద్దలిచ్చిన ఆస్తితో బ్రతుకుతున్న నీతో నాకేం పని?" అంటూ అప్పటికప్పుడే సెలవు తీసుకున్నాడట వాల్టేర్.

ప్రగతి భావాలు, విప్లవభావాలు లేని సాంప్రదాయ పద్ధతిలో రచనలు చేసే రచయితలంటే వాల్టేర్‌కు ఇష్టంలేదు.

## మదర్ థెరీసాను ప్రాణికోటి సేవకు పురిగొల్పినటువంటి గొప్ప సంఘటన

'మానవసేవే మాధవసేవ' – అనే భగవద్గీతా సారాన్ని ఆచరణలో పెట్టి 'విశ్వమాత'గా, ప్రపంచ ప్రజల మన్ననలను పొందిన మహామనీషి మదర్ థెరీసా.

1910లో, యుగోస్లేవియాలో పుట్టిన మదర్ థెరీసా, తల్లిదండ్రులు అల్బేనియన్‌లు. ఒకసారి తన జీవితాన్ని మార్చివేసిన సంఘటన ఆమె చూసింది. అప్పుడు ఆమె అసలు పేరు ఆగ్నస్

ఒకసారి ఆమె, స్కూలు నుంచి ఇంటికి వస్తుండగా, దారిలో ఆమె హృదయాన్ని కలచివేసిన ఒక సంఘటన చూసింది. ఆమె లేతమనసు బాధతో తల్లడిల్లిపోయింది.

రోడ్డుప్రక్కన పడుకుని వున్న చిన్న కుక్కపిల్ల కాలుమీదుగా ఒక మోటారు కారు వేగంగా పోయింది బాధతో అరుస్తూ రక్తసిక్తమైన కాలుతో, నేలమీద పొర్లాడుతున్న ఆ కుక్కపిల్ల బాధను మదర్ థెరీసా చూడలేకపోయింది

దారినపోతున్న పెద్దవాళ్ళెవరూ దాని సంగతి పట్టించుకోవటం లేదు. మదర్ థెరీసా వెంటనే కార్యరంగంలోకి దిగింది తన చేతి రుమాలుతో దాని రక్తాన్ని తుడిచి కట్టుకట్టింది తరువాత దానిని ఒక పశువుల వైద్యుడి దగ్గరకు తీసుకెళ్ళి, మందు వేయించి దాన్ని ఒక క్రమంలోకి తెచ్చేవరకు ఆమె ఆగలేదు

తరువాత రెండు మూడు గంటలు ఆలస్యంగా ఇంటికి వచ్చిన కూతుర్ని తండ్రి మందలించగా ఆమె జరిగింది చెప్పింది

ఈ సేవాగుణమే ఆమె 1929లో భారతదేశంలో స్థిరపడేట్టు చేసింది. 1971లో బంగ్లా శరణార్థులకు, 1977లో ఆంధ్ర ప్రాంతంలోని దివిసీమ వాసులకు, అలాగే అసహాయులైన దీనులందరికీ 'విశ్వమాత'గా ప్రసిద్ధికెక్కి, 'నోబెల్ బహుమతి'తోపాటు, 'భారతరత్న' బిరుదాన్ని పొందింది

## మూర్తీభవించిన ఆత్మగౌరవం 'రామస్వామి చౌదరి'

త్రిపురనేని రామస్వామి చౌదరి గొప్ప హేతువాది, సంఘ సంస్కర్త

ఆయన, మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతుండగా ఇంగ్లాండ్‌కు ఉన్నత విద్యకోసం బయలుదేరారు యుద్ధం జరుగుతున్న రోజుల్లో ప్రమాదమని బంధువులు నిరోధించే ప్రయత్నం చేశారు. ఆయన వినలేదు లండన్‌లో ఆయన గాంధీజీని కలిశారు ఆ మహనీయుని దర్శనం ఆయన్నెంతో ప్రభావితం చేసింది.

లండన్‌లో రామస్వామిగారు నగరమంతా తిరిగి చూస్తుండగా, ఒకచోట ఆయనకు అవమానకరమైన బోర్డు ఒకటి కనిపించింది

"భారతీయులకు – కుక్కలకు ఈ హోటల్‌లో ప్రవేశము లేదు" అనేది ఆ బోర్డుమీద వ్రాసివుంది

"భారతీయులు మానవులే కదా!" – వాళ్ళను కుక్కలతో పోల్చటం ఎంత ఘోరం – అని, రామస్వామిగారు వెంటనే వెళ్ళి, ఆ హోటల్

యజమానితో వాదనకు దిగారు. రామస్వామిగారి వాదనా పటిమకు తట్టుకోలేని ఆ హోటల్ యజమాని, వెంటనే ఆ బోర్డు తీయించాడు. ఆయన ఆత్మగౌరవానికి ఇది ఒక ఉదాహరణ

ఆయన హోటల్లో బసచేసినప్పుడు 13 – నెంబరున్న గదిలోనే దిగేవారు. ఆ నెంబరు గది కావాలని స్వయంగా అడిగినపుడు, హోటలు వాళ్ళు ఆయన్ను దయ్యాన్ని చూసినట్టు చూసి భయపడేవారు అయినా ఆయన పట్టుదలతో అలాంటి నెంబరే ఎప్పుడూ కోరేవారు.

డబ్లిన్ జాతీయ కళాశాలలో ఆయన డిగ్రీ చదవటానికి వెళ్ళినప్పుడు "మీరు తలపాగాతో క్లాసుల్లో కూర్చోకూడదు", అంటూ అధికారులు ఆయనకు హెచ్చరించారు. "అయితే డిగ్రీ చదవటం మానుకుంటాను, తలపాగా మాత్రం తీయను" అంటూ, ఆయన తన ఆత్మగౌరవాన్ని మళ్ళీ ఒకసారి ప్రదర్శించారు.

## బాతుపిల్ల పట్ల జాలిపడ్డ - ఒలింపిక్స్ ఛాంపియన్

ఆస్ట్రేలియాకు చెందిన 'బాబీపియర్స్' ఒలింపిక్స్ పడవ నడిపే పోటీల్లో మొదటిసారి తన ఇరవయ్యోయేట పాల్గొంటున్నాడు అది 1928వ సంవత్సరం

ఆమ్స్టర్‌డామ్ నగరంలో ఆ పోటీలు జరుగుతున్నాయి ఒలింపిక్స్ పోటీల్లో చివరిదశలో ఫైనల్‌కు చేరిన పోటీదారులకు, చివరిస్థాయి పోటీ జరుగుతున్నది.

పోటీ నిర్వహణకు పెద్ద పొడవాటి సరస్సును ఎన్నుకోగా, దాని చుట్టూ జనం పెద్దగుంపులు గుంపులుగా వచ్చి చేరియున్నారు

బాబీపియర్స్ అంతకుక్రితం అలాటి అనేక పడవ పోటీల్లో పాల్గొని, అనేక ప్రథమ బహుమతులు పొంది రికార్డు స్థాపించే వున్నాడు

ఆ ఒలింపిక్స్ పోటీల్లో, కేన్‌మేయర్స్ అని పేరున్న మరో గొప్ప ఆటగాడు, అతనికి ఎప్పుడూ పోటీ తగులుతున్నాడు ఇద్దరూ ప్రతిదేశంలో 'నువ్వా – నేనా' అని పోటీ పడుతున్నారు

ఇక్కడ ఒలింపిక్స్ పోటీలో మళ్ళీ ఆ ఇద్దరే పోటీపడ్డారు. అయితే పోటీలో వేగంగా పడవను తెడ్లతో నడుపుతున్న బాబీపియర్స్‌కు సరస్సులో ఈదుతున్న పెద్దబాతు, దానిపిల్లలు అడ్డం వచ్చాయి.

ఆ పడవ వేగానికి పడవ తగిలితే బాతుపిల్లలు చచ్చిపోతాయి. పడవ వేగం తగ్గిస్తే, తను ఒలింపిక్స్ పోటీల్లో ప్రధమస్థానం కోల్పోతాడు. అది తన దేశానికే ఎంతో నామోషీ!

అయినా, బాబీపియర్స్ తన పడవను ఆ బాతు తన పిల్లలతో దాటిపోయేంతవరకు ఆపివేశాడు కాస్సేపటిలో అవి అతని పడవ మార్గం నుంచి దాటిపోగానే, రెట్టించిన వేగంతో తన పడవను నడిపి ఒలింపిక్స్ పోటీలో ప్రధమస్థానం పొంది రికార్డును స్థాపించాడు. తరువాత 1945న ఆయన క్రీడారంగం నుండి విరమించుకునేవరకు అతనే ఎప్పుడూ వరుసగా పడవపోటీల్లో బంగారు పతకాలు సాధించాడు.

## పరుగులరాణి పయోలీ ఎక్స్‌ప్రెస్ - పి. టి. ఉష

కేరళలోని స్కూల్లో ఒకరోజు, సాయంత్రం కొందరు పిల్లలు కలసి దాగుడుమూతలు ఆడుకుంటున్నారు.

స్కూలు పిల్లల ఆటలు పర్యవేక్షిస్తూ, తక్కిన పిల్లలకు పరుగుపోటీలు పెట్టి వాళ్ళ ప్రతిభను పెంచటానికి కృషిచేస్తున్నాడు, ఆ స్కూలు వ్యాయామ విద్య నేర్పే బాలకృష్ణన్ అనే అధ్యాపకుడు

ఇంతలో ఆయన దృష్టి, అనుకోకుండా, లేడిపిల్లలా, వదిలిన బాణంలా దూసుకుపోతూ, పరుగులు పెడుతున్న పదేళ్ళ పిల్ల మీద పడింది.

పదేళ్ళ ఆ పాప సన్నగా, పొడుగు కాళ్ళతో, మెరుపువేగంతో దాగుడు మూతలు ఆడుతూ, పరిగెడుతోంది ఆ పాపను పట్టుకోడానికి తక్కిన పిల్లలు ఆమె వెంట పరిగెత్తలేకపోతున్నారు! ఆమె కాళ్ళలో విద్యుత్ వుందా?

వెంటనే వ్యాయామ అధ్యాపకుడు బాలకృష్ణన్ ఆ అమ్మాయిని ఆపి ఆమె పేరు 'ఉష' అని తెలుసుకుని, ఆమెను పరుగుపందెంలో పాల్గొనమని ప్రోత్సహించాడు పరుగుపోటీల్లో, 1975 జిల్లాస్థాయిలో, ఉష ప్రధమంగా వచ్చింది 1977లో కేరళరాష్ట్రంలో జరిగిన పోటీల్లో పరుగులో ప్రప్రధమ స్థాయి పొంది బంగారు పతకం సాధించింది ఆమె రాష్ట్రస్థాయి నుంచి 1979లో జాతీయ స్థాయి వందమీటర్ల పోటీలో, హైదరాబాద్‌లో 12 9 సెకండ్లల్లో ప్రధమ స్థానంలో నిలిచి, బంగారు పతకం గెలిచింది

1980 మాస్కో పోటీల్లో ఒలింపిక్స్ చాంపియన్ అయింది. 1982 ఆసియా క్రీడల్లో వెండి పతకం, అలాగే మూడుసార్లు ఒలింపిక్స్‌లో, మనదేశానికి ప్రతినిధిగా వివిధ పోటీల్లో ఆమె 56సార్లు పాల్గొని 55 పతకాలు గెలిచింది 1983లో ఉత్తమ క్రీడాకారులకిచ్చే 'అర్జున అవార్డు'. 1985 'పద్మశ్రీ' ఇచ్చి ప్రభుత్వం ఆమెను గౌరవించింది. షైనీ విల్సన్, వలసమ్మ, అశ్వనీ నాచప్ప, లాంటి క్రీడాకారులకు ఆమె స్ఫూర్తి నిచ్చింది.

## పికాసో మిత్రుడికి చేసిన సాయం

ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడు 'పికాసో' జీవితంలో మరపురాని సంఘటన ఒకటి జరిగింది.

అతనికి అప్పటికే, ప్రసిద్ధ చిత్రకారుడిగా పెద్ద పేరు ప్రతిష్టలు వున్నాయ్

అతని ఆప్తమిత్రుడొకడు, విదేశాలకు వెళ్ళటానికి ఖర్చులకు డబ్బులేక, పికాసోను డబ్బు అప్పుగా అడుగాలని వచ్చాడు

ఆ విషయం స్వాభిమానంతో బయటికి చెప్పలేక, చివరికి వెళ్ళబోతూ తన ఆర్థిక అవసరం చెప్పాడు

పికాసో చేతిలో కూడా అప్పుడు డబ్బులేదు మరోమార్గం లేక వెంటనే పికాసో అక్కడ బల్లమీద ఉన్న తీగని తీసుకుని, దాన్ని మెలికలు తిప్పి, దాన్ని ఓ అందమైన బొమ్మగా మలిచాడు తరువాత ఆ తీగబొమ్మని అట్టకు తగిలించి, తన సంతకం కూడా తీగబొమ్మ క్రింద వచ్చేట్టు చేశాడు.

దాన్ని మిత్రుడికి ఇచ్చి "ఈ తీగబొమ్మను నేను తయారుచేశానంటే ఎవరైనా కొంటారు. పైగా రంగులతో కేన్‌వాస్ మీద బొమ్మలు వేసే నేను మొట్టమొదటిసారి ఇలా తీగతో బొమ్మ మలిచానంటే . దానికో ప్రత్యేకమైన డిమాండ్ వుంటుంది బాగా డబ్బు ఇచ్చికొనగలిగే వ్యక్తికి ఇది అమ్మి, నీ అవసరం తీర్చుకో!" అని సలహా ఇచ్చాడు.

అలాగే, ఆ మిత్రుడు, ఆ తీగబొమ్మని అమ్మి తన అవసరం తీర్చుకున్నాడు.

తన చిత్రకళా ప్రతిభతో తన మిత్రుడిని ఇబ్బందినుంచి గట్టెక్కించినందుకు పికాసో సంతోషించాడు

## చాప్లిన్ జీవితాన్ని ప్రభావితం చేసినటువంటి సంఘటన

ప్రపంచ చలనచిత్ర చరిత్రలో శాశ్వతంగా నిలిచే కథలతో, సజీవ మానవజీవిత చిత్రణ చేసి, తనే కథ, దర్శకత్వం, నటనతో, సంగీతం కూడా సమకూర్చుకుని, 'ది కిడ్ (పసివాడు)', 'సిటీ లైట్స్' (నగర దీపాలు), 'మోడరన్ టైమ్స్' (అధునిక కాలం), 'ది గ్రేట్ డిక్టేటర్' (గొప్ప నియంత) వంటి మంచి చిత్రాలు నిర్మించటానికి మూలమైన విచిత్ర సంఘటన ఒకటి, చార్లీచాప్లిన్ జీవితంలో, బాల్యదశలో జరిగింది

అప్పుడు ఘోర దారిద్ర్యంతో బాధపడుతున్న చాప్లిన్ వుండే వీధిలో చివర ఒక వధ్యశాల వుండేది అక్కడ, రోజూ గొఱ్ఱెలను తోలుకుపోయి వధించేవాళ్ళు

ఒకరోజున ఒక గొఱ్ఱెపిల్ల వధ్యశాల నుండి తప్పించుకు పారిపోయింది అది ఎవరికీ చిక్కకుండా రకరకాలుగా పరిగెత్తి ప్రాణభయంతో అరుస్తూ అటూ – ఇటూ గెంతసాగింది

అలా దొరకకుండా పరిగెత్తే దాని ప్రయత్నాన్ని చూసి, అందరూ నవ్వసాగారు చార్లీకి కూడా ఈ తంతు భలే వినోదాన్ని కలిగించింది

అయితే చివరికి ఆ గొఱ్ఱెపిల్ల పట్టుబడగానే, అది ప్రాణభయంతో అరుస్తున్నా దాన్ని పట్టుకుపోయి చంపుతారన్న ఊహరాగానే చాప్లిన్ పెద్దగా ఏడ్చుకుంటూ, తల్లిదగ్గరకు పోయి "వాళ్ళు దాన్ని చంపేస్తున్నారు వాళ్ళు దాన్ని చంపేస్తున్నారు", అని చెప్పుకుని, ఆమె మీద పడి ఏడ్చాడు

ఆ రోజు జరిగిన సంఘటనలో, వినోదాన్ని కలిగించిన సన్నివేశం, విషాదంగా మారినస్థితి అతన్ని జీవితాంతం వెంటాడింది ఆ వినోద, విషాద సంఘటనే, భవిష్యత్తులో, హాస్యం, కరుణతో కూడిన ఆయన చిత్రాలకు పునాదయ్యింది

ఈ సంఘటన, చాప్లిన్ జీవిత చరిత్రలో ఆయనే స్వయంగా వ్రాసుకున్నాడు

## పిచ్చికుక్క కాటు మందుకు ప్రేరణ

అప్పుడు లూయీ పాశ్చరు వయసు పదిహేనేళ్ళు అతనొక సంఘటన చూశాడు ఆ సంఘటన అతని ఆలోచనా సరళిని, జీవిత మార్గాన్నే పూర్తిగా మార్చివేసింది

ఒకరోజు లూయీ పాశ్చరు స్కూలు నించి వస్తున్నాడు అక్కడ కుక్కకాటుకి నాటువైద్యం చేస్తున్న వైద్యుడి దురాగితం కంటపడింది

లూయీ పాశ్చరు, ఆ నాటు వైద్యుడు వైద్యం ఎలా చేస్తాడో కుతూహలంగా చూశాడు

నలుగురు వస్తాదుల వంటి దృఢకాయులు, కుక్క కరచిన పిల్లవాడిని కదలకుండా గట్టిగా పట్టుకున్నారు అప్పటికే ఎఱ్ఱగా కాల్చిన ఇనుపచువ్వతో కుక్క కరచిన చోట వాత పెడుతున్నాడు

ఆ బాధను తాళలేక పిల్లవాడు గోలపెట్టి భయంకరంగా అరుస్తూ ఏడుస్తున్నాడు చుట్టూ వున్న జనం అతని బాధను వినోదిస్తూ చూస్తున్నారు

ఆ దృశ్యం చూసిన పాశ్చర్ "కుక్కకరిస్తే ఇంతఘోరమైన వైద్యమా? ఇదే వైద్యమైతే ఎవరు మాత్రం చేయించుకుంటారు? ఇంత బాధలేకుండా కుక్కకాటుకి ప్రత్యమ్నాయ వైద్యం సులభపద్ధతిలో వుండదా?" అంటూ ప్రశ్నించుకున్నాడు

ఆ రోజు, ఆ నాటు వైద్యానికి ప్రత్యామ్నాయం కనిపెట్టాలని గట్టిగా అనుకున్న లూయీ పాశ్చర్, నిజంగానే తరువాత, కుక్కకాటుకి – ముఖ్యంగా పిచ్చికుక్క కరచిన మనిషికి, 'రాబిస్' వ్యాధి పిచ్చికుక్క నోటిద్వారా వచ్చే లాలాజలం వల్ల కలుగుతుందని గ్రహించి, కుక్కకాటుకు నిరపాయంగా వాడేమందు కనిపెట్టాడు

## "రూల్స్ రూల్సే" అని చెప్పిన విశ్వేశ్వరయ్య

భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య విదేశీ పర్యటనకు సిద్ధమయ్యారు

ఆయనకు ఖర్చులకు డబ్బు కావలసివుంది మైసూర్ బేంక్ మేనేజర్‌కు ఫోన్‌చేసి తను 11–15 నిముషాలకు బేంక్‌కు వస్తున్నట్లు చెప్పారు

విశ్వేశ్వరయ్యగారు వెళ్ళేసరికి బ్యాంకు మేనేజర్ స్వయంగా వచ్చి ఆయనను తన గదిలోకి ఆహ్వానించాడు దరఖాస్తు ఫారాలు మేనేజర్ ఇవ్వగానే "నేను ప్రభుత్వ బాండ్‌లను తాకట్టుగా పెడుతున్నాను" అన్నారు విశ్వేశ్వరయ్య, తమ బ్రీఫ్‌కేసులో నుంచి కాగితాలు తీసి ఇస్తూ

"ఇదేమిటి సార్! ఈ మైసూర్ బ్యాంక్ స్థాపకులు మీరే! మీరు తాకట్టు పెట్టి డబ్బు అప్పుగా తీసుకోవటమా? ఈ బ్యాంకు మీదే! మీరు ప్రభుత్వ బాండ్‌లు తాకట్టు పెట్టి అప్పు తీసుకోవటమేమిటి? మీ పేరే పెద్ద 'బాండ్'" అంటూ, బాండ్ కాగితాలు వెనక్కు ఇచ్చివేశాడు

"బ్యాంకు స్థాపకుణ్ణే నేనయినా - బ్యాంకు నిబంధనల ప్రకారం నడుచుకోవటమే నాకు ఇష్టం నేను తీసుకుంటున్న రుణం తీర్చాకే నా బాండ్‌లు తిరిగి తీసుకుంటాను" అన్నారు విశ్వేశ్వరయ్య

ఇక లాభం లేదని, మేనేజర్ వడ్డీ 3-1/2 శాతం వేయటంతో "ఇదేమిటి ఇంత తక్కువ శాతం వడ్డీ వేశారు నాకు ఎటువంటి మినహాయింపు వద్దు అందరితోపాటే నేనూ!" అన్నారు విశ్వేశ్వరయ్య

"నా సుదీర్ఘ అనుభవంలో, ఎక్కువ వడ్డీ వేయమని కోరిన వ్యక్తి మీరొక్కరే సార్!" అంటూ మేనేజర్ తన వంతు పని పూర్తిచేశాడు

## రచయిత విలువ తెలిసిన 'భారతకోకిల'

'భారతకోకిలగా', ప్రసిద్ధురాలైన సరోజినీదేవి, డెబ్బయి ఏళ్ళ వయసులో ఉత్తరప్రదేశ్‌కు గవర్నరుగా నియమితులైన వార్త వినగానే "గానకోకిలకు పంజరమా?" అన్నది నవ్వుతూ ఆమె

అయితే, ఆమె తక్కిన గవర్నర్ల వలె రాజభవనంలో ఆడంబరాలు ప్రదర్శిస్తూ కూర్చోలేదు ఎక్కడికి వెళ్ళాల్సివచ్చినా ఆమె అట్టహాసంగా వెళ్ళేదికాదు

సింహాసనం మీద అధికారం ప్రదర్శిస్తూ, కూర్చోవటం ఆమె నైజానికే వ్యతిరేకం

ఆమె స్వయంగా కవయిత్రి, కళాకారిణి కావటంతో, ఆమె మనసు ఎక్కువ రచనలు చేసే రచయితల వైపే మొగ్గేది

ఆమె ఎంత అనారోగ్యంతో వున్నా, గవర్నర్‌గా ఎన్ని కార్యభారాలున్నా, నిత్యపఠనం చేయటం ఆమె దినచర్యలో అతి ముఖ్యభాగం

ఒకసారి ఒక సైంటిస్టు, ఒక పెద్ద జడ్జీ భార్య, ఒక డ్యాన్సర్, కొందరు ప్రభుత్వోద్యోగులు, హైదరాబాద్ నుంచి వచ్చిన కాంగ్రెస్ నాయకులు ఆమె చుట్టూ గుంపుగా వున్నారు

అందరినీ పది నిముషాలు ఆగమని "ఎన్నో ఆకలిబాధలు" అనే భట్టాచార్య వ్రాసిన పుస్తకం చాలా బాగుంది, భట్టాచార్య చిరునామా ఏమిటి? ఆయనకు అభినందనలు తెలుపుతూ ఒక ఉత్తరం వ్రాసి, తరువాత తక్కిన కార్యక్రమాలు" అంది.

ఆమె రచయిత్రి కావటంతో, రచయిత విలువ ఆమెకే తెలుసు.

## కరుణానిధి విసరిన ఛలోక్తి

డీ.యం.కె. పార్టీ ముఖ్యమంత్రిగా ప్రత్యేకత కలిగిన కరుణానిధి, శ్రీ అన్నాదొరై ప్రముఖ శిష్యుడు. ఇద్దరూ ప్రముఖ సినీ కధా సంభాషణా రచయితలుగా, తమదైన బాణీని ప్రదర్శించారు.

రచయితగానే కాక, ఆయన ప్రసంగాలు, శ్రీ అన్నాదొరై ప్రసంగాలులా జలపాతపు దూకుడుతో, శ్రోతలను అకట్టుకుంటాయి.

రాజకీయాలలో కీలెరిగి వాత పెట్టడంలో ఆయన గొప్ప 'కళాకారుడు' (కలైంజర్)

అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీకి, కరుణానిధికి పడేది కాదు. ఆయన డి.యం కె. ప్రభుత్వాన్ని కూలదోయాలని ఆమె ప్రయత్నించని క్షణం లేదు

ఈ పని మీద ఆమె, సి. సుబ్రహ్మణ్యం, మోహన కుమార మంగళం వంటివారిని మద్రాసుకు తరచూ పంపిస్తూ వుండేది.

ఒకసారి ఒక పత్రికా విలేఖరి, పై యిద్దరు వ్యక్తులను గురించి అడిగినపుడు, కరుణానిధి విసిరిన ఛలోక్తి మాత్రం చరిత్రకెక్కింది.

ఈ విషయమై కరుణానిధి, ఈ జంట విదూషకులను గురించి చెబుతూ, "అవు – నిశ్శబ్దముగానే వుంది! కాని లేగదూడలు మాత్రం ఆగంగా అటూ – ఇటూ పరుగెత్తి గోలచేస్తున్నాయి" అని అన్నాడు.

అప్పటి కాంగ్రెస్ ఎన్నికల చిహ్నం 'అవు–దూడ' కావటంతో, కరుణానిధి చెప్పిన పోలిక అతికినట్టు సరిపోయింది. అయన ఇందిరాగాంధీని అవుతో పోల్చారు.

# కంప్యూటర్లనే ఛాలెంజ్ చేసే కంప్యూటర్

1944 ప్రాంతంలో మూడేళ్ళ పసిపాప తన తండ్రితో, వివిధ గారడీలు చేస్తూ, బెంగుళూరు నగర వీధుల్లో జీవనోపాధి సంపాదించుకోడానికి కృషి చేస్తున్నది.

చిన్నతనంలోనే ఆ పాప, వాళ్ళ నాన్న ఎన్ని పేకముక్కలు ఎవరెవరికి ఏ క్రమంలో పంచాడో, జనాన్ని ఆశ్చర్యపరచేట్టుగా చెప్పేది. ఆ రోజుల్లో ఒక్కో గారడీకి, నెలరోజుల ప్రదర్శనలో, ఎంత డబ్బు వసూలైందీ చెప్పేది.

ఆరేళ్ళ వయసులో ఆ పాప, తన తండ్రితోపాటు సర్కస్ కంపెనీలో జంతువులు, పక్షులు చేసే వింత వింత విన్యాసాలు జనాన్ని వినోదపరచినట్టే, అంకెలతో వినోదాన్ని ఎందుకు అందించలేము - అనే ప్రశ్న ఆమెలో తలఎత్తి, అంకెలతో పరిశోధనలు చేస్తూ జనాన్ని అంకెలతో వినోదపరచి, సంభ్రమాశ్చర్యాలలో సభికుల్ని ఆశ్చర్యచకితుల్ని చేయసాగింది.

ప్రాథమిక పాఠశాల చదువుకూడాలేని ఆ అమ్మాయి, అక్షరాలు - అంకెలు దిద్దని ఆ అమ్మాయి, "అంతర్జాతీయ గణితశాస్త్ర అధ్యయన కేంద్రాన్ని" స్థాపించింది ఆ అమ్మాయే 'మానవ కంప్యూటర్'గా ప్రసిద్ధిపొందిన శకుంతలాదేవి.

వరుసగా పదమూడు అంకెలూ, పదమూడు అంకెల గుణకారాన్ని కంప్యూటర్‌కన్నా వేగంగా చేసి 'గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'లో పేరు నమోదు చేసుకుంది

ఆమె ప్రపంచంలో ప్రదర్శన ఇవ్వని దేశం, తన గణిత ప్రతిభతో టి.వి. ప్రేక్షకుల్ని ఆశ్చర్యపరచని సందర్భం లేదు. ఈమె తల్లిదండ్రులకు 14వ సంతానం, పైగా కట్టకడపటి పిల్ల.

అయితే కంప్యూటర్‌ల కంటే వేగంగా, కచ్చితంగా లెక్కలు చేయగల ఈమె, ఎదుటి గణిత శాస్త్రవేత్త ఇచ్చిన లెక్క అతను పూర్తి చేస్తుండగానే, ఠక్కుమని కచ్చితమైన సమాధానం చెప్పగల ఈమె, మన భారతవనిత కావటం మనకు గర్వకారణం.

## శ్రీ ముట్నూరివారు ఆడిన వేళాకోళం

ప్రముఖ పత్రికా రచయిత శ్రీ ముట్నూరి కృష్ణారావు, కలకత్తాలో విద్యార్థిగా చదువుకుంటున్నప్పుడు తన సహచరుడితో తమాషా అయిన వేళాకోళం ఆడారు.

ముట్నూరి వారి మిత్రుడు, ముట్నూరివారు, చిన్నగదిలో చెరో చాప పరచుకొని నిద్రిస్తూ వుండేవారు. ఆ మిత్రుడు సన్నగా గడకర్రలా వుండటంతో, నేలమీద పడుకోడానికి బాధపడుతూ "ఏదైనా చిన్న మంచం వుంటే బాగుండునోయ్ కృష్ణారావ్!", అంటూ వుండేవాడు

మిత్రుణ్ణి ఆటలు పట్టించటానికి కృష్ణారావు గారు కలకత్తాలో, శవాలను మోసుకుపోవటానికి వాడే మంచం ఒకటి చౌకలో కొని తెచ్చి మిత్రుడికి ఇచ్చారు. "ఇది చిన్నదిగా వుంది! అయినా ఎలాగో సరిపెట్టుకుంటాలే, ఏం చేస్తాను" అంటూ గొణుగుతూ ఆ మిత్రుడు ఆ మంచం మీదే గాఢనిద్రలోకి జారుకున్నాడు.

తరువాత కృష్ణారావుగారు నిద్రపోతున్న మిత్రుడి మీద తెల్లటి దుప్పటి కప్పి నలుగురు మిత్రులను పిలిచి చూపారట.

వాళ్ళంతా నిర్ఘాంతపోయి, బాధతో "పాపం, రాత్రిదాకా బాగానే వున్నాడుగా ఇంతలో ఏం ముంచుకొచ్చింది!? వాళ్ళ వాళ్ళకు టెలిగ్రాం ఇచ్చి పిలిపిద్దాం", అంటూ హడావిడి చేశారు.

ఇంతలో ఆ మిత్రుడు మెల్లిగా కదలిలేచి కూర్చొని "ఏమిటీ! ఏదో హడావిడిగా వున్నారు?" అంటూ, అడగగానే –

కృష్ణారావుగారు, "మేమింకా అదృష్టవంతులం! బ్రతికేవున్నాడురా!" అంటూ మిత్రుణ్ణి కావలించుకుని, ముసిముసి నవ్వులు నవ్వారు ఆయన చేసింది వేళాకోళం అని తెలిసి అందరూ నవ్వుకున్నారు.

## ఆదర్శనాయకుడు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య

కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య బహుముఖ ప్రజ్ఞాశాలి మహోన్నతమైన మార్క్స్ సిద్ధాంతం మానవజాతి విముక్తికి మార్గమని, దాన్ని ప్రజా విప్లవం ద్వారా సాధించాలని, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం సాగించిన ఆదర్శనాయకుడు.

ఒకసారి ఆయన వున్న పిండిప్రోలు ప్రాంతం దగ్గర ఒక విచిత్రమైన సంఘటన జరిగింది.

రెండు రోజులు విపరీతమైన వర్షం, ఎడతెరపి లేకుండా కురిసింది. పాలేరు ప్రక్కనున్న చింతలతోపులో రహస్యవీరులు, సుందరయ్య గారి నాయకత్వంలో మకాం చేసివున్నారు. డోరియారేకులు తెచ్చి చెట్లకు చుట్టూ అనించి నిలబెట్టారు. పైన చెట్లపైన కోతులు, ఆ రేకుల క్రింద చలిలో, ఆకలి బాధతో మునగతీసుకున్న రైతాంగ పోరాట వీరులు. అప్పుడప్పుడు ఆ కోతులు వదలిన అశుద్ధం రేకుల మీద, విప్లవకారుల మీద పడేది. మూడవరోజున వర్షం ఆగినా, పాలేరు మాత్రం ఫర్లాంగు వెడల్పున పొంగి, పారలి పరవళ్ళు తొక్కుతోంది. గడ్డితుప్పలు కొట్టుకొని వస్తూంటే, అందరూ చూస్తున్నారు.

ఇంతలో సుందరయ్యగారు ఆ పరవళ్ళు తొక్కే నది నీటిలోకి దిగి, పెనవేసుకుపోతున్న గరికగడ్డిని వాటబట్టి, ఒడ్డుకు చేరవేస్తూ, తక్కిన విప్లవ యోధుల్ని అలాగే చేయమన్నారు

అంతా ఆ పని పూర్తి చేశాక, సుందరయ్యగారు గరికవ్రేళ్ళు కొరికి తింటూ, “ఈ గరికవేళ్ళు తియ్యగా వుంటాయి. కడుపులో ఎత్తులేని యిలాంటి సమయంలో శత్రువు దాడిచేస్తే తప్పుకునే ఓపిక మనందరికీ ఉండాలిగా! ఆ శక్తి ఈ గరిక వ్రేళ్ళకుంది. తిందాం పట్టండి” అంటూ ముందు ఆయన అందరికీ మార్గదర్శకుడయ్యారు.

సాయుధ దళాలు తమ ఆహారసమస్యను ఒక్కోసారి ఎలా తీర్చుకో వలసివుంటుందో చెప్పటానికే ఈ ఉదాహరణ.

## ‘గురుదేవోభవ’ అని ఆచరించిన డా॥ రాధాకృష్ణన్

ప్రసిద్ధ తత్త్వవేత్తగా, ఉత్తమ ఉపాధ్యాయుడిగా, ప్రముఖరచయితగా దేశ విదేశాలలో ఖ్యాతి గడించిన డా॥ రాధాకృష్ణన్‌కు చిన్నప్పటి నుంచే అధ్యాపకులంటే ఎంతో గౌరవం, భక్తి వుండేది.

ఆయన అతి చిన్న వయసులో ప్రొఫెసర్ అవటమేకాక, తన బహుముఖ ప్రజ్ఞతో తన విద్యార్థులను ఎంతో ప్రభావితం చేశాడు

ఆయన మైసూరు విశ్వవిద్యాలయం నుంచి వీడ్కోలు తీసుకుంటున్న సందర్భంగా ఆయన విద్యార్థులు ఆయన ఎక్కిన గుఱ్ఱపు బండి గుఱ్ఱాలను తొలగించి, వారే ఆ బండిని లాగుతూ, ఆయనను స్టేషనుకు చేర్చారు. 'గురుదేవోభవ' అనే ఆర్యోక్తి ఆయనపట్ల అలా నిజమైంది.

అలాగే ఆయన స్కూలులో చిన్న విద్యార్థిగా వున్నప్పుడు జరిగిన సంఘటన ఆయన తన గురువును ఎంత గౌరవించాడో తెలుపుతుంది.

రాధాకృష్ణన్ క్లాసులో ఒక విద్యార్థి, క్లాసు అధ్యాపకుడు కూర్చునే కుర్చీకి తారుపూసి అధ్యాపకుణ్ణి ఏడిపించాడు.

ఆ పని చేసింది ఎవరో తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో "ఎవణ్ణా ఈ తప్పు చేసింది?" అంటూ అధ్యాపకుడు క్లాసును ఉద్దేశించి అడిగాడు, గుడ్లెర్రజేస్తూ.

ఎవరూ చెప్పటానికి ముందుకు రాలేదు. అప్పుడు రాధాకృష్ణన్ ఆ తప్పు చేసిన పిల్లవాడి పేరు చెప్పి, కుర్చీని, తాను శుభ్రం చేసి, ఆ పిల్లవాడిని శిక్షించవద్దని ప్రార్థించాడు.

తరువాత నేరంచేసిన విద్యార్థి ఆయనను బయట తన్నబోతే "నేను చెప్పకపోతే ఇదే తప్పును నువ్వు మళ్ళీ చేస్తావు!" అంటూ ఆ విద్యార్థికి జ్ఞానోదయం చేశాడు, రాధాకృష్ణన్.

## ఎన్.టి.ఆర్.కు చక్రపాణి 'గీతా'బోధ

సినిమారంగానికి వచ్చిన కొత్తలోనే ఒక ప్రక్క గ్లామరు పాత్రలు, హీరోకు ప్రాధాన్యత ఉన్న పాత్రలు వేస్తూనే, రామారావు వయసుమళ్ళిన పాత్రలు వేయటం ప్రారంభించారు. "పిచ్చిపుల్లయ్య", "తోడుదొంగలు" రామారావు స్వంత చిత్రాలే – అందులో ఆయన వయసు మళ్ళిన పాత్రలు వేశారు

అయితే, అలా ముసలిపాత్రలు వేయటం ప్రముఖ రచయిత, 'విజయా' నిర్మాత చక్రపాణిగారికి ఇష్టం ఉండేదికాదు.

'భీష్మ' చిత్రం విడుదలై, వయసుమళ్ళిన పాత్రలో భీష్ముడుగా, రామారావు 'నభూతో న భవిష్యతి' అనేట్టు చేశారని ఆబాలగోపాలం కొనియాడారు

ఇదే విషయం చక్రపాణిగారితో చర్చకు వస్తే "చివరి సీనులో నన్ను జనం గుర్తుపట్టలేక పోతున్నారండి" అన్నాడు, రామారావు, సమర్థించుకుంటూ. "నిన్ను గుర్తుపట్టకపోతే ఆ వేషం నువ్వు వేయటం ఎందుకు? ఆ వేషం ఎవరైనా వెయ్యవచ్చుగా గడ్డాలు, మీసాలు పెట్టుకుని" అని, అన్నారు చక్రపాణిగారు.

'సతీ తులసి'ని డైరెక్ట్ చేస్తున్న విక్టరీ మధుసూదన రావుగారికి సాయం చేయటానికి, అందులో రామారావు, ఎస్.వి రంగారావు పోటాపోటీగా నటించారు.

ఆ సినిమా రషెస్ చూసిన చక్రపాణి "ఇలాంటి రాక్షసవేషాలు నువ్వు వేయకు! నిన్ను దుర్మార్గుడిగా చూడటం జనానికి ఇష్టం వుండదు. పైగా రంగారావుతో పోలిస్తే నీకు మార్కులు పడవు!" అంటూ రామారావుకు 'గీతో'పదేశం చేశారు.

## లియోనార్డో చిత్రకారుడిగా ఎదుర్కొన్న సమస్య

ప్రపంచ ప్రసిద్ధి చిత్రకారుడు, ఇటలీకి చెందిన లియోనార్డో డావిన్సీ చిత్రించిన చిత్రాల్లో చరిత్రకెక్కిన చిత్రాలు మూడు.

'వర్జిన్ ఆఫ్ ది రాక్స్', 'మొనాలిసా', 'ది లాస్ట్ సప్పర్' అనేవి, ఈ మూడు చిత్రాల్లో 'మొనాలిసా' చిత్రం ఎందరో కవులకు, చిత్రకారులకు ఎన్నో రచనలు, చిత్రాలు చిత్రించటానికి స్ఫూర్తినిచ్చింది. ఏ భావంతో, ఎలా చూస్తే ఆ భావంతో అలా కనిపించటం ఈ 'మొనాలిసా' చిత్రం ప్రత్యేకత ఈ 'మొనాలిసా' చిత్రాన్ని మక్కీకి మక్కీ కాపీ చేసిన చిత్రకారులు కొందరు, అది లియోనార్డో చిత్రించిన అసలు చిత్రమేమంటూ, దాన్ని ఇతర దేశాల చిత్రకళా నిలయాలకు అమ్మి లక్షలకు లక్షల డాలర్లు గడించారు.

ఏసుక్రీస్తు తను శిలువ ఎక్కడానికి ముందు తన పదముగ్గురు శిష్యులకు చివరిసారిగా, 'ది లాస్ట్ సప్పర్' అనే విందు ఇచ్చారు. గురుద్రోహం చేసే క్రీస్తు శిష్యుడు ఆ విందులో ఆయన ప్రక్కనే వున్నాడు

ఊహించి వేసే చిత్రమైనా, గురుద్రోహం చేసే ఆ శిష్యుడి కళ్ళలో కనిపించే నమ్మకద్రోహం, ముఖంలో క్రౌర్యం, చిత్రించటానికి మంచి

'మోడల్'గా వుండే వ్యక్తి కోసం కొన్ని నెలలపాటు అన్ని ప్రాంతాలు తిరుగుతూ వెతికాడట, లియోనార్డో.

ఎన్నాళ్ళు చూసినా ఏసుక్రీస్తు ప్రక్కనున్న శిష్యుడి ముఖం మాత్రం చిత్రించని లియోనార్డోని ఆ చిత్రం చిత్రించమని కోరిన పోప్ అడిగితే "ఏసుక్రీస్తు అంతటి కారణజన్ముణ్ణి మోసం చేసి, నమ్మక ద్రోహిగా మారే శిష్యుడి ముఖ కవళికలున్న వ్యక్తి ఎలా వుంటాడో ఊహించలేక, అలాంటి సజీవవ్యక్తి కోసం వేచి వున్నాను," అని అన్నాడు లియోనార్డో అది అతని కళ పట్ల వున్న భక్తి చివరికి అలాటి వ్యక్తి కనిపించగానే ఆ చిత్రం పూర్తి చేశాడు

## భర్తకు చురక అంటించిన శ్రీమతి బెర్నార్డ్ షా

జార్జ్ బెర్నార్డ్ షా, ప్రముఖ ఆధునిక ఆంగ్లనాటక రచయిత ఆయన ఇంగ్లీషు రచనాశైలి, ప్రపంచ ప్రసిద్ధం

అయితే, ఆంగ్లభాషంటే ఆయనకు ఎంత అభిమానమంటే, ఆయన సాహిత్యానికి లభించిన 'నోబెల్' బహుమతి ద్వారా వచ్చిన పైకాన్నంతా 'బెర్నార్డ్ షా' – ఆంగ్లభాషా గుణింతము (Spelling) సంస్కరించే సంఘానికి దానంగా ఇచ్చివేశాడు

ఆంగ్లభాష నేర్చుకునే వారికి, ఆంగ్లభాషలో ఉన్న ముఖ్య అవరోధం, 'స్పెల్లింగ్'తో వచ్చే తలనొప్పి – అని ఆయన చిన్నతనంలోనే, అనుభవముతో అర్థం చేసుకున్నాడు.

ఆంగ్లపదాల్లో వ్రాసేప్పుడు మాత్రం ఉండి, పలకకుండా వుండే అక్షరాలు ఉండటం వల్ల ఎంత చికాకో, మనకందరికీ అనుభవమే కదా!

ఒకసారి షాకు ఒక ఉత్తరం వచ్చింది

ఆ ఉత్తరం మీదున్న చిరునామాలో 'షా' అని ఉండవలసిన చోట 'Shaw' – బదులు – 'Shawm' అని వ్రాసివుంది

షాకు ఉత్తరం, అలా చిరునామా వ్రాసింది, ఒక కరెస్పాండెంట్! అతను బాగా చదువుకున్నవాడే! ఆ తప్పుకు, ఇక షాకు కోపం ఆగక "ప్రపంచ ప్రసిద్ధ నాటక రచయితనైన, నాపేరే తప్పుగా వ్రాస్తాడా పైగా 'Shaw' బదులు 'Shawm' అని వ్రాశాడు అసలు ఇలాంటి పదం ఎక్కడైనా వుందా?" అని భార్యను అడిగాడు

ఆమె మరోమాట లేకుండా, షాను తీసుకెళ్ళి డిక్షనరీ తీసి చూపి 'Shawm' – అనే పదం వుంది! "దానికి 'గాలి కొట్టడానికి పనికొచ్చే పాతకాలపు పరికరము' – అని అర్థం వుంది" అన్నది

తన భర్త పాతభావాల మనిషి అంటూ, భర్తకే ఆమె కాస్త చురక అంటించింది

## ఇలాంటి చిన్నపనా ప్రచారం కోసం చేసేది?

క్రికెట్ ఆటను గురించి తెలిసిన వాళ్ళల్లో, నవానగర్ మహారాజయిన, రంజింత్‌సింగ్‌ను గురించి తెలియని వారుండరు

ప్రపంచ క్రీడాచరిత్రలో, అఖండమైన ఖ్యాతిని ఆర్జించిన వాళ్ళల్లో రంజింత్‌సింగ్ ఒకడు.

ఇంగ్లాండ్‌లో రంజింత్‌సింగ్ క్రికెట్ ఆట ఆడినప్పుడు, ఆయన బ్యాటింగ్ ప్రతిభకు ముగ్ధులైన అక్కడి అభిమానులు ఆయనకు, 'రంజి' అంటూ ముద్దుపేరు పెట్టారు

'రంజి ట్రోఫీ' ఆ ప్రముఖ ఆటగాడి పేరున పెట్టిందే

ఈ రంజింత్‌సింగ్ గారి మేనల్లుడూ మంచి క్రికెట్ ఆటగాడే

అతను ఇంగ్లాండ్‌లోని, కేంబ్రిడ్జిలో విద్యార్థిగా చదువుతున్నప్పుడు, ఒక చిన్న తమాషా సంఘటన జరిగింది

ఒకసారి దులీప్‌సింగ్, రాత్రిపూట లైటు లేకుండా సైకిల్ తొక్కుతున్నందుకు ఫైను చిన్నమొత్తంలో కట్టాల్సి వచ్చింది

రంజింత్‌సింగ్ వంటి ప్రముఖ క్రికెట్ ఆటగాడి మేనల్లుడు కావటంతో, అక్కడి పత్రికలు ఇంత చిన్న విషయానికి, పతాక శీర్షికలతో ప్రచారమిచ్చాయి

ఈ వార్త రంజింత్‌సింగ్ గారికి తెలిసి, ఆయన మేనల్లుడికి ఒక తమాషా టెలిగ్రాం ఇచ్చారు అందులో –

"పేపరు వాళ్ళు మనకు ఎంతో ప్రాముఖ్యత ఇచ్చి ప్రచారం చేశారు! అయినా ఇలాంటి పనా పేపరులో పేరు కోసం చేసేది?"

## దేవుడు కృపామయుడు - మార్క్‌ట్వయిన్

ప్రముఖ రచయితల్లో మార్క్‌ట్వయిన్‌కి అభిమానుల సంఖ్య ఎక్కువగా ఉండేది

అతని దగ్గరనుంచి ఉత్తరం, అతని సంతకంతో వస్తే ఆ రోజు ఆ అభిమాని తన జన్మ ధన్యమయినట్టు భావించేవాడు

ఈ 'ఫాన్‌మెయిల్' సంఖ్య వారియొక్క నూతన సంవత్సర శుభాకాంక్షల విషయంగా చాలా ఎక్కువగా వుండేది

ఈ శుభాకాంక్షల ఉత్తరాలు, ఎప్పుడూ ప్రసంగాలు చేస్తూ, అనేక రాష్ట్రాలు తిరుగుతూ వుండే మార్క్‌ట్వయిన్‌కు సకాలంలో అందటమూ కష్టంగా వుండేది.

ఒకసారి ఒక అభిమాని, నూతన సంవత్సర శుభాకాంక్షలు అందించటానికి మార్క్‌ట్వయిన్ చిరునామా సరిగా తెలియక శుభాకాంక్షలున్న కాగితం, కవరులో పెట్టి క్రింది విధంగా మార్క్‌ట్వయిన్ చిరునామా వ్రాశాడు

"మిస్టర్ మార్క్‌ట్వయిన్
చిరునామా తెలియదు
దేవుడికృప వల్ల ఈ ఉత్తరము అందుగాక!"

అయితే, ఆ అభిమాని ఊహించిన దానికి భిన్నంగా కొన్ని రోజుల్లో మార్క్‌ట్వయిన్ నుంచి ఉత్తరం వచ్చింది

అయితే క్రింద ఒకే ఒక వాక్యముంది

"దేవుడు కృపామయుడు"

క్రింద మార్క్‌ట్వయిన్ సంతకముంది

## మార్క్‌ట్వయిన్‌కు తగ్గని డిమాండు

మార్క్‌ట్వయిన్ అంటే ప్రముఖ అమెరికా హాస్య రచయిత

అతను ఎంత మంచి హాస్య రచయితో అంతకు మించిన హాస్య ప్రసంగకర్త

ఆయన ప్రసంగాలు వినటానికి జనం, ఆ రోజుల్లో, టిక్కెట్లుకొని, పెద్ద మొత్తాలు ఖర్చుపెట్టి తండోపతండాలుగా వచ్చేవారు

మార్క్‌ట్వెయిన్‌కు రచనల మీదకంటే, ఈ హాస్యప్రసంగాల వల్ల, డబ్బులెక్కువ రాబడి వుండడంతో రచనలకంటే ప్రసంగాలు చేస్తూ దేశ దేశాలు తిరిగి, డబ్బులు ఇబ్బడిముబ్బడిగా సంపాదించేవాడు

ఒకసారి అలాటి హాస్యప్రసంగం చేయటానికి మార్క్‌ట్వెయిన్ ఒక నగరం చేరాడు

అయితే అక్కడ తన ప్రసంగం వున్నట్టు చేయవలసినంత పబ్లిసిటీ చేయలేదని అతనికి అనిపించింది

ఎక్కడా తనకు సంబంధించిన వాల్‌పోస్టర్లు, వుండవలసినన్ని లేకపోవటంతో మార్క్‌ట్వెయిన్‌కు బాధ వేసింది

తన ప్రసంగం వుండే థియేటరు బయట వుండే నాలుగయిదు షాపుల్లో తానెవరో తెలియకుండా వెళ్ళి "ఇక్కడ కొత్త యాత్రికుడికి మంచి కాలక్షేపానికి, ఏదైనా మంచి కార్యక్రమం వుందా?" అన్నాడు

"ఆహా! అనుమానమేముంది! జనం విరగబడి వచ్చే అవకాశముంది మార్క్‌ట్వెయిన్ హాస్య ప్రసంగం వుందిగా" అన్నాడు షాపువాడు

"జనం విరగబడి వస్తారని ఎలా తెలుసు?" అడిగాడు, రచయిత

"కుళ్ళిన కోడిగుడ్లు బాగా అమ్మాంగా" అన్నాడు షాపువాడు

## ఆర్. కె. లక్ష్మణ్ వేసే కార్టూన్లవల్ల దెబ్బ

భారతదేశంలోనే కాక, ప్రపంచవ్యాప్తంగా గొప్ప గుర్తింపు పొందిన ప్రముఖ కార్టూనిస్ట్, ఆర్ కె లక్ష్మణ్

ఈయన సోదరుడే ప్రముఖ కథా నవలా రచయిత ఆర్ కె నారాయణ్

ఇద్దరూ ప్రపంచ ప్రఖ్యాతి గిన్నవారే

ఆర్ కె లక్ష్మణ్ గత యాభై ఏళ్ళుగా కార్టూనిస్ట్‌గా ఉన్నారు

ఈయన ఇందిరాగాంధీ మీదవేసినన్ని వ్యంగ్య విమర్శనాత్మక బాణాలు, కార్టూన్ల రూపంలో, మరెవరి మీదా వేయలేదు

ఇదే విషయం అడిగితే "నేను తీవ్రమైన వ్యంగ్యచిత్ర బాణాలు ఎన్ని సారించినా, ఇందిరాగాంధీకి కోపం రాలేదు! పైగా, ఆమె నన్ను, 'పద్మభూషణ్' బిరుదుతో మరింత గౌరవించింది అందుకే నాకు బాగా అసంతృప్తిగా వుంది" అన్నారు నవ్వుతూ

బాబ్రీ మసీదు గొడవ తరువాత, బొంబాయిలో జరిగిన అల్లర్లలో, అనేక ప్రభుత్వ బస్సులను దుండగులు తగలబెట్టారు

ఈ సమస్య మీద స్పందించిన లక్ష్మణ్ ఒక కార్టూను వేసి, ఒక తండ్రి కొడుకుతో "నీవేమి రామభక్తుడవురా! బొమ్మకారునన్నా తగలబెట్టలేవు?" అంటున్నట్టు వ్రాశాడు

దీనితో ఓ రామభక్తుడు, లక్ష్మణ్‌ను కోర్టుకు లాగాడు ఈ విషయం అడిగితే "ఔను! తగలబెట్టే విషయంలో రామభక్తుడు, హనుమంతుణ్ణి మించినవారున్నారా! చూసి రమ్మంటే కాల్చి వచ్చేరకం" అన్నాడు లక్ష్మణ్.

పాక్‌యుద్ధకాలంలో ఆయన వేసిన కార్టూన్‌కు వళ్ళు మండిన వారు, ఆయనకు ఒక 'ఉత్తరంలో బాంబు' పంపారు అడ్రసు చూసి అమెరికా రాయబార కార్యాలయానికి ఫోను చేస్తే "అలాంటిది మేము ఏమీ పంపలేదు" అన్నారట.

## 'మామ్' పిల్లల్ని పెంచే పద్ధతులు

ఆంగ్లసాహిత్యంలో, కథా, నవలా రచయితగా సోమర్‌సెట్ మామ్ స్థానం పదిలం

జీవితంలో తను చూసినవి, అనుభవించినవి, తెలుసుకున్న నిత్యసత్యాలు, మరెవరు వ్రాయలేనంత గొప్పగా ఆయన, తన రచనల్లో అతి వాస్తవికంగా వ్రాశాడు

ఆయన వ్రాసిన 'హ్యూమన్ బాండేజ్' (మానవ బంధాలు) అనే నవల, ఆయన స్వీయచరిత్ర అని సాహితీ అభిమానులు ఒప్పుకుంటారు

అయితే, సోమర్‌సెట్ మామ్ మంచి సంభాషణ చతురుడు కూడా

ఒకరోజు, ఒక స్త్రీ వచ్చి తనకు పిల్లలంటే ఉన్న మక్కువను గురించి గొప్పగా చెబుతూ "నాకు పిల్లలంటే ఎంత ఇష్టమో మాటల్లో చెప్పలేను" అంది

ఆమె మాటలు విన్న సోమర్ సెట్ మామ్ "నాకూ అంతే! నేను వాళ్ళను ఎలా జాగర్తగా పెంచాలో చెబుతూ 'పిల్లల్ని పెంచడానికి ఆరు పద్ధతులు' అనే వ్యాసం పెళ్ళికాకముందే వ్రాశాను! అది చాలా మంచి

వ్యాసమని ఎందరో పెద్దలు మెచ్చుకున్నారు అయితే, ఇప్పుడు నాకు ఆరుగురు పిల్లలున్నారు" అన్నాడు.

"మరి మీ పిల్లల్ని పెంచటానికి మీరు వ్రాసిన ఆ ఆరు పద్ధతులు ఆచరణలో పెట్టి వుంటారు?" అంది ఆ స్త్రీ, కుతూహలంగా.

"అబ్బే, పిల్లలు ఆరుగురున్నారు అయితే పద్ధతులు మాత్రం లేవు! అదే తమాషా!" అని అన్నాడు, మామ్

## కొలంబస్ నిరూపించుకున్న ప్రతిభ

ప్రాణాలకు తెగించి కొలంబస్ కొత్త సముద్ర మార్గం కనిపెట్టాడు.

అయితే, ఆ సాహసయాత్ర చేయటానికి ఆయన వెంటవెళ్ళినవాళ్ళు, యావజ్జీవశిక్ష పడ్డ ఖైదీలు సాహసయాత్ర విజయవంతంగా చేసిరాగానే వాళ్ళకు విముక్తి లభిస్తుందంటే వాళ్ళు ప్రాణం మీది తీపితో, కొలంబస్ ఓడలో నావికులుగా పనిచేయటానికి చేరారు

అయితే, కొంత దూరం సముద్ర యానం చేశాక, ఏ విధమైన భూభాగం కనపడకపోవటంతో, కొలంబస్‌ను బంధించో, అవసరమైతే వధించో, ఓడను వెనక్కు తిరిగి తీసికెళ్ళాలని వాళ్ళు ఓ పథకం వేశారు కూడా

అదృష్టవశాత్తు కొలంబస్ ప్రార్థనలు, ప్రయత్నాలు ఫలించి, కొత్త భూభాగం కనిపించింది

అయితే, ఇంత కష్టనష్టాలు పడి తిరిగి వచ్చిన కొలంబస్ సాధించింది ఏమంత పెద్ద విషయం అన్నట్టు ఒక వ్యక్తి మాట్లాడసాగాడు అతను ఆ సమయంలో కొలంబస్‌తో కలిసి భోజనం చేస్తూ "అసలు భూమి గుండ్రంగా వున్నదనే ఆలోచన నీదికాదు! అదెప్పటినుంచో వుంది!" అన్నాడు

కొలంబస్ వెంటనే, పై పొట్టు తీయని ఉడకబెట్టిన గుడ్డు తీసి, చూపుతూ "ఈ గుడ్డుని వరగకుండా ఈ సన్నమొనవైపు నిలపగలవా?" అన్నాడు, ఆ వ్యక్తితో

"అదెలా సాధ్యం? అదెవరూ చేయలేనిపని!" అన్నాడు, ఆ వ్యక్తి

కొలంబస్ గుడ్డు సన్నటి మొనవైపు కొద్దిగా చిదిపి, ఆ భాగం కాస్త వెడల్పు అయ్యేట్లు చేసి, అది నిలిచేట్టు చేసి, "ఇలాగే – ఎవరూ చేయలేని దాన్ని నేను చేయబట్టే కొత్త భూభాగం కనిపెట్టటమనే విజయాన్ని సాధించాను" అన్నాడు.

అదీ కొలంబస్ గొప్పతనం!

## వేదుల - మునిమాణిక్యాల ఆత్మస్తుతి

ప్రముఖ హాస్య రచయిత మునిమాణిక్యం గారిలా, ప్రముఖ రచయిత వేదులవారూ హాస్యప్రియులే

మునిమాణిక్యం, వేదులవారు ఒకరోజు వీధిలోకి రాగానే, ఒక పెద్ద అధికారి, వారి వెనకాలే చాలా ఠీవి, దర్పం, అధికార ఆధిక్యత చాటుకుంటూ వస్తున్నాడు

ఆ అధికారి ముందు, ఒక బిళ్ళ జవాను, అంతకంటే ఠీవిని ప్రదర్శిస్తూ, "తప్పుకోండయ్యా! తప్పుకోండి! దొరగారు వస్తున్నారు!" అంటూ, అరుస్తూ జనాన్ని హెచ్చరిస్తున్నాడు

వీధిలోకి వచ్చి తన దర్పాన్ని అలా ప్రదర్శిస్తున్న ఆ అధికారి మీద వేదులవారికి కోపం వచ్చింది

అయితే, ఆ కోపాన్ని అలా ప్రదర్శించకుండా, ఆ అధికారికి ముందు తను అడ్డంగా నిలబడి, తన ప్రక్కనే మునిమాణిక్యాన్ని నిలుపుతూ కాసేపు ఆగి, తరువాత ఆ అధికారి దగ్గరగా రాగానే, మునిమాణిక్యాన్ని రెక్కపుచ్చుకుని త్వరగా ప్రక్కకు లాగి "ఏమిటయ్యా! అక్కడే నిలబడి ఉంటావేమిటి కదలకుండా! అవతల అంత పెద్ద అధికారి వస్తున్న సంగతి తెలుసుకోవద్దా? నీవు ఎంత హాస్యరచయితవైనా – నేను ఎంత గొప్ప కవినైనా ఎవరూ లెక్కచేయరు! అధికారులకు దారి ఇవ్వాలని తెలియకపోయిన తర్వాత ఎందుకయ్యా – నీ కథకు చక్రవర్తిత్వమూ, నా పాండిత్యమూనూ!" అన్నారట

అది నిజానికి అవతల పెద్దమనిషిని ఏడ్పించటానికి చేసిన అల్లరే!

అయితే – అందులో ఎంత ఆత్మస్తుతి ఉన్నదనేది చెప్పక చెబుతున్న సంఘటన

## ‘శ్రీ శ్రీ’ పేల్చిన చతురోక్తులు

ప్రముఖ తెలుగుకవి వేదుల సత్యన్నారాయణ, శ్రీ శ్రీ గారి ఆప్తమిత్రుడు

ఒకసారి, వేదుల సత్యన్నారాయణ శ్రీ శ్రీతో కలసి, విశాఖపట్టణంలో సముద్రం ఒడ్డున నడుస్తున్నాడు

ఒకరి కష్టాలు, సుఖాలు ఇంకొకరికి చెప్పుకుంటూ వ్యూరడించు కుంటున్నారు

ఏ విధమైన ప్రోత్సాహం లేకపోవటంతో ఇద్దరూ కవులుగా, చాలా బాధపడుతున్నారు

“ఎందుకొచ్చిన బ్రతుకు శ్రీ శ్రీ! మనిషిగా, అందులోనూ తెలుగు కవిగా పుట్టడం కంటె, ఈ సముద్రతీరంలో పీతగా పుట్టడం నయం! ఈ కష్టాలు లేకపోను” అన్నాడు వేదుల, బాధగా

“పీతకష్టాలు పీతవి!” అని శ్రీ శ్రీ సమాధానం

శ్రీ శ్రీ రష్యా పర్యటన సందర్భంగా బెనూఖ్ అనే ఆయన, శ్రీ శ్రీతో “ప్రపంచంలో అనేక జంతువులున్నాయి అన్నిటికంటే విప్లవాత్మకమైన జంతువు పిల్లి” అన్నాడట

శ్రీ శ్రీ ఆశ్చర్యపడి, “అదేమిటే, ఎందుకని?” అని, అడిగితే –

“అది సదా ‘మావ్!’ ‘మావ్’! (మావో) అంటుంది కాబట్టి” అన్నాడట బెనూఖ్

చైనా వాళ్ళ మీద ప్రచారంలో వున్న చతురోక్తి విన్న శ్రీ శ్రీ రష్యన్ల మీదాకూడా ఒకటి సృష్టించాడు

“రష్యాలో అందరూ సామాన్యులే తేడా అల్లా అందులో, కొందరు మరింత సామాన్యులు”

## ‘శ్రీ శ్రీ’ జోక్స్‌లో ‘శ్లేషార్థాలు’

సమయానుకూలంగా, సందర్భోచితంగా జోక్‌లు పేల్చటంలో శ్రీ శ్రీ గొప్ప ప్రతిభాశాలి

1926లో, విశాఖపట్టణంలో 'కవితాసమితి' అనే పేరుతో, ఒక సాహితీసంస్థ ప్రారంభమైంది అందులో నలభయి అయిదుగురు సభ్యులుండేవారు.

వాళ్ళలో రాళ్ళబండి సుబ్బారావు, 'తాపీ' ధర్మారావు, 'సున్నం' వీరరాజు – అనే ముగ్గురు ప్రముఖ సాహితీవేత్తలుండేవారు

ఇందరు ప్రముఖులున్నా సొంతభవనం 'కవితాసమితికి' లేదు. అదో పెద్దలోటు.

ఈ విషయంగానే శ్రీశ్రీ చెబుతూ, "సమితి సభ్యుల్లో 'రాళ్ళబండి! 'తాపీ" 'సున్నం'గార్లు వుండి కూడా, సొంత భవనం సాధ్యంకాలేదు" అంటూ జోక్ పేల్చారు.

కవులు ఎక్కువమంది 'మందు' ప్రియులు.

ఈ విషయంగా శ్రీశ్రీ, పోతనామాత్యులు చెప్పిన పద్యాన్ని పేరడీ చేస్తూ –

"కవులు 'హాలికు'లైన నేమి?"

అన్నాడు పోతన.

'ఆల్కహాలికులైన' నేమి?

అంటాడు – శ్రీశ్రీ" అన్నాడు

ఒకసారి శ్రీశ్రీ అర్ధరాత్రిపూట ఓ హోటల్లోకి వెళ్ళి "నాకో పావురం కావాలి" అన్నాడు

"అర్ధరాత్రిపూట 'పావురం' ఎలా తేవటం?" అన్నాడు హోటల్ వాడు

"పావురం – అంటే – 'పావు బాటిల్ రమ్ము' అంటూ అర్థవివరణ చేశాడు శ్రీశ్రీ

## కవుల పద్యాల్లో కనిపించే 'భూవసతి'

మన మామూలు కవులు, చాలామంది, పద్యాలు వ్రాసేప్పుడు, పాదాలను పూరించేప్పుడు – 'ఇలన్' – 'ధాత్రిన్', 'ఇద్ధరన్', 'ధరణిన్', 'భువినన్' అంటూ, ఏదోరూపంలో భూమిని గురించిన స్మరణ ఉంటుంది.

"దీనినిబట్టి మన కవులు నిజానికి సొంత ఇల్లూ, గోడూ అమర్చుకో గలిగారనేనా సార్, వీరి అర్థం – ఇలా కావ్యాల్లో మాత్రం భూమిని

యధేచ్ఛగా ఆక్రమింప చేస్తూ వుంటారు! వీళ్ళ తీరు చూస్తే, ఈ భూమంతా మాదే అన్నట్లుంది కారణం ఏమిటి మాష్టారూ?" అంటూ, కులపతి డా॥ ఎక్కిరాల కృష్ణమాచారిగారిని, వారి ప్రియశిష్యుడు, డా॥మోపిదేవి కృష్ణస్వామి ఒకరోజు వివరణ అడిగారు

అప్పుడు కృష్ణమాచార్యులవారు ఇలా అసలు వివరణ ఇచ్చారు:

"మామూలు కవులు చాలా మంది పద్యాలు వ్రాసేటపుడు, పాదాలు పూరించటానికి పడేపాట్లివి. భావం అయిపోయింది. గణాలను సరిపెట్టాలి ఛందస్సు తప్పకూడదు కదా మరి? అందుకని ఈ తిప్పలంతా. పద్యాల్లో ఏర్పడే ఖాళీనంతా 'భూమిని' – ఏదో ఒక రూపంలో – అంటే 'ఇలన్' – అనో, 'ధాత్రిన్' – అనో – అక్కడ ఏర్పడ్డ ఖాళీనిబట్టి, ఆశ్రయించి భర్తీ చేస్తుంటారు, ఈ కవులు."

అప్పుడు కృష్ణస్వామి "అందరినీ – అన్నిరకాల వారినీ భరిస్తున్నట్టే తనను అర్థం పర్థం లేకుండా అదేపనిగా ఉపయోగించుకుంటున్న ఈ కవిశ్రేష్ఠులను కూడా భరిస్తూ వున్నది ఏం చేస్తుంది పాపం?" అన్నారు నవ్వుతూ.

## ప్రపంచ ప్రసిద్ధ రచయిత 'జాయిస్' చాదస్తం

ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత జేమ్స్ జాయిస్, సాహిత్యంలో 'చైతన్య స్రవంతి' అనే కొత్త ప్రక్రియా విభాగాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చాడు

ఒకరోజు జాయిస్ ప్రొద్దున్నుంచి సాయంత్రం దాకా రచన చేస్తున్నాడు అతనేదో నవల చైతన్య స్రవంతి పద్ధతిలో రాస్తున్నాడనుకున్నారు, మిత్రులు

అందుకే రాస్తున్నప్పుడు అతన్ని ఇబ్బంది పెట్టదలచలేదు

తరువాత ఆ సాయంత్రం వెళ్ళి ఒక మిత్రుడు "ఈ రోజంతా ఏం వ్రాశావు?" అని, అడిగాడు, కుతూహలంగా

"నా నవల ఒకటి వ్రాస్తున్నాను" అన్నాడు జాయిస్

"చాలా వ్రాసి ఉన్నావన్నమాట అయితే" అన్నాడు ఆ మిత్రుడు.

"లేదు, ఒకే ఒక వాక్యం వ్రాశాను!" అన్నాడు జాయిస్

"అదేమిటీ! ఎందుకని?" ఆత్రంగా ప్రశ్నించాడు మిత్రుడు

ఒక వాక్యాన్ని ఎన్ని విధాలుగా మార్చి రాయవచ్చో, ఎలా వ్రాస్తే ఏ అర్థం వస్తుందో, ఏ వాక్యం ఎందువల్ల నచ్చలేదో, చివరి వాక్యం ఎందుకు నచ్చిందో, జాయిస్ వివరించాడు

జాయిస్ తన రచనల ప్రూఫ్ తనే దిద్దుకునేవాడు

ఒకసారి ఒక మిత్రుడు "ఈ వేళ ఏం చేసావు?" అంటూ అడిగాడు.

"ప్రూఫ్‌రీడింగ్" అన్నాడు జాయిస్

"ఏమిటీ ఫలితం?"

"ఉదయం ఒక 'కామా'ను నా రచన నుంచి తొలగించాను సాయంత్రం, ఆ కామాను కష్టపడి యథాస్థానంలో వుంటేనే బాగుంటుందని ఉంచాను" అన్నాడు, జాయిస్

## ఇద్దరు ప్రముఖ కవుల ఉధృతి

ఆత్రేయ సినిమా పాటల్లోనే కాదు, నిజ జీవితంలో కూడా ఆయన మాటల్లో చమత్కారాలు దొర్లుతుండేవి

ఆత్రేయ తల తెల్లపడకుండా, ఓ ఆయుర్వేదనూనె వ్రాస్తుండేవారట, తలకి

అయితే వేటూరిగారి తల తెల్లగా పండి వుంటుంది

ఆత్రేయగారి తలపండని రహస్యమేమిటో తెలుసుకోవాలని, ఒకసారి ఆత్రేయను ఆ రహస్యమేమిటో చెప్పమన్నారట

ఆయన ఆ తలనూనె సంగతి చెప్పగానే, అది వాడటం మొదలు పెట్టారు, సుందర రామమూర్తి

కొంతకాలం తర్వాత ఆత్రేయ – సుందర రామమూర్తి కలుసుకున్నారు

ఇప్పుడు ఆత్రేయ తల తెల్లగా, సుందర రామమూర్తి తల నల్లగా వుంది.

"ఈ మధ్య మీరు ఆ తలనూనె వ్రాయటం లేదల్లేవుందే?" అంటూ సుందర రామమూర్తి అడిగారు

వెంటనే ఆత్రేయ "అవును – నువ్వు వ్రాయటం మొదలెట్టాక నేను వ్రాయటం మానివేశాను" అన్నారట, ధ్వనిగర్భితంగా.

నిజానికి, ఆత్రేయ వంటి ప్రముఖ రచయిత, సుందర రామమూర్తి గారు పాటలు వ్రాసే ఉధృతికి, కొంచెం వ్రాయటం తగ్గించారన్నది నిజమే

## ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి నిజాయితీ

ఆచార్య పింగళి లక్ష్మీకాంతమంటే, ఆంధ్రలో పేరెన్నికగన్న పండితులు, కవులు, విమర్శకులు 'ఆచార్య' అనే పదానికి, ఆయనే సరైన సజీవ ఉదాహరణ - అన్నంత గొప్ప పేరు, ప్రఖ్యాతులు పొందారు.

అయితే ఆయన, నిర్మొహమాటి ఒకసారి, ఓ ప్రముఖ రాజకీయవేత్త ఆయన దగ్గరకు వచ్చి "ఆత్మకధ వ్రాసుకుందామనుకుంటున్నాను, మీ సలహా ఏమిటి?" అన్నాడట

లక్ష్మీకాంతంగారు వెంటనే "ఆత్మకధలు అసలు కధలుగా వుండవు! ఉండనివ్వరు! అలా వున్నదున్నట్లు వ్రాసేధైర్యం ఏ గాంధీజీ వంటి వారికో వుంటుంది! తక్కిన వారంతా 'ఆత్మస్తుతి' ప్రధానంగా వ్రాస్తుంటారు. తప్పులు దాచేస్తారు. ఒకరు తప్పులు బయటపెడితే ఊరుకోరు. తమ తప్పులు తాము బయట పెట్టుకొని, హీనులనిపించుకుంటారా? 'ఆత్మకధ' - జీవితకధకు పూర్తిగా దర్పణంగా వుండాలి అలా వ్రాయగలిగితే వ్రాయండి లేకపోతే 'అనుభవాలూ - జ్ఞాపకాలూ' అంటూ వ్రాయండి అదీ కాకపోతే మీ చరిత్ర మరొకరి చేత వ్రాయించండి. వారు ఏది వ్రాసినా వ్రాయవచ్చు! అందులో మీ దోషం వుండదు," అని అన్నారు

ఆ వచ్చిన ప్రముఖుడు, ఇక జీవితచరిత్ర వ్రాయటం ప్రమాదం అన్న నిజాన్ని గ్రహించి, నీరు కారిపోయి, నమస్కారం పెట్టి, ఆచార్యుల వారి దగ్గర సెలవు పుచ్చుకున్నాడట

అంత నిజాయితీగా, అంత నిర్భయంగా ఉన్న నిజాన్ని చెప్పే నిఖార్సయిన ఆచార్యులు ఎందరుంటారు? "నభూతో న భవిష్యతి"

## నిద్రవుంటే ఇబ్బందే

పూర్వపు సాహిత్య సభల్లో పాల్గొనే హేమాహేమీల సాహిత్య ఉపన్యాసాలు ఎంత గొప్పగా వుండేవో, వారి సరస, సంభాషణా చతురతలు అంత గొప్పగా వుండేవి! అలాగే అప్పటి శ్రోతలు కూడా, ఆ సాహిత్య ప్రసంగాలను విని ఆనందించే మంచితనం కలిగివుండేవారు.

ఒకసారి తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారిని ఓ సాహిత్యసభకు అధ్యక్షత వహించమని సభా నిర్వాహకులు కోరారు.

శాస్త్రిగారు ఆ అధ్యక్ష బాధ్యతను ఎత్తుకుంటూ "ఏమున్నా లేకున్నా, సభలో 'నిద్ర' లేకుండా వుంటే, అదే చాలు" అన్నారట.

సభా నిర్వాహకులు, పాపం, శాస్త్రిగారికి పెద్దవయసు వల్ల బడలికతో అలా అంటున్నారు అని అనుకున్నారట

తరువాత శాస్త్రిగారు తను వాడిన – 'నిద్ర' అనే పదాన్ని ఇలా వివరించారట

'ని' – అంటే 'నియోగులు'

'ద్ర' – అంటే 'ద్రవిడులు'

"అంటే వీళ్ళు – ఇద్దరూ లేకుండా వుంటే, సభ సాఫీగా సాగుతుంది! కారణం – నియోగులు. ఏదీ సూటిగా చెప్పరు ద్రావిడులు ఏదీ చిన్నగా చెప్పరు" అని అన్నారట

## ఇంగ్లాండ్‌లో 'జోకు'గా 'శ్రీశ్రీ'పాడిన పద్యం-గీతం

శ్రీశ్రీ ఎంత మంచి కవో, ఆయన భావాలు ఎంత కొత్తగా, పదునుగా వుంటాయో, అంత బాగా ప్రసంగము చేయగల దిట్ట

ఆయన ఇంగ్లాండ్‌టూర్ చేసినప్పుడు ఒక సభలో, "మీకు 'మహాప్రస్థానం'లో, నచ్చిన గేయం ఏది?" అంటూ అడిగితే –

"నాకు అన్నీ ఇష్టమే" అన్నారు, శ్రీశ్రీ

తరువాత తను, తరచు చదివే "కవితా – ఓ కవితా" అనే గేయం చదివారు

తరువాత రెండు మూడు జోకులు చెప్పి నవ్వించారు శ్రీశ్రీ
అలా సభికుల్ని నవ్విస్తూ ఓ పద్యం చదివారు
దాని పేరు, 'పాపనాశనం'
ఆ పద్యము ఇలా చదివారు

*"గంగలో మునగంగ*
*పాపాలు పోతాయని, ఒక దొంగ,*
*కాశీకి వెళ్ళి, గంగలో బుడుంగని*
*మునింగి, చనిపోయాడు – చల్లంగ"*

ఇలా పద్యము చదవగా, చప్పట్లతో నవ్వులతో హాలంతా నిండిపోయింది. మరొకటి చదవమని సభికులు కోరగా –

"తెలుగువాడి తెలివితేటలకి – జై జై
తెలుగువాడు దేనికైనా – సై సై
తెలుగువారి నెదురువాడు – నై నై
తెలుగునాట కవులపాట – హై హై
ప్రస్తుతానికి వస్తామరి నేస్తం – బై బై"

అని, సభలోనివారికి శ్రీశ్రీ నమస్కారం చేసి కూర్చున్నారు

## లండన్‌లో 'శ్రీశ్రీ' చదివిన 'తమాషా పద్యాలు'

శ్రీశ్రీ గారు, లండన్‌లో తెలుగువారు ఏర్పాటు చేసిన సభలో ప్రసంగించి కూర్చున్నారు అయితే అక్కడి సాహితీప్రియులు, శ్రీశ్రీ గారు కవిత్వం చదవకపోవటంతో బాధపడి "మీరు మీ కవిత్వం చదవకుండా ఊరుకుంటే మేం ఒప్పుకోం" అంటూ, గట్టిగా ఏకగ్రీవంగా కోరారు

ఇక శ్రీశ్రీ వారిమాట ఒప్పుకొనక తప్పింది కాదు

చివరికి ఆయన "రెండు మూడు తమాషా పద్యాలు మాత్రం చదువుతాను, వినండి" అంటూ –

"దెయ్యాలను చూపిస్తా
నయ్యా, రమ్మనుచునొక్క ఆసామి నా
కయ్యో, తన కూతుళ్ళను
చెయ్యూపుచు పిలిచి చూపె సిరిసిరి మువ్వా"

అనే పద్యం చదివారు.

ఆడపిల్లలంటే తల్లిదండ్రులకు ఎంత బాధాభయాలు కలుగుతున్నాయో వ్యంగ్యంగా రెండు ముక్కల్లో చెప్పారు శ్రీశ్రీ.

అప్పుల వాళ్ళ బాధ – నిజంగా ఎవరికి బాధో చెబుతూ శ్రీశ్రీ –

"అప్పులవాళ్ళ బాధ వుందే
తప్పదియ్యా, సందే
హం లేదు, చాలా ఇబ్బందే!

అయినా చెబుతున్నా ముందే,
బాధ వాళ్ళదయితే – సుఖం మన్దే"

ఇలా మరో పద్యం చదివి, అక్కడి అభిమానుల మన్ననలు పొందారు

## శ్రీ శ్రీ - ఇది లోకం తీరు

ఒకసారి శ్రీ శ్రీ గారు, ఆయన శ్రీమతి సరోజా శ్రీ శ్రీ గారు రైల్లో ప్రయాణం చేస్తున్నారు.

'సంసారంలో శ్రీ శ్రీ' అనే శ్రీ శ్రీ 'జీవిత చరిత్ర' వ్రాసిన ప్రముఖ రచయిత్రి, సంగీతకారిణి సరోజగారు

తోటి ప్రయాణీకుల్లో ఒకాయన శ్రీ శ్రీగారిని గుర్తుపట్టి పలకరించి – సరోజా శ్రీ శ్రీను చూపించి "మీ అమ్మాయా?" అంటూ శ్రీ శ్రీగారిని అడిగారు

అయితే సరోజా శ్రీ శ్రీగారు పరిస్థితి అర్థం చేసుకున్నవెంటనే "ఇంకా నయం, భలేవారండీ – ఈయన మావారండీ" అంటూ అడ్డుకున్నారు

ఇంకా "మాకు నలుగురు పిల్లలండి" అన్నది సరోజా శ్రీ శ్రీ

"ఏమండీ! ఆ అమ్మాయి అంటున్నది నిజమేనా? నలుగురు పిల్లలని అంటోంది చూస్తే అలా అనిపించటం లేదు!" అంటూ, ఆ వ్యక్తి అడిగాడు

"అవునండీ! నా భార్యే, నాకన్నా ముప్ఫయ్యేళ్ళు చిన్న" అన్నారు, శ్రీ శ్రీ నవ్వుతూ

తరువాత శ్రీ శ్రీగారు "నీకింకో విషయం చెప్పేనా" అంటూ, భార్య నడిగారు

"ఏమిటీ?" అంది ఆమె

"నేను మా ముసిల్దీ (మొదటి భార్య – రమణమ్మగారు) కలిసి రైల్లో ప్రయాణం చేసేటప్పుడు, తోటి ప్రయాణీకులు నన్ను చూపించి, "ఇతను మీ అబ్బాయా?" అని అడిగేవారు వాళ్ళు అలా అడగడం ఆమెకి కష్టంగా ఉండేది" అని అంటూ గత అనుభవాలు చెప్పారు

లోకం తీరు అంటే ఇదేనేమో!?

## తలవంచని 'సాహితీసమ్రాట్' శ్రీ విశ్వనాథ

1960 ప్రాంతంలో శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు కేంద్ర సమాచార ప్రసారశాఖామాత్యులు అయితే ప్రముఖ కవిగా, రచయితగా, విశ్వకవి రవీంద్రుని శిష్యునిగా, ఆయన రచనలను తెలుగులో తెలిగించిన బహుముఖ ప్రజ్ఞాప్రవీణు డాయన

ప్రభుత్వం తరఫున ఆంధ్ర సారస్వత పరిషత్ ఆవరణలో పండిత సన్మానం ఏర్పాటు చేశారు.

శ్రీ విశ్వనాథ, దివాకర్ల, కప్పగంతుల, గడియారం, దాశరధి వంటి కవిదిగ్గజాలు అక్కడున్నారు

గోపాల రెడ్డిగారు సన్మానం చేస్తుండటంతో అది అందరికీ ఎంతో గౌరవ ప్రదంగా వుంది

గోపాల రెడ్డిగారు ఒక్కోకవి ముందుకు వెళుతున్నారు.

కవిశ్రేష్ఠులు ఒక్కొక్కరు లేచి నిలబడి ముకుళిత హస్తాలతో నమస్కరించి, కేంద్రమంత్రివర్యులు అందించిన శాలువాను, పారితోషికం వున్న కవరును అందుకుంటున్నారు

అయితే విశ్వనాథ, అందరు కవుల్లా లేచి నిలబడలేదు

"ఇదిగో చూడు, నేను లేవను! నువ్వే వంగాలి, అన్నారు విశ్వనాథ, మంత్రివర్యులతో

మంత్రివర్యులు విషయం అర్థం చేసుకుని, కవిసమ్రాట్టుకు సుగంధ ద్రవ్యాలు సమర్పించారు శాలువా కప్పి, పారితోషికం అందించి పాదాభివందనం చేశారు

సభ కరతాళధ్వనులతో మారుమ్రోగింది

విశ్వనాథ కాకుండా మరెవరు ఆస్థానంలో వున్నా, భిన్నంగా జరిగివుండేది.

## శ్రీ విశ్వనాథులవారి నిజాయితీ

ఒకసారి, విశ్వనాథ సత్యనారాయణగారి చేత దాశరధి రంగాచార్యుల వారికి సన్మానం చేయించాలని, రంగాచార్యులవారి అభిమానులు నిర్ణయించారు

రంగాచార్యులు, 1961లోనే, వాల్మీకి రామాయణాన్ని వచనంలో రాసిన ఉద్దండుడు దాని ఆవిష్కరణకు తెన్నేటి విశ్వనాథం అధ్యక్షత వహిస్తే – దివాకర్ల, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, దీపాల పిచ్చయ్య శాస్త్రి, ఉత్పల సత్యన్నారాయణ వంటి ప్రతిభావంతులు ప్రసంగికులుగా ఉన్నారు

1963 సికింద్రాబాదులోని, సీతాఫల్ మండిలో, దాశరధి రంగాచార్యకు సన్మానం విశ్వనాథకు అప్పటికే కొంతచూపు లోపం ఏర్పడింది

రంగాచారిగారి చేయి పట్టి చూసి "చిన్నవాడివే! అయితే రామాయణం వ్రాశావన్నమాట?" అన్నారు

రంగాచార్యులవారికి దడపుట్టింది

గ్రంథం చూసి, "పెద్ద గ్రంథమే రచించావు! పిల్లల పుస్తకమనుకున్నాను" అన్నారు విశ్వనాథ

"వాలికి ఒక తండ్రి వుండాలి వాడెవడో గుర్తుకు రావటంలేదు!" అన్నారు

"ముకరజనుడు" చెప్పారు, రంగాచార్య

"అయితే నువ్వు రామాయణం చదివావోయ్" అన్నారు విశ్వనాథ.

సభలో సన్మానమైన తరువాత, విశ్వనాథ రంగాచార్యులను గట్టిగా కౌగలించుకొని చెవిలో అడిగారు "రంగాచార్యా! నీకు రామాయణం అర్థమైందా?"

"ఏమీ అర్థం కాలేదు గురువుగారూ!"

"ముప్పయి ఏళ్ళు పై బడిన ముండావాణ్ణి నాకే అర్థం కాలేదు! నీకేం అర్థమవుతుంది" అంటూ, అసలు నిజం నిర్భయంగా చెప్పారు

విశ్వనాథ రంగాచార్యులవారికి ఆకాశమంత ఎత్తయి కనిపించారు

## విశ్వనాథ విసిరిన ఛాలెంజ్

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి అబ్బాయి పావనిశాస్త్రి

చిన్నవాడుగా వుండగా, పేరాల భరతశర్మగారనే ఆయన, విజయవాడలో అష్టావధానం చేస్తున్నట్టు తెలిసింది పావనిశాస్త్రికి.

ఆ అష్టావధానాన్ని చూడాలని పావనిశాస్త్రికి ఎంతో ఉబలాటంగా వుంది విశ్వనాథ అష్టావధానానికి వెళుతున్నారు

అష్టావధానానికి వెళుతున్న పావనిశాస్త్రి, విశ్వనాథతో "నాన్నా! నువ్వెప్పుడైనా అష్టావధానం చేశావా?" అన్నాడు.

విశ్వనాథకు మామూలుగా అయితే, ఆ అమాయకపు మాటకు, కోపం వచ్చేదే!

కాని, ఆయన పసివాడి అమాయకతకు నవ్వి, "అదెవరో పసివాళ్ళు చేయగలపని" అన్నారు తరువాత, ఇదేమాట విశ్వనాథ సభలో చెప్పి, "నా అష్టావధానం ఎలా వుంటుందంటే – ఎనమండుగురు నాకు ఎదురుగా కూర్చుంటే – ఒకరికి నవల, ఒకరికి పద్యకావ్యం, ఒకరికి నాటకం, ఒకరికి విమర్శ, ఒకరికి గేయం ఒకరికి ఖండకావ్యం, మరేవైనా రెండు ప్రక్రియలు - మీ ఇష్టం ఎనిమిది మందికీ, ఆగకుండా ఎనిమిదీ చెబుతాను" అని అన్నారు

సభ చప్పట్లతో మారుమ్రోగింది కాని, ఆయనకు, ఆ అవకాశం కల్పించినవారే లేకపోయారు

విశ్వనాథులవారి బహుముఖ పాండితీ ప్రతిభ తెలిసినవారు, ఆయన మాటల్లో ఏమాత్రం అతిశయం లేదని అంగీకరిస్తారు

## ఐన్‌స్టీన్ బుట్టే పెద్ద టెలిస్కోప్

తన 'సాపేక్ష సిద్ధాంతము' (రిలెటివిటి)తో, ఐన్‌స్టీన్, సైన్సులో సంచలనం సృష్టించాడు అయితే ఆయనకి ఇతర ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్తల్లా లెబరేటరీలు ఏమీలేవు

ఐన్‌స్టీన్ వుండే ఇంట్లో గోడకు ప్రముఖ శాస్త్రవేత్త న్యూటన్ పటము, టేబిల్‌మీద పాత బైనాక్యులర్ ఒకటి వుండేవి

ఐన్‌స్టీన్‌ని చూడటానికి ఎవరైనా అభిమానులు వస్తే వారు "ఏమిటి సార్! ఈ బైనాక్యులర్‌నేనా మీరు, మీ పరిశోధనలకు ఉపయోగించేది?" అనేవారు

ఐన్‌స్టీన్ నవ్వి "అది నేను ఉపయోగించే బైనాక్యులర్ కాదు నిజానికది, నాకంటే ముందు ఈ ఇంట్లో వుండి వెళ్ళిన అద్దెకున్న వారిది! దాన్ని ఓ ఆటవస్తువుగా ఇంకా నా టేబిల్‌మీద వుంచుతున్నాను!" అంటూ వివరణ చెప్పేవాడు.

ఒకసారి ఐన్‌స్టీన్ భార్యతో కలసి, కాలిఫోర్నియాలో వున్న "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ"కి వెళ్ళాడు అక్కడ ఆయన ఒక ప్రసంగం చేయాల్సి వుంది

అక్కడ ఐన్‌స్టీన్, ఆయన భార్య, దేశంలోనే అతిపెద్దదైన టెలిస్కోప్ చూశారు.

"ఇంత పెద్ద టెలిస్కోప్ ఏం చేయటానికి?" ఐన్‌స్టీన్ భార్య ఆశ్చర్యంతో అడిగింది.

అక్కడివాళ్ళు "ఈ విశ్వ స్వరూపం అర్థం చేసుకోడానికి, ఇంకా లెక్కలు గుణించటానికి" అన్నారు.

"ఆశ్చర్యంగా వుందే! ఇవన్నీ మా ఆయన ఒక చిన్న పెన్ను, వాడిన పాతకవర్లు ఉపయోగించి వివరిస్తారు" అంది, ఐన్‌స్టీన్ శ్రీమతి. అది నిజమే.

## తిక్కమనుషులతో రస్సెల్ వింత అనుభవాలు

బెర్ట్రాండ్ రస్సెల్ అంటే గొప్ప తాత్త్వికవేత్తేకాక, ప్రపంచ ప్రసిద్ధ మేధావి, హేతువాది. ప్రపంచశాంతికోసం జీవితాంతం కృషిచేసిన మహోన్నత వ్యక్తి నిరాయుధీకరణావశ్యకతను ఎలుగెత్తి చాటిన మహోన్నతుడు సాహిత్యంలో 'నోబెల్ ప్రైజ్' పొందిన సాహిత్యనిధి

రస్సెల్ ఆలోచనా తీరు, అతని కొత్త భావపరంపరను చూసి, చదివి కొందరు ఆయనను 'ఒక వింత మనిషి' (క్రాంక్స్) అనుకోవటం ప్రారంభించారు

రస్సెల్ – ఇతరులు తనను గురించి అనుకున్నందుకు, ఈ విషయంగా బాధపడలేదు

అయితే – వాళ్ళు స్వయంగా వింతమనుషులు ఐవుండీ, రస్సెల్‌ను 'వింతమనిషి' (క్రాంక్స్) అనటం, ఆయనను ఎక్కువగా బాధించింది

ఒకసారి రస్సెల్, అమెరికా రాష్ట్రాలు తిరుగుతూ ప్రసంగాలు చేస్తున్నాడు

అలా రస్సెల్ బయలుదేరబోతుండగా ఒక వింతమనిషి వచ్చాడు

అతను రస్సెల్‌తో "మీ ప్రతి ప్రసంగం పూర్తి కాగానే – త్వరలో ప్రపంచం నాశనము కాబోతున్నది – అంటూ చెప్పండి! మీ ప్రసంగాల

యాత్ర పూర్తవకమునుపే, ప్రపంచం పూర్తవుతుందని చెప్పండి" అంటూ సలహా ఇచ్చాడు

మరో వింతమనిషి రస్సెల్‌ను కలిసి "ప్రజాసంస్థలన్నింటినీ రద్దు చేయటం మంచిది!" అన్నాడు.

"దేనికి?" అంటూ, రస్సెల్ అడిగితే –

"ప్రజాసంస్థలన్నీ ఎంతో నీటిని వృధా చేస్తున్నవి కదా!?" అన్నాడతను

నీళ్ళు వృధా అన్న అంశమే ఆ వ్యక్తి ఎందుకు అన్నాడంటే, అతను వృత్తిచేత రైతు.

## మైకేల్ ఫారడే చెప్పిన జోస్యము

ఇప్పుడు మనం చూస్తున్న టివి, వాడుతున్న ఎక్స్‌–రే, రైళ్ళల్లో, విమానాల్లో, కారుల్లో, బస్సుల్లో వెలుగుతున్న బేటరీ ద్వారా వస్తున్న ఎలక్ట్రిసిటీ, అంతా మైకేల్ ఫారడే అనే ప్రముఖ శాస్త్రవేత్త అందించిన విజ్ఞానశాస్త్ర ఫలాలే

మైకేల్ ఫారడేకి పెద్ద చదువు లేదు. చిన్నతనంలో భుక్తికోసం పుస్తకాల బైండింగ్ వృత్తి చేపట్టాడు. అయితే, ఒకరోజు 'సర్ హంఫ్రీడే' అనే ప్రముఖశాస్త్రవేత్త ప్రసంగం విని, ఆయన శిష్యుడై, శాస్త్రరంగ పరిశోధనలు ప్రారంభించాడు అప్పుడే ఆయన భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం క్షుణ్ణంగా అభ్యసించాడు

మైకేల్ ఫారడే "ఎలక్ట్రో మాగ్నటిక్ ఫోర్సు" అనేదానికి సంబంధించి ఒక ప్రయోగము తను ప్రదర్శిస్తున్నట్టు పత్రికల్లో ప్రకటించాడు

ఆరోజు, గాల్వనామీటర్‌లో ముల్లు, మాగ్నటిక్ ఫోర్సువల్ల ఎలా కదులుతుందో మొట్టమొదటిసారి ప్రదర్శించాలని ఫారడే తాపత్రయపడ్డాడు

ఈ ప్రయోగ ప్రదర్శన కాగానే, ఓ ఇల్లాలు తన కొడుకును చంకన వేసుకొచ్చి "ఏవో రెండు తీగలు కలిపి, అక్కడో ముల్లు కదిలేట్టు చేస్తే, ఇదొక ప్రయోగమా? నీకేం పనీ పాటా లేదా? ఈ ప్రయోగం చూడటానికేనా ఇందరి టైం వృధా చేశావు?" అంది, కోపంగా చివాట్లు పెడుతూ

మైకేల్ ఫారడే మాత్రం కంగారుపడకుండా "అమ్మా! నీ చంకలో పిల్లవాడు ఎలా వున్నాడు? అలాంటిదే నా ప్రయోగం! మీ చిన్న పిల్లవాడు ఇప్పుడు నీకు పెద్ద ఉపయోగం కాకపోవచ్చు! కాని, అతనే పెరిగి పెద్దవాడైతే ఎంత వాడవుతాడో ఇప్పుడు చెప్పలేం! నా యిప్పటి ప్రయోగపు విలువ, కాలం గడిస్తే తెలుస్తుంది" అన్నాడు ఆయన మాటలు అక్షర సత్యాలని రుజువయ్యాయి

## నెహ్రూజీ అనుమతి కావద్దా?

లాల్ బహదూర్ శాస్త్రి, భారత ప్రధానిగా అతి తక్కువకాలం పనిచేసినా, ఆయనకు మంచి పేరే వచ్చింది నీతి, నిజాయితీలకు, కష్టపడి పనిచేయటానికి పేరు ప్రఖ్యాతులుండటంతో, ఆయనను అందరూ అభిమానించేవారు

నెహ్రూగారిపట్ల శాస్త్రిగారికి ఎంతో గౌరవాభిమానాలు

నెహ్రూగారు, శాస్త్రిగారిని ఎంతో గౌరవించి, ఆయనకు తన కేబినెట్‌లో ముఖ్యమైన పోర్ట్‌ఫోలియోలు ఎప్పుడూ ఇస్తుండేవారు

నెహ్రూగారంటే శాస్త్రిగారికి ఎంత అభిమానమంటే, ఆయన మాట జవదాటక పోవటమేకాక, ఆయన అనుమతి లేకుండా ఏ పనీ చేసేవాడే కాదు.

శాస్త్రిగారికి నెహ్రూగారి పట్ల ఎంత మూఢవిశ్వాసమంటే, ఆయన అనే ప్రతిదాన్ని 'అలాగే సార్' అనే గుడ్డిగా నమ్మి ఆచరించే మనిషని పేరు స్థిరపడిపోయింది

ఒకసారి నెహ్రూగారు భువనేశ్వర్‌లోని ఒక మీటింగ్‌లో పాల్గొని వస్తూండగా, ఆయనకు అకస్మాత్తుగా తీవ్ర అనారోగ్య పరిస్థితి ఏర్పడింది ఢిల్లీలో నెహ్రూగారికి వెంటనే వైద్యం ప్రారంభమైనది

ఆయనకు రక్తం ఎక్కించవలసిన పరిస్థితి ఏర్పడింది

"మీరు నెహ్రూగారి కోసం రక్తదానం చేస్తారా?" అని ఒక నాయకుడు అడిగాడు శాస్త్రిగారిని

"పండితులవారి అనుమతి తీసుకోకుండా ఎలా?" అన్నారట శాస్త్రీజీ సందిగ్ధావస్థలోపడి

## మిల్టన్ కవికి ఇంటిలోని బాధ

జాన్ మిల్టన్ ఆంగ్లసాహిత్యంలో గొప్ప పండితకవి. ప్రపంచ సాహిత్యంలో గొప్ప కవులుగా లెక్కించదగిన ప్రముఖ కవిశ్రేష్ఠులలో మిల్టన్ కవిగా ప్రథమస్థానములో వుంటాడు

1608లో పుట్టిన మిల్టన్, తన నలభయి నాలుగవ ఏట పూర్తిగా గుడ్డివాడయ్యాడు

1667 జాన్ మిల్టన్ గుడ్డివాడయ్యాక 'పేరడైజ్ లాస్ట్' ('స్వర్గచ్యుతి') అనే పురాణకావ్యాన్ని వ్రాశాడు

ఆంగ్లసాహిత్యంలో షేక్స్పియర్ స్థాయిలో తన కవితా ప్రతిభతో ప్రముఖస్థానం సంపాదించాడు

మిల్టన్ కవికి భార్యలవల్ల సంసారంలో ఇబ్బందులే ఎదురయ్యాయి. ఆయనకు రెండు వివాహాలు

మిల్టన్ రెండవ భార్య అపురూప సౌందర్యవతి అయితే, ఆమె కాస్త నోటిదురుసు మనిషి. పైగా, ప్రతి విషయంలో భర్తతో తగవు పడుతుండేది

ఒకసారి మిల్టన్ మిత్రుడొకడు, "నీకింత అందమైన భార్య వున్నందుకు నిన్ను అభినందిస్తున్నాను! నిజంగా నీ భార్య ఓ అందమైన గులాబీ అనుకో!" అన్నాడు, ప్రశంసాపూర్వకముగా

అప్పుడు మిల్టన్ "మిత్రమా! గుడ్డివాణ్ణే కావటంచేత నేను గులాబి అందాన్ని, రంగునీ చూడలేను! అయితే, దానికుండే ముల్లుని అనుభూతి పొందగలను", అన్నాడు బాధగా

"ఇంటిలోని బాధ ఇంతింత కాదయా" అన్నదిందుకే, మన వేమనకవి.

## వీర సావర్కార్ చెప్పిన భవిష్యవాణి

మన స్వాతంత్ర్య సమరయోధుల్లో, అగ్రశ్రేణి దేశభక్తుడు, వీర సావర్కార్

సావర్కార్ ఆంగ్లేయుల మీద చేసిన దాడికి ఆంగ్ల ప్రభుత్వము ఆయనకు అండమాన్ ద్వీపానికి, ద్వీపాంతర వాస శిక్ష వేసింది

దేశద్రోహం నేరం మోపి, అలా శిక్షపడ్డ వాళ్ళనందరినీ అండమాన్‌లో ఉన్న ప్రత్యేకమైన జైలులో నిర్బంధించి, అక్కడ కఠినమైన పనులు చేయించేవారు

అండమాన్‌కు ద్వీపాంతర శిక్ష అంటే – ఇక ఆ వ్యక్తి, యమపురికి పోయినట్టే

ఓడలోనుంచి దిగిన ఖైదీలందరి మెడల్లో వారికి ఎంత శిక్ష వేశారో అట్ట మీద వ్రాసి వ్రేలాడదీసేవారు

కొత్తగా వచ్చిన ఖైదీల్లో అత్యధిక శిక్ష పడ్డ వ్యక్తి వీర సావర్కార్ మాత్రమే!

జైలర్ అయన మెడకు తగిలించిన అట్టమీదున్న 'నలభై ఏళ్ళ శిక్ష' అనే, అంకెలను చూసి నవ్వి, "నలభై ఏళ్ళు శిక్ష పూర్తయ్యేవరకూ నువ్వు ఇక్కడ బ్రతుకుతాననుకుంటున్నావా?" అన్నాడు వ్యంగ్యంగా

వీర సావర్కార్ నవ్వి "నేను నలభైయేళ్ళు మాత్రమే కాదు – ఆ తరువాతా బ్రతుకుతాను! కాని, మీ ఆంగ్ల ప్రభుత్వమే ఈలోపు బలహీనపడి భారతదేశంలో బ్రతకలేక తోకముడుస్తుంది!" అన్నాడు.

ఆయన అన్నట్టే, ఆంగ్లసామ్రాజ్యపతనం అయి, మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది సావర్కార్ స్వాతంత్ర్యం అనంతరమూ జీవించే వున్నారు.

## మునిమాణిక్యంను నిద్రలేపిన పెద్దావిడ

తెలుగుహాస్యంలోని ప్రత్యేకతను ఆస్వాదించాలంటే, మునిమాణిక్యం నరసింహారావు గారి రచనలు చదవవలసిందే

ఈయన జీవితంలోనే ఎన్నో హాస్య సంఘటనలు జరిగాయి

ఒకసారి అయన మద్రాసు నుంచి తెనాలి వస్తున్నారు

ఆయనకు ఎదురుగా వున్న సీట్లోకి, ఓ పెద్ద ముత్తయిదువు, బాపట్లలో రైలు ఎక్కినామె కూర్చుంది. అమెకు అరవైఅయిదు పైచిలుకు వయసుంటుంది

రైలు కదలగానే ఆ కుదుపులకు ఉయ్యాలలూగించినట్టు నిద్రపడుతున్నదామెకు

ఆమె కళ్ళు మూస్తూ, తెరుస్తూ, తూలుతూ, నిద్రను ఆపుకోవడానికి, వ్యర్థప్రయత్నం చేస్తున్నది

అప్పటికి తెల్లవారు ఝామున మూడుగంటలు కావటంతో "నేను తెనాలిలో దిగాలి! కాస్త కునుకు తీస్తాను – తెనాలి స్టేషను రాగానే నిద్రలేపు బాబూ?" అంది, మునిమాణిక్యంతో.

"అలాగే తప్పక లేపుతాను! పడుకోండి పిన్నిగారూ! ఫర్వాలేదు – నేనూ దిగాలిగా తెనాలిలో" అన్నాడు, మునిమాణిక్యం, కళ్ళు మూసుకొని

అయితే, తీరా తెనాలి స్టేషను రావటంతో, ఆ పెద్దముత్తయిదువే మునిమాణిక్యాన్ని నిద్రలేపి, తనతోపాటు తెనాలిలో దింపింది

## బ్రతికివుండే తన మరణవార్త చదివిన కిప్లింగ్

భారతీయ వాతావరణాన్ని చిత్రిస్తూ, అనేక ఆంగ్ల నవలలు వ్రాసిన బహుముఖ ప్రజ్ఞాశాలి కిప్లింగ్.

దీనికి ఒక కారణము, కిప్లింగ్ భారతదేశములో పుట్టి పెరిగాడు.

1907లో ఆంగ్లసాహిత్యంలో, కిప్లింగ్ 42వ ఏట, ప్రపంచ ప్రసిద్ధ సాహిత్య నోబెల్ బహుమతి ఆయనకొచ్చింది

అంత చిన్న వయసులో నోబెల్ సాహిత్య బహుమతి వచ్చినవాళ్ళలో ఆయన ప్రథముడు

నిజానికి కిప్లింగ్ చనిపోయింది 1936లో

అయితే, అదే పేరున్న మరోవ్యక్తి చనిపోతే, కిప్లింగ్ చనిపోయాడని ఒక ప్రముఖ దినపత్రిక పతాక శీర్షికతో, ఫోటో వివరాలతో, ప్రచురించింది

అది చదివిన కిప్లింగ్‌కు మతిపోయింది

అతనికి సంతాప టెలిగ్రాములు కుప్పతెప్పలుగా వచ్చి పడసాగాయి

అయితే కిప్లింగ్, తన మృత్యువార్త ప్రచురించిన పత్రికా సంపాదకుడికి ఇలా చమత్కారంగా ఉత్తరం వ్రాశాడు

"మీరు ప్రచురించే ప్రతివార్తయొక్క వాస్తవికతను, మీరు దృఢపరచుకునే, ప్రచురిస్తారనుకుంటాను! దీనినిబట్టి నా మరణ వార్త కూడా నిజమై వుండాలని నమ్ముతున్నాను! కాబట్టి మీ పత్రిక చందాదారుల లిస్టులో నుంచి ఇకనైనా నా పేరు తొలగించి వేస్తారని విశ్వసిస్తున్నాను!"

## మునిమాణిక్యం పూర్వవిద్యార్థి

ఒకరోజు, ప్రొద్దు గూకింది బాగా చీకటి పడ్డది

మునిమాణిక్యం సైకిల్ నడిపించుకునే వెళుతున్నారు

అయినా ఒక పోలీస్ కానిస్టేబుల్ మునిమాణిక్యాన్ని సైకిల్‌తోసహా ఆపి "సైకిలుకు లైటు లేదేం?" అని ప్రశ్నించాడు, గద్దిస్తూ

"లేదుకాబట్టే – సైకిల్ నడిపించుకుపోతున్నాను లైటు వుంటే సైకిల్ ఎక్కే వెళ్ళేవాణ్ణిగా!" అన్నారు, మునిమాణిక్యం

"నేనంతా చూస్తూనే వున్నాను మీరు నన్ను చూసి సైకిల్ దిగారు ఇటు కాస్త దూరం నడుస్తారు నేను కనుమరుగు కాగానే మళ్ళీ సైకిల్ ఎక్కి ఉడా ఇస్తారు" అన్నాడు పోలీస్.

'ఉడా ఇస్తారు' అనే పదాలకు బదులు రెండు బూతులు వాడాడు, పోలీస్.

"పెద్దమనుషులతో మాట్లాడేప్పుడు, కాస్త సభ్యతతో, బూతులు ఉపయోగించకూడదని తెలియదా?" అన్నారు, మునిమాణిక్యం కోపంగా

చివరికి, మునిమాణిక్యానికి కోపం వచ్చి, యస్.ఐ దగ్గరకి వెళ్ళారు

ఆ యస్.ఐ. మునిమాణిక్యం పాత విద్యార్థే! ఆయన జరిగిందంతా విని, "పోలీసులు చదువు సంధ్యలు లేనివాళ్ళు! నేనంటే మీ దగ్గర చదువుకొన్నవాణ్ణి! అక్కడికీ నేను కాస్త మర్యాదగా మాట్లాడండిరా దొంగనాకొడుకుల్లారా అంటూ ." అంటూ పోలీస్ కాన్‌స్టేబుల్‌ని మించిన బూతుల పంచాంగం విప్పాడు ఆ యస్ ఐ మహానుభావుడు

## గురుదేవోభవ అన్న సర్ సి. వి. రామన్

ఠాగూర్ సాహిత్యంలో మొదటి 'నోబెల్' సాహిత్య బహుమతి పొందిన భారతీయుడు

అలాగే సైన్సులో మొదటి 'నోబెల్ బహుమతి' పొందినవాడు సి వి. రామన్

పేద కుటుంబంలో పుట్టి స్వయంకృషితో, తన ప్రతిభను ప్రపంచానికి చాటిన మహనీయుడు సి వి రామన్

సి వి. రామన్ ఎంత గొప్ప శాస్త్రవేత్తో, అంతకుమించిన నిగర్వి, వినయశీలి.

ఆయన విజ్ఞాన తృష్ణ అపారం నిరంతర విద్యార్థిగా ఆయన అనేక కొత్త విషయాలు అధ్యయనం చేస్తుండేవారు

తనకు లభించిన ప్రతి అవకాశాన్నీ, ఆయన తన అపార జ్ఞానాన్ని పెంపొందించుకోడానికి మరింత ఉపయోగించుకునేవారు

ఒకసారి ఆయనకు ఒక ప్రముఖ శాస్త్రవేత్త పరిచయమయ్యాడు

ఆ శాస్త్రవేత్త రంగులకు సంబంధించి అనేక పరిశోధనలు చేసి, డాక్టరేట్ పొందటమే కాక, తను అనేక పట్టికల్ని తయారు చేసుకున్నాడు

ఈ విషయం తెలిసిన రామన్ "నేను రంగులకు సంబంధించి, మీ అధునాతన పరిశోధనాంశాలు తెలుసుకుందామనుకుంటున్నాను. మీరెప్పుడు ఖాళీగా వుంటారు, దయచేసి చెప్పండి" అన్నారు

"మీరు రావటం ఎందుకు సార్! మీరు అడగాలే గాని మీ దగ్గరకు నా పరిశోధనాంశాలు, పట్టికలు తెచ్చి చూపనా?" అన్నాడు, ఆ పరిశోధకుడు

"కాదు, నేనే నీ దగ్గరికొస్తాను, విద్యార్థి నేర్చుకోడానికి గురువు వద్దకు వెళ్ళాలి కదా?" అన్నారు రామన్

## గోల్డ్‌స్మిత్‌కు మిత్రుడి సలహా

ఆలివర్ గోల్డ్‌స్మిత్ పేరు చెప్పగానే, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన కవి, రచయిత – ఆంగ్లసాహిత్యంలో దర్శనమిస్తాడు

ఇంగ్లీషు భాషలోని 'జాతీయత' బాగా పట్టుపడాలంటే – ఆయన వ్రాసిన నవల 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' చదవమంటారు – సాహితీ ప్రియులు, అభిమానులు

గోల్డ్‌స్మిత్ సాహితీ వేత్తకాకమునుపు, పూర్వాశ్రమంలో వైద్యవిద్యను అభ్యసించి, కొందరు ప్రముఖ వైద్యుల దగ్గర వైద్యాన్ని నేర్చుకున్నాడు

అయితే సాహితీ ప్రవృత్తి ప్రబలటంతో, వైద్యవృత్తి మానివేశాడు

కాని, అతను అనారోగ్యముతో వున్న ఆప్తమిత్రులకు మందులిచ్చేవాడు

ఒకసారి ఒక మిత్రుడు, చాలాకాలం తర్వాత గోల్డ్‌స్మిత్‌ని కలిశాడు

మాటల సందర్భములో "మిస్టర్ స్మిత్! నీవు వైద్య విద్య అభ్యసించావు కదా – ఎవరికైనా మందులు ఇస్తున్నావా?" అంటూ అడిగాడు.

"ఆ, ఎందుకివ్వటం లేదు! నా ఆప్తమిత్రులకు అప్పుడప్పుడూ మందులిస్తున్నాను" అన్నాడు

అప్పుడామిత్రుడు "దయచేసి ఇకనుంచి ఆ పనిచేయక" అన్నాడు

"మరేం చేయమంటావు?" అడిగాడు గోల్డ్‌స్మిత్

"దయచేసి, ఇకనుంచి నీ విరోధులకే మందులివ్వు స్వామీ!" అన్నాడు, మిత్రుడు

## 'స్తుతి'వల్ల పొంగిపోయిన మాణిక్యం

ప్రముఖ హాస్య రచయిత, శ్రీ మునిమాణిక్యం 'స్తుతి' – 'ఆత్మస్తుతి' అనే గ్రంధం వ్రాశారు

'స్తుతి' అనేది లలిత పదాలతో కూడి, రమణీయంగా వుంటుంది

అయితే స్తుతి వ్రాసేవాడూ, స్తుతింపబడేవాడు సహృదయులై వుండాలి

స్తుతి ఆత్మానందాన్ని యిస్తుంది! ఆనందం కలిగించే స్తుతిలో చమత్కారం వుంటుంది

స్తుతి ఎంత నిగూఢంగా వుంటే, ఎంత నర్మంగా వుంటే, అంత రమణీయంగా వుంటుంది

వేదుల సత్యన్నారాయణ శాస్త్రి, మునిమాణిక్యం మంచి మిత్రులు

ఒకసారి వేదులవారు "మునిమాణిక్యం – నీవు అంతా సి ఆర్ రెడ్డి లాగే వుంటావయ్యా!" అన్నారు

సి.ఆర్. రెడ్డి విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ సాహితీనిధి. అన్నింటిని మించి చమత్కార సంభాషణా చతురుడు, రచయిత, విమర్శకుడు ఈ స్తుతివల్ల మునిమాణిక్యం ఎంత ఆనందించారో చెప్పతరం కాదు

ఇలాగే ఒకసారి కాటూరు వెంకటేశ్వర్రావుతో మాట్లాడుతూ "నాకు ఈ మధ్యే యాభయి సంవత్సరాలు వెళ్ళినయ్" అన్నారు

దానికి కాటూరు వారు "ఏమిటీ! నీకు యాభై వెళ్ళినయ్యా! నీవు అసలు యాభై ఏళ్ళవాడిలా కనిపించవు – నీకు నలభై కంటే ఎక్కువ ఉంటాయని ఎవరూ అనుకోరే!" అన్నారట

"సాదృశ్యము" అనే భాగంలో మునిమాణిక్యం పై గ్రంధంలో ఈ ఉదాహరణ ఇచ్చారు

## రస్సెల్‌కు సలహా ఇచ్చిన వృద్ధుడు

తిక్కగా ప్రవర్తించే వింత మనుష్యులతో ఎలా ప్రవర్తించి, వాళ్ళను వదిలించుకోవాలో రెస్సెల్ అనుభవంతో నేర్చుకున్నాడు

ఒకసారి రస్సెల్ తన పర్యాటకంలో భాగంగా, ఒక గ్రామానికి వెళ్ళాడు

ఎండ బాగా మండిపోతూ, చికాకుగా వుంటే, శరీరతాపాన్ని చల్ల బరుచుకోడానికి, ఒక నదిలో దిగి, నగ్నంగా స్నానం చేస్తున్నాడు, రస్సెల్

రస్సెల్ విడిచిన బట్టలు, నది ఒడ్డున ఉన్నాయి

స్నానం చేసి, నదిలో నుంచి బయటకి వచ్చిన రస్సెల్ దుస్తుల ప్రక్కన, ఓ వృద్ధుడు చాలా తీవ్రంగా, రస్సెల్ వైపు చూస్తూ నిలబడ్డాడు

అతనెవరో, తనవైపు ఎందుకు కోపంగా చూస్తున్నాడో, రస్సెల్‌కు అర్ధం కాలేదు

ఇక ఆ వింతమనిషి రస్సెల్‌తో ఇలా అనర్గళంగా చెప్పసాగాడు

"ఆంగ్లేయులు కొందరు, తాము చరిత్రలో ఎప్పుడో తప్పిపోయిన కొన్ని తెగల వారనుకుంటారు. ఇది సరైన ఆలోచనా ధోరణి కాదు! నిజానికి, నీవంటి వారు కూడా, తక్కిన మన ఆంగ్ల జాతీయుల సంతతివారే! మనమంతా నిజానికి, 'జాకబ్ సంతతికి' చెందిన వారమే! – ఈ విషయం మరచిపోతే ఎలా?" అన్నాడు.

అసలు జరిగిందేమిటంటే – ఒక ఆటవికుడిలా, నగ్నంగా రస్సెల్ స్నానం చేస్తున్నందుకు ఆ వింతమనిషి అలా రెచ్చిపోయి ఉంటాడు.

ఏమి మాట్లాడితే ఏమవుతుందోనన్న భయంతో, రస్సెల్ ఆ ప్రసంగాన్ని ఓర్పుగా విన్నాడు.

# తనే 'జూలియస్ సీజర్' అనే తిక్కలోడు

రస్సెల్ తన జీవితకాలంలో, చాలా మంది తిక్కమనుషులను కలుసుకున్నాడు

అయితే – ఆ అనుభవాలన్నీ ఒక ఎత్తయితే, ఈ అనుభవం. ఒకటే ఒక ఎత్తు!

ఒకరోజు, ఒక తిక్కమనిషి రస్సెల్‌ను ఆయన ఇంటిలో కలిశాడు

ఆ వచ్చిన మనిషి పొట్టిగా వున్నాడు, గడ్డముంది కళ్ళు నీలంగా వున్నాయి అతను మాట్లాడే ఇంగ్లీషు పట్టి పట్టి మాట్లాడుతున్నాడు

"నేను మీతో అతిముఖ్యమైన ఓ తాత్త్విక విషయం మాట్లాడటానికి వచ్చాను" అన్నాడతను

"నేను రష్యా వాడినే! అయితే కమ్యూనిష్టును కాను! నాకు ఈ మధ్య చాలా వింత దృశ్యాలు కనిపిస్తున్నాయి ఏవో కొన్ని పనులు చేయమని అశరీరవాణి నన్ను ఆదేశిస్తున్నది ఆ ఆదేశాలు ఆచరణలో పెట్టాలా, వద్దా అని తేల్చుకోలేక, ప్రముఖ వేదాంతుల సలహాను, ఈ విషయంగా తెలుసుకోవడానికి వచ్చాను అవసరమైతే ఫారిన్ సెక్రటరీగా బ్రిటన్‌కు చెందిన గొప్ప అధికారిని కలుస్తాను" అన్నాడు

అప్పటికి ఆ వచ్చిన వ్యక్తిని వదలించుకోడానికి రస్సెల్ తన పుస్తకాలు బ్రిటీష్ మ్యూజియమ్‌లో దొరుకుతాయి, చదువమన్నాడు.

కొన్ని రోజుల తరువాత ఆ రష్యా దేశస్థుడు మరలా వచ్చాడు

అతను తనొక పుస్తకం, రస్సెల్ వ్రాసింది చదివానన్నాడు నిజానికి అది, రస్సెల్ తాత్త్విక చింతనను వ్యంగ్యంగా విమర్శిస్తూ ఎవరో వ్రాసినది

"మీరు వ్రాసింది – ఆ పుస్తకంలో ఒక్క విషయంలో నేను ఏకీభవించలేకపోతున్నాను" అన్నాడు వ్యక్తి

"అలాగా, ఏమిటది?" అడిగాడు, రస్సెల్ ఆతురతగా

"జూలియస్ సీజర్ చనిపోయాడని వ్రాశావు – అది తప్పు" అన్నాడతను

"ఎందుకని?"

"నేను జూలియస్ సీజర్‌ని కదా!?" అన్నాడు, ఆ రష్యా వ్యక్తి.

"అయితే ఫారిన్ సెక్రటరీ గారిని వెంటనే కలవండి" అన్నాడు రస్సెల్ అతనికి బయటికి దారిచూపుతూ

## మునిమాణిక్యాన్నే నవ్వించిన సంఘటనలు

మునిమాణిక్యం ఒకసారి ఒక కుగ్రామానికి వెళ్ళారు.

అక్కడి ప్రజలు ఎక్కువమంది అజ్ఞానులు, అమాయకులు.

ఒకరోజున ఒక ముసలాయన మునిమాణిక్యం దగ్గరికొచ్చి, భయపడుతూ, భయపడుతూ "బాబూ, మనకు స్వరాజ్యం వచ్చిందంటున్నారు! నిజమేనా?" అంటూ, రహస్యంగా అడిగినట్టు అడిగాడు

అతనికి ఏమిచెప్పినా అర్ధంకాదని మునిమాణిక్యం అర్థం చేసుకుని

"ఏదో వదంతిగానే వుంది లెండి" అన్నారు

"ఇంగ్లీషువారు మూటాముల్లె కట్టుకొని వెళ్ళిపోయారటగా?"

"ఏదో అంటున్నారు లెండి! అయినా మనకెందుకు లెండి ఎవరైనా వింటే తంటా వస్తుంది"

"నిజమే! మనకెందుకు వచ్చినగోల" అంటూ వెళ్ళాడా వృద్ధుడు

తరువాత మునిమాణిక్యం గుంటూరుకొచ్చి జట్కాబండిలో ప్రయాణం చేస్తున్నారు

అప్పుడు టైం ఏడుగంటలైంది

ఎలక్ట్రిక్ లైట్లు వెలిగాయి కాని, అవి వెలవెల పోతున్నాయ్

ఆయన బండివాడితో "ఏమోయ్! ఈ ఎలక్ట్రిక్ లైట్లు ఇల్లాగ ఉన్నాయేం?" అన్నాడు

"ఎండలు కాదండీ బాబూ! ఈ మండుటెండలకు మనుషులే అర్చుకుపోతున్నారు! లైట్లు మాత్రం ఆర్చుకుపోవాండి" అన్నాడు బండివాడు మునిమాణిక్యాన్ని నవ్విస్తూ

## ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ విసిరిన చణుకు

భారత రాష్ట్రపతిగా పనిచేసిన ఫక్రుద్దీన్ అలీ అహ్మద్, అంతకు పూర్వం సెంట్రల్ కేబినెట్ మినిష్టరుగా పనిచేసిన వ్యక్తి

రాజ్యసభలో, ఆ రోజు ఫక్రుద్దీన్ ఆలీగారు ఏవో ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి వుంది.

ఆయనను ఏవేవో ప్రశ్నలు వేసి, తికమక పెట్టాలని కొందరు ప్రతిపక్ష సభ్యులు సిద్ధంగా వున్నారు.

ఇంతలో ఓ సభ్యుడు లేచి "సార్! మీరు పదహారేళ్ళ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నారన్నది నిజం అవునా – కాదా? – ఇది ముందు సభకు చెప్పండి" అంటూ, పెద్ద బాంబులాంటి ప్రశ్న వేశాడు

అయితే ఫక్రుద్దీన్ ఆలీగారు, తొట్రుపడలేదు

"అవును, మీరన్నది నిజమే – నేను పదహారేళ్ళ అమ్మాయిని రెండో పెళ్ళి చేసుకున్నాను!" అన్నారు

ఈ ఊహించని సమాధానంతో ప్రతిపక్ష సభ్యులు, విజయం తమదే అన్నట్టు ఆనందంతో కేరింతలు కొట్టారు.

పాలకపక్ష సభ్యులంతా 'షాక్' అయి నిశ్శబ్దంగా వుండిపోయారు

అయితే, సభ ప్రశాంత పడగానే "ఔను! నేను రెండవ వివాహంగా పెళ్ళాడింది, పదహారేళ్ళ అమ్మాయినే అయితే ఇది జరిగింది నాలుగు దశాబ్దాల క్రితం!" అన్నారు, ఫకృద్దీన్

ఈ వివరణతో పాలకపక్ష సభ్యులయినవారూ, ప్రతిపక్షసభ్యులూ, తమ హర్షాన్ని వ్యక్తం చేశారు

గంభీర వాతావరణం, క్షణాల్లో ఆహ్లాదవాతావరణంగా మారిపోయింది

## మునిమాణిక్యం లెక్కలు

ఒకరోజు మునిమాణిక్యం వాళ్ళబ్బాయికి 'పని – కాలము' – దానికి సంబంధించిన లెక్క చెబుతున్నారు ఆయన వృత్తిచేత మాష్టారు

"ఒక తొట్టిలోకి పైనున్న పంపులోనుండి నీళ్ళు పడుతున్నవి ఆ తొట్టిలో 5 గేలనుల నీళ్ళకు చోటుంది అయితే ఆ తొట్టికి రంధ్రముంది ఆ తొట్టి నిండటానికి –" అంటూ లెక్క వివరించి చెబుతున్నారు.

ఆ లెక్క వాళ్ళబ్బాయికి, ఆయన కోప్పడే చెబుతున్నారు

ఈ గొడవంతా ఆయన శ్రీమతి వింటూనే వున్నది. గదిలోనుంచి ఆమె కోపంగా బయటికి వచ్చి "మీ గొడవ అంతా వింటూనే వున్నాను ఆ తొట్టి చిల్లిది అది చస్తే నిండదు. ఒక చెంప పైనుండే నీళ్ళు

పడుతుంటే, ఇంకో చెంప నీళ్ళు కారిపోతుంటే ఆ తొట్టె నిండటం ఏమిటి? వెధవ లెక్కలు, అయినా చిల్లితొట్టిలో నీళ్ళు నింపాలని ప్రయత్నం ఏమిటి? చిల్లికి కాస్త మాటు వేయిస్తే పోయేదానికి ఇటువంటి పిచ్చిలెక్కలు చెప్పకపోతేనేం? కాస్త సంసారం పొదుపుగా చేసుకోవాలని, పాత్రలకుగాని గిన్నెలకు గాని, తొట్లకు గాని రంధ్రాలుంటే మాటు వేయించుకోవాలని సలహా చెప్పండి అంతేగాని ఈ పిచ్చి లెక్క లేమిటి?", అంది

మునిమాణిక్యానికి ఏం చేయాలో తోచలేదు

## యుద్ధం చేసేవాళ్ళకు 'కాంతం' సలహా

అవి రెండో ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులు

అందరి దగ్గరినుంచి చందాలు వసూలు చేస్తున్నారు

జమీందారులు వేలకువేలు ఇస్తున్నారు.

సామాన్యులు కొద్ది మొత్తాలు ఇస్తున్నారు

మొత్తంమీద ప్రతివ్యక్తి దగ్గరి నుంచి ఏదో కొంత ఎంత చిన్న మొత్తం అయినా సరే వసూలు చేస్తున్నారు

అలా వసూలు చేస్తున్నవారు మునిమాణిక్యం గారింటికి వచ్చారు

"మేము ఏమి ఇవ్వగలమండి, బీదవాళ్ళం" అన్నారు, మునిమాణిక్యం

"మీకు తోచింది ఇవ్వండి దమ్మిడీ ఇచ్చినా పుచ్చుకుంటాం" అన్నారు చందాకోసం వచ్చినవాళ్ళు

చూస్తూ చూస్తూ పెద్ద అధికారులు వచ్చినప్పుడు దమ్మిడీ ఎట్లా ఇచ్చేదని, ఒక అర్థరూపాయి చందా ఇచ్చారు మునిమాణిక్యం

కాంతం ఇదంతా తలుపు చాటు నుంచి చూస్తూనే వుంది ఆమె జరిగింది తెలుసుకుని "మీరేమిచ్చారు" అంది

"అర్థరూపాయి!"

"అర్థరూపాయా! అర్థరూపాయి గతిలేనివాళ్ళు యుద్ధం ఎందుకు ప్రారంభించారండి! కాస్త చేతిలో డబ్బు చూసుకునే మొదలుపెట్టకపోయినారు యుద్ధం" అన్నది కాంతం ఈసడింపుగా

## ఇద్దరు రాష్ట్రపతులు - ఛలోక్తులు

రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ ఎంత పండితుడో, అంతకు మించిన వేదాంతి అందుకే ఈ గంభీరత

అయితే, ఆయన రాజ్యసభలో అప్పుడప్పుడు తన గంభీరతను వదలి సమయానుకూలంగా, సమయస్ఫూర్తితో చణుకులు విసిరేవారు

ఒకసారి రాజ్యసభలో ప్రశ్నోత్తరాల సమయంలో, రాజ్యసభ సభ్యులు – సీతా పరమానంద్, సావిత్రీ దేవి, పార్వతీ దేవి అని పేర్లున్న వాళ్ళు వరుసగా ప్రశ్నలు వేస్తున్నారు

రాజ్యసభకు అధ్యక్ష పీఠంలో వున్న వైస్ ప్రెసిడెంట్ రాధాకృష్ణన్ "మంచిది! ఈవేళ మనతో సీత, సావిత్రి, పార్వతి వున్నారు సంతోషం" అన్నారట

వెంటనే అదే సభలో వున్న మహావీర్ త్యాగిలేచి "సీత, సావిత్రి, పార్వతే కాదు – సార్! ఈ వేళ మాతో రాధాకృష్ణులూ స్వయంగా వున్నారు" అన్నారట అంతా హాయిగా నవ్వుకున్నారు

శ్రీ వి వి గిరి భారత రాష్ట్రపతిగారికున్న సంతతి, బహుశ ఏ రే రాష్ట్రపతికీ లేదేమో! ఆయన కొడుకులు, మనుమలు, మునిమనుమలతో ఇల్లంతా పెద్ద దోసపాదులా వుంటుంది

ఒకసారి ఇదే విషయం ఓ పాత్రికేయుడు ప్రస్తావిస్తూ "ఫ్యామిలీ ప్లానింగ్ మీరెందుకు అమలు చేయలేదు?" అంటూ అడిగాడు

అయితే, గిరిగారు నిండుకుండగా తొణకకుండా "ప్లానింగ్ ఎందుకు అమలు చేయలేదు! చేశాను – అయితే – నా ప్లానింగ్ నా ఫ్యామిలీ పెద్దదిగా వుండాలన్నది – అదే తేడా" అన్నారు, చమత్కారంగా నవ్వుస్తూ

## రాధాకృష్ణన్ ఛలోక్తులు

రాజ్యసభలో రాధాకృష్ణన్ వుంటే, ఆయన పైకి ఎంత గంభీరంగా వుంటారో, సమయం వస్తే చణుకులు విసరటంలో, ఆయనకు ఆయనేసాటి

రాధాకృష్ణన్ అంటించే చురకలో ఎంత వ్యంగ్యం వుంటుందంటే ఆ వ్యంగ్య వైభవానికి అందరూ నవ్వవలసిందే

ఒకసారి రాజ్యసభలో నెహ్రూజీ ఒక ప్రశ్నకు సమాధానం ఇవ్వటానికి లేవగానే, భూపేష్ గుప్తా మధ్యలో లేచి "ప్రధానమంత్రి గారూ! దయచేసి నన్నొక సమయోచితమైన ప్రశ్న అడగనివ్వండి" అన్నారు

వెంటనే రాధాకృష్ణన్ "ఈయన మొదటిసారి, రాజ్యసభలో సమయోచితమైన ప్రశ్న వేస్తున్నారు! అందరూ సావధానంగా వినండి" అన్నారు

అంతే భూపేష్ గుప్తాతో పాటు, అందరూ నవ్వుల్లో మునిగిపోయారు

రాధాకృష్ణన్ కంటిశుక్లపు ఆపరేషన్‌కు ఇంగ్లాండ్‌కు వెళ్ళారు

అయితే, ఆ విషయం తెలుసుకున్న భారతీయ పత్రికా విలేఖరులు, కొందరు "ఏం సార్! భారతదేశంలో, ఈ పాటి కంటి శుక్లం తీసే నేత్ర వైద్య ప్రముఖులు లేరా?" అన్నారట, విమర్శగా

అయితే, రాధాకృష్ణన్ అందుకు తొణకకుండా "లేకేం వున్నారు! ఒకసారి ఒక కంటికి శుక్లం తీశారు! వాళ్ళ పుణ్యాన నేను శుక్రాచారినయ్యాను! ఇక రెండో కంటికి ఆపరేషన్ చేయించుకుంటే ఈసారి ధృతరాష్ట్రుడినయ్యాననుకోండి! ఇబ్బందిలో పడిపోతాను కదా?" అన్నారట, నవ్వేస్తూ

## కస్తూరి 'బా' ఆంగ్లపు ప్రత్యేకత

**క**స్తూరి బా గాంధీజీ శ్రీమతి అయినా, ఆమెకు ఇంగ్లీషు బొత్తిగా రాదు గుజరాతీ వచ్చు

అయితే, ఆమె కష్టపడి ఆపద్ధర్మంగా వుండే ఇంగ్లీషు ముక్కలు నాలుగు నేర్చుకుంది

ఒకసారి ఆమె తమిళనాడులో, రాజాజీ నడుపుతున్న ఒక గాంధి ఆశ్రమాన్ని చూడటానికి వెళ్ళింది

రాజాజీ కస్తూరి బాకు, ఆశ్రమంలోని వివిధ భాగాలు, అక్కడ ఆశ్రమ కార్యకర్తలు తయారు చేస్తున్న వివిధ వస్తువులు చూపుతున్నారు

అప్పుడామె ఖద్దరు గుడ్డలకు అద్దకం వేస్తున్న స్థలానికొచ్చింది

అక్కడి రకరకాల రంగుల్ని చూస్తున్న కస్తూరి బా ఆనందం పట్టలేక, ఇంగ్లీషులో ఓ గుడ్డ చూపుతూ 'దిస్ కలర్ గో' – (ఈ రంగు వెలుస్తుందా) అంటూ అడిగింది

రాజాజీ కూడా మంచి సమయస్ఫూర్తి వున్నవారు కావటంతో 'దిస్ ఈజ్, నో గో కలర్' (ఈ రంగు పోదు) అనే ఆంగ్లపదాలు వాడారు.

దీనితో చుట్టూవున్న వాళ్ళంతా ముసిముసిగా నవ్వుకున్నారట

నిజానికి రాజాజీకి చాలామంచి ఇంగ్లీషు వచ్చు అయన ఆంగ్లంలో మంచి రచనలు చేసిన దిట్ట.

"నేను మాట్లాడిన ఇంగ్లీషులో తప్పులున్నాయా?" అంటూ కస్తూరి బా, అనుమానంగా అడిగితే –

"ఇది 'బా' గారి ఇంగ్లీషు కదా?" అన్నారట, తనూ నవ్వుతూ, రాజాజీ.

## బాలనెహ్రూ సమయస్ఫూర్తితో సమస్యాపరిష్కారం

అలహాబాదు నగరంలో అతి పెద్ద భవంతి 'ఆనంద్ భవన్'. దాని ప్రక్కనే పెద్ద తోట వుంది. ఒకరోజు ఆ తోటలో పిల్లలు చేరి బ్యాటుతో బంతి ఆట ఆడుతున్నారు

ఒక పిల్లవాడు ఆటలో మునిగిపోయిన వుత్సాహంతో కసిగా గట్టిగా బంతిని ఆకాశంలోకి ఎగిరేట్టు ఒక్కదెబ్బ కొట్టాడు

అక్కడ అతనితోపాటు ఆడుతున్న పిల్లలు ఆనందంతో కేరింతలు కొట్టి "భలే! భలే! బంతి అబ్బో ఎంతపైకి పోయిందో" అంటూ చప్పట్లు చరిచి, తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు

అయితే ఎవరూ ఊహించని విధంగా, ఆకాశంలో ఎగిరిపోయిన బంతి ఒక్కసారిగా క్రిందికి దిగి చివరికి ఓ పెద్ద మర్రిచెట్టు తొర్రలో పడింది

తొర్ర లోతుగా వుండటంతో చిన్న చేతులకు అది అందనంత లోతులో వుండిపోయింది. పిల్లలంతా "ఇక ఆట ఆడేదెలా! ఆట ఇంతటితో ఆగిపోయినట్టేగా" అంటూ విసుక్కుని, అంతవరకు పొగిడిన ఆ అబ్బాయినే తిట్టసాగారు.

ఆ పసివాడు, అసహాయంగా బిక్కమొహం వేశాడు ఇంతలో అటుగా వచ్చిన కుర్రవాడు పరిస్థితి అర్థం చేసుకున్నాడు

అతను పరుగు పరుగున వెళ్ళి ఒక పెద్ద బాల్చీతో నీళ్ళు తోటమాలి సాయంతో తెప్పించాడు ఆ తొర్రలో నీళ్ళు కొద్దికొద్దిగా పోస్తూ చివరికి ఆ బంతిని నీళ్ళతోపాటు పొర్లిపోయి క్రింద పడేట్టు చేశాడు

ఆ పిల్లలకు అలా సమయస్ఫూర్తితో సాయంచేసిన ఆ చురుకైన బాలుడే మన దేశానికి ప్రప్రథమ ప్రధాని అయిన జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా సమయస్ఫూర్తితో నిజంగానే భారతదేశానికి వచ్చిన అనేక విపత్తులను ఆయన పరిపాలనలో అధిగమించగలిగాడు

## ప్రమాదకరమైన తీవ్రవాది ఆచార్య కృపలానీ

బాపూజీ బీహారు రాష్ట్రంలోని, చంపారన్ ఆశ్రమంలో వుండే స్వాతంత్ర్య సమర కార్యక్రమం నడుపుతుండేవారు

ఒకసారి పోలీస్ కమీషనర్ చంపారన్ ఆశ్రమానికి వచ్చి "మీ వల్ల మాకు ఇబ్బంది లేదు గాంధీజీ! మిమ్మల్ని మేము నమ్ముతాం మీరు చేయబోయే కార్యక్రమం ఏమిటో ముందే చెప్పి చేస్తారు అయితే, మీ అనుచరుల్లో కొంతమంది చాలా ప్రమాదమైన వారున్నారు. అందులో ఈ ఆశ్రమంలోనే, ఆ వ్యక్తి వున్నట్లు మాకు సమాచారం అందింది అతను పెద్ద తీవ్రవాది అని, ఖైదునుంచి ఒకసారి పారిపోయిన రికార్డు అతనికుందని తెలిసింది" అన్నాడు

గాంధీజీ ఆ మాటలకు నవ్వి "అలాంటి ప్రమాదకారు లెవరూ నా శిష్యుల్లో లేరు మీరు చెప్పే యువకుడి ఫోటో చూశారుగా! అతన్ని గుర్తుపట్టి మీరతన్ని గురించి తెలుసుకున్నది నిజమో కాదో, మీరే నిర్ణయించండి" అంటూ పోలీసు కమీషనర్‌ను, ఆశ్రమంలోపలికి తనిఖీకి తీసుకెళ్ళారు

అక్కడ కస్తూరిబా వంట చేస్తుంటే, ఆమెకు పుల్లలు అందిస్తూ, ఒకచేత్తో విసనికర్రతో విసరతూ, మంటను ప్రజ్వలింపజేస్తూ, ఒక యువకుడున్నాడు

చొక్కా లేకుండా, అంగవస్త్రంతో సన్నగా, ఎర్రగా, గుండుతోవున్న ఆ యువకుణ్ణి చూపి "మీరు భయపడుతూ చెప్పిన, ఆ తీవ్రవాది అయిన యువకుడితనే! ఇతని పేరు ఆచార్య కృపలానీ!" అంటూ గాంధీగారు, పరిచయం చేశారు, పోలీస్ కమీషనర్‌కు

"అయితే మరి, రిపోర్టు ఫోటోలో ఉన్న యువకుడితనే!" అంటూ, అరెస్టు చేయకుండా వెళ్లిపోయాడు కమీషనర్

## వివేకానందుడు 'విజయసాధనకు' చెప్పినమార్గం

అమెరికాలోని చికాగో నగరంలో, 'ప్రపంచమతాల సమావేశం'లో పాల్గొనటానికి వివేకానందుడు వెళ్ళాడు అప్పుడు, ఒకరోజు ఆయన, నదివొడ్డుకు షికారుకెళ్ళాడు అలలు అలలుగా కదులుతున్న నీటిలో ఈదుతున్న వారు కొందరైతే, కొందరు పిల్లలు చెక్కతో చేసిన ఆటపక్షులు నీటిలో ఈదుతుండగా, వాటిని చిన్న తుపాకీతో కాల్చటానికి ప్రయత్నిస్తున్నారు

చెక్కపక్షులు నీటి అలల కదలికకు స్థిరంగా లేకపోవటం చేత, కదలిపోతున్న ఆ పక్షులను చిన్న తుపాకీతో కాల్చటంలో అందరూ విఫలమవుతున్నారు

కాషాయవస్త్రాల్లో అటు సాధురూపంలో వెళ్ళిన వివేకానందుడు ఆ పిల్లల ఆటను, చెక్కపక్షులను గురిచూసి తుపాకీతో కాల్చలేని వారి అసహాయతను చూసి మందహాసం చేశాడు

వివేకానందుడి సాదురూపాన్ని తేలిగ్గా తీసుకున్న అక్కడి పిల్లలు "అలా నవ్వకపోతే నువ్వూ ఓ ప్రయత్నం చేసి నీ గురి ఏపాటిదో నిరూపించవచ్చుగా" అన్నారు, రెచ్చగొడుతూ

వివేకానందుడు, తన చేతిలోకి ఆ చిన్న తుపాకీ తీసుకుని "నేను ఓ ప్రయత్నం చేస్తాను" అన్నాడు

తరువాత అలలమీద స్థిరం లేకుండా కదులుతున్న పక్షులను ఏకాగ్రతతో చూస్తూ వరుసగా పన్నెండు చెక్కపక్షులను తుపాకీతో కొట్టి పడగొట్టాడు

ఆయన ప్రతిభా నైపుణ్యానికి ఆశ్చర్యపోయిన ఆ పిల్లలు "ఇంత ఖచ్చితంగా తుపాకీని పేల్చడానికి మీకు ఇంత గురి ఎలా వచ్చింది? ఎక్కడ నేర్చుకున్నారు?" అంటూ అడిగారు

"ఎక్కడా నేర్చుకోలేదు మనం చేసే పనిమీదే మన ధ్యాస వుండాలి ఎప్పుడైతే ఆ గురి కుదురుతుందో, అదే మీ విజయానికి సోపానం" అన్నారు స్వామి వివేకానంద

# దేవేంద్రనాథ్ ఠాగూర్‌ని మహర్షిని చేసిన సంఘటన

రవీంద్రనాథ్ ఠాగూర్ తండ్రి మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ అయన సాహితీ కృషి గొప్పదైనా, అయన అధ్యాత్మిక వేత్తగా మరింత ప్రసిద్ధుడు బ్రహ్మసమాజ సారధి రామమోహన్ రాయ్ తర్వాత అంతటి ప్రాధాన్యత పొందిన వ్యక్తి దేవేంద్రనాథ్ ఠాగూర్

అయన 'ఆత్మజీవని', 'బ్రహ్మధర్మవ్యాఖ్యానం' అనే గ్రంధాలు ఉపనిషత్తుల్లో, భగవద్గీతలో, సంస్కృతకావ్యాల్లో చెప్పిన జీవిత సాధనకోసం చేసిన అన్వేషణను తెలియచేస్తాయి

దేవేంద్రనాథ్ జమీందారు కావటం వల్ల అయన యవ్వనం తొలిదశలో అయన వయసు యువకుల్లా వైభవాలు అనుభవించాడు, బాల్యంలో యవ్వనంలో కొన్ని కొంటె పనులు చేసినట్టు స్వయంగా, అయన అత్మకధలో వ్రాసుకున్నాడు

అయితే, ఇరవై ఒకటవ ఏట అయన జీవితంలో జరిగిన ఒక సంఘటన, అయన జీవిత విధానాన్ని అధ్యాత్మికత వైపుకు మార్చివేసింది.

దేవేంద్రనాథ్‌ను చిన్నప్పటి నుంచి, ఒక అవ్వ అమితప్రేమగా పెంచింది ఆమెను వదలి క్షణం వుండలేకపోయేవాడు ఆమె బాగా వృద్ధురాలై ఇక మృత్యుముఖంలోకి ప్రవేశించే స్థితి ఏర్పడింది

ఆ రోజుల్లో చనిపోనున్న ముసలివాళ్ళను గంగానదీ తీరానికి తీసికెళ్ళి ఊపిరిపోయేవరకు అక్కడ పడుకోబెట్టేవారు దీన్ని 'అంతర్జలి' అంటారు అలాగే దేవేంద్రనాథ్‌ను పెంచిన అవ్వను గంగానదీ ఒడ్డున పడుకోబెట్టారు అవ్వను వదలి వుండలేని దేవేంద్రనాథ్ ఆమె ప్రక్కనే ఒక తుంగచాపమీద ఒదిగి కూర్చుని వున్నాడు ప్రాణి ఈ లోకాన్ని వదిలేప్పుడు పడే ఆవేదన, ప్రాణం పోయేప్పుడు కలిగే బాధ స్వయంగా చూసినప్పుడు "లోకం మిధ్య! ఈ సంపదలు భోగభాగ్యాలు అశాశ్వతాలు! జీవికి మరణం ఎందుకు? మరణం తరువాత ఏమిటి?" అనే అధ్యాత్మిక భావాలు దేవేంద్రనాథ్ ఠాగూర్‌కు కలిగాయి ఆ సంఘటన 1838లో జరిగింది అప్పటికి అయన వయస్సు 21 సంవత్సరాలు

# కస్తూరిగాంధి పట్టుదల

గాంధీగారి శ్రీమతి కస్తూరిబాకు ఒకసారి తీవ్ర అస్వస్థత కలిగి, శస్త్రచికిత్స అవసరమైంది ఆమె ఎంతో దుర్బలంగా వుండటంతో మత్తుమందు ఇచ్చే అవకాశం లేక వైద్యుడు శస్త్రచికిత్స చేయవలసి వచ్చింది

ఆమె ఆ బాధను ఎంతో సహనంతో ఓర్చుకుంది గాంధీగారు తరువాత వెళ్ళి, ఆమెను ఇంకా కోలుకొనేవరకు ఆసుపత్రిలోనే ఉండమన్నారు

నీరసంగా ఉన్న కస్తూరిబాకు 'గో మాంసపారం' ఇస్తే తప్ప ఆమెకు నీరసం తగ్గదని అర్థం చేసుకున్న వైద్యుడు, ఆ విషయం టెలిఫోనులో గాంధీగారికి తెలియజేశాడు

గాంధీజీ ఆ విషయాన్ని తిరస్కరిస్తూ, కస్తూరి బా చెప్పే స్థితిలో వుంటే ఆమె అనుమతి తీసుకోమని వైద్యుడ్ని కోరాడు

తరువాత గాంధీగారు వెంటనే వైద్యుడి దగ్గరకు వెళ్ళగానే "మీకు ఆ విషయం చెప్పేటప్పటికే మీ శ్రీమతికి గోమాంసపారం ఇచ్చాను," అంటూ వైద్యుడు చావుకబురు చల్లగా చెప్పాడు

గాంధీగారు బాధపడిపోతూ "ఎంతమోసం చేశారండీ" అన్నాడు

వెంటనే వైద్యుడు "రోగికి ఔషధం, పథ్యం ఇవ్వటంలో మోసపు ప్రసక్తి రాదు. రోగి ప్రాణాలు రక్షించటానికి, రోగులను వారి బంధువులనైనా ఇలా మోసగించటం కూడా వైద్య ధర్మమే!" అన్నాడు

డాక్టరుకు గాంధీగారి మధ్య జరిగిన సంభాషణ గాంధీజీ చెప్పగా విన్న కస్తూరి బా "గోమాంసపారం నేను సేవించను పరమ పవిత్రమైన మానవజన్మ ఎత్తి, దానిని ఇలా గోమాంసపారంతో కలుషితం చేసేకంటే, మీ చేతులమీదుగా వెళ్ళిపోవటమే నాకు ప్రియం" అన్నది

"అయితే నా చికిత్సా విధానం పై మీకు నమ్మకం కుదరకపోతే ఆమెను వెంటనే మీరు ఇక్కడి నుండి తీసికెళ్ళండి," అన్నాడు వైద్యుడు నిస్సహాయంగా

గాంధీజీ ఆమెకు ప్రకృతి వైద్య విధానంలోని జలచికిత్స చేసి, ఆమె ప్రాణం కాపాడారు

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి ప్రత్యేకత

'అష్టభాషా విశారదులు', 'చతుర్విధ కవితా ప్రవీణులు', 'శతాధిక గ్రంధకర్తలు' అనేవి, ఈ అధునిక యుగంలో వర్తింపచేయటానికి సరైన ఉదాహరణ శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

బహుభాషా పాండిత్యంతోపాటు, సంగీత సాహిత్యాలలో ఆయన నిధి కొన్నివేల కృతులు రచించారు. భరతనాట్య శాస్త్రంలో వీరు గొప్ప పండితులు.

నారాయణాచార్యుల పేరు చెప్పగానే మనకు ఆయన రచన 'శివ తాండవం' గుర్తుకు వస్తుంది ఈ రచనలో, వారి సంగీత, సాహిత్య, నాట్య శాస్త్ర పాండితీప్రతిభ కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది

ఈయన 1914లో జన్మించారు తన 20వ ఏట మద్రాసు విశ్వవిద్యాలయం 'విద్వాన్' పరీక్షకు కూర్చున్నారు

ఇక్కడ వింత విషయమేమిటంటే – ఆయన పరీక్షకు సిద్ధమైన పాఠ్యాంశాల్లో ఆయన వ్రాసిన 'పెనుగొండలక్ష్మి' అనే కావ్యమూ వుండటం, నమ్మలేని నిజం ఇది అయన 14వ ఏట వ్రాశారు

ఆ ఖండకావ్యాన్ని, తనే వ్రాసినదాన్ని పరీక్షకోసం తనే చదువుకోవలసి వచ్చింది

తెలుగుతోపాటు, తమిళ, మలయాళ, కన్నడ, మహారాష్ట్ర, సంస్కృత, ఆంగ్లభాషల్లో ఆచార్యులవారు గొప్ప పండితులు

ఈయనకు పన్నెండు భాషల్లో మంచి ప్రవేశముంది బహు భాషావేత్తగా వినోబా తరువాత ఈయన పేరే చెప్పాలి రాయలసీమ రత్నంగా కీర్తి గడించిన మహా మనీషి శ్రీ పుట్టపర్తి

## చలాన్ని 'విప్లవవాది'ని చేసిన సంఘటన

తెలుగు సాహితీ నిర్మాతల్లో అగ్రశ్రేణి రచయితగా చలానికి ప్రత్యేక స్థానం వుండటానికి కారణం అయన స్త్రీ స్వేచ్ఛకిచ్చిన ప్రాధాన్యతే స్త్రీలు బాధితులవటానికి కారణం అధికార స్థానంలో పురుషులు నియంతృత్వంతో వుండటమే

వివాహ వ్యవస్థ మీద, సెక్స్ సంబంధాల మీద, సంప్రదాయం మీద దండెత్తటానికి చలాన్ని ప్రోత్సహించిన సంఘటన ఆయన జీవితంలో నిజంగా జరిగింది

అప్పుడు చలం హైస్కూలు విద్యార్థి చలం చెల్లెలు అమ్మణ్ణికి ఇష్టంలేని వివాహం, సాంప్రదాయ బద్ధంగా జరిగింది తర్వాత ఈ అమ్మాయి యీడేరడంతో ఆమెకు 'కార్యం' నిర్వహించ సిద్ధపడ్డారు అమ్మాయి ఏడుపుచూసి "మా చెల్లెలికి ఇష్టముందో లేదో తెలుసుకున్నావా?" అని ప్రశ్నిస్తూ ఉత్తరం వ్రాశాడు చలం, బావగారికి

"ఇట్లాంటి అభిప్రాయాలు తలకెక్కుతున్నాయని తెలిసే దాన్ని తీసుకుపోదామని వస్తున్నాను" అంటూ ఉత్తరం వ్రాశాడు బావగారు

'కార్యం' రాత్రి చెల్లెలికి నైతికంగా తన అండదండలున్నాయని నిరూపిస్తూ, తన తోటి స్నేహితుల్ని కూడదీసి 'కార్యం' జరగకుండా చేయాలని గట్టి ప్రయత్నం చేశాడు చలం

తండ్రి వచ్చి చలాన్ని కొట్టాడు చలం తిరగబడ్డాడు. చివరికి తండ్రి చలాన్ని యింట్లోనుంచి గెంటివేశాడు పెద్ద గొడవ జరిగింది

ఈ సంఘటనే చలం మనస్సులో స్త్రీ స్వేచ్ఛను గురించి ఆలోచించేట్టు చేసింది తను మద్రాసులో బి ఎ చదువుతూ, భార్య చిట్టి రంగనాయకమ్మను కాన్వెంట్ లో ఆ రోజుల్లో చదివించటానికి పెద్దలు ఒప్పుకోకపోతే, దానిమీద తిరుగుబాటు చేశాడు చలం ఇలాంటి స్వేచ్ఛాలాలసే ఆయన రచనలు చేయడానికి కారణమైనది

## మహా త్యాగధనుడి అసహాయత

భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న మహనీయులు చేసిన త్యాగాలు మాటలతో వర్ణించటానికి మానవుల కసాధ్యాలు

నెహ్రూ తరువాత దేశ ప్రధాని అయిన లాల్ బహదూర్ శాస్త్రి చేసిన త్యాగాలు, పడిన కష్టాలు, అనుభవించిన దారిద్ర్యం, 'నభూతో న భవిష్యతి' అనేట్టుంది

ఒకసారి లాల్ బహదూర్ శాస్త్రిని మూల్హా జైలునుంచి, ఫైజాబాద్ జైలుకు మార్చబోతున్నట్టు తెలిసింది ఈ విషయం భార్య లలితకు వ్రాసి,

తనను చూడటానికి వచ్చేప్పుడు, పూరీలు, బటానీకూర తెమ్మనమని ఆయన తెలియజేశాడు.

వారంలో ఒకసారి, ఖైదీలను చూడటానికి అనుమతి వుండటంతో, మాల్వా జైలుకు ప్రయాణమై వెళ్ళటానికి దారి ఖర్చులకు కావలసిన రెండు రూపాయలు కూడబెట్టటమే ఆమెకు బ్రహ్మప్రళయంగా వుండేది.

ఎప్పుడూ జాతీయ ఉద్యమాల్లో తిరుగుతూ, జైళ్ళకు వెళుతూ, ఉద్యోగం – ఆదాయం లేని భర్త పరిస్థితి తెలిసిన లలితాదేవి కుటుంబాన్ని ఎంతో కష్టం మీద, అనేక పస్తులుంటూ, లాక్కొని వస్తున్నది అసలు మాల్వా జైలుకు వెళ్ళి భర్తను చూడటానికి చేతిలో ఎట్టిని ఏగాని లేకపోవటం చేత, ఆమె పక్కింటి వారివద్ద రెండు రూపాయలు చేబదులు తీసుకుని, కొంతదూరం నడచి, కొంతదూరం రైలు ప్రయాణం చేసి ఖైదుకు చేరింది

ఆమెను చూడగానే శాస్త్రీజీ 'పూరీలు, కూర ఏవీ?' అంటూ అడిగారు, ఆతురతగా.

సమాధానంగా ఆమె కన్నీరు పెట్టుకుంది విషయం అర్థమైన శాస్త్రిగారు బాధగా నవ్వి తలదించుకున్నారు

## రాష్ట్రపతి రాజేన్‌బాబు కర్తవ్యనిర్వహణ

మన ప్రప్రథమ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ స్వాతంత్ర్య సమరంలో చాలామంది ప్రముఖ రాజకీయ నాయకులవలె ఈయన కూడా వ్యక్తి బంధాలకూ, కుటుంబప్రేమకు దూరం కావలసి వచ్చింది

ఈయన తల్లి మరణించింది రాజేన్‌బాబు అక్కగారు భగవతీదేవి ఆ మాతృస్థానం తీసుకున్నారు

అయితే, రాజేంద్రప్రసాద్ తాను రాష్ట్రపతి అయినా, భర్తను కోల్పోయిన అక్కను, ఆమె కుటుంబాన్ని, తన కొడుకుల్ని, కోడళ్ళను, అల్లుళ్ళను, మనుమలు, మనుమరాళ్ళను, మేనమామ, కోడళ్ళను తన వెంటనే తెచ్చుకున్నారట

అంతమందితో పూర్వం భారత వైస్రాయ్ వుండే భవంతిలో వుండటం ఇష్టంలేక రాజేంద్రప్రసాద్ "నేను రాష్ట్రపతి భవనంలోని ఓ చిన్న ఇంటిలో వుంటాను" అన్నారట అయితే పటేల్, నెహ్రూ వంటి మిత్రులు బలవంతపెడితే, ఇక తప్పదన్నట్లు రాష్ట్రపతి భవనంలో ఉండేవారు.

పెద్ద కుటుంబంతో ఢిల్లీ వచ్చిన రాజేన్‌బాబుకు కావలసిన అన్ని ఏర్పాట్లూ ఆయన అక్క భగవతీ దేవే చూసేవారట రాజేన్‌బాబు చిన్న తమ్ముడు కావటం వల్ల ఆ అక్కగారు తానే మాతృస్థానం తీసుకుంది 1960 జనవరి 25న రిపబ్లిక్ దినోత్సవం రాష్ట్రపతి రిపబ్లిక్ వేడుకల్లో పాల్గొనటం, వివిధదళాలు గౌరవాభివందనాలు, దేశవ్యాప్తంగా వచ్చిన కళాకారులు, వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించటం, ఇవన్నీ జరగటానికి నాలుగైదు గంటలు పడుతుంది

అవన్నీ ముగించి, ముఖం మీద నవ్వు పులుముకుని లోపలి బాధను దిగమింగుకొని రాజేంద్రప్రసాద్ ఇంటికి వచ్చారు

ఆ క్రితం రోజే తనను కన్నతల్లి కంటే మిన్నగా పెంచి పెద్దచేసిన తన అక్క భగవతీదేవి అంత్యక్రియలు నిర్వహించారు అటు కర్తవ్య నిర్వహణ, ఇటు అంతులేని బాధాకరమైన వీడ్కోలు

## చర్చిల్‌ను ఆడించిన మహిళ

ప్రతి మహావ్యక్తి జీవిత విజయానికి వెనక అతని భార్య సహాయ, సహకారాలుండటం జగద్విదితమే

ఈ నిజం, ఇంగ్లాండ్ ప్రధానిగా చేసిన వింట్సన్ చర్చిల్ విషయంలో అక్షరాలా నిజమైంది

1908లో చర్చిల్, క్లిమెంటైన్‌ని మొట్టమొదటిసారి కలుసుకున్నారు

ఆమె గ్రీకుశిల్పంలా ఎంతో అందంగా వుండేది అయితే ఆమె సంపన్న కుటుంబానికి చెందిన మహిళ కాదు

తొలిచూపులోనే ప్రేమలో పడ్డ చర్చిల్ అంతవరకు పెళ్ళంటే విముఖత చూపేవాడు సుముఖత చూపసాగాడు చివరకి తన అధికారాన్ని, హోదాని మరచి ప్రేమ పిచ్చిలో పడి ఆమె చిరునవ్వు కోసం, అంగీకారం కోసం తహతహలాడాడు

ఎవరినీ లెక్కచేయని అహంభావిని ఆమె పెళ్ళాడినా వారి సంసారం ఒడిదుడుకులు లేకుండా సాగటం దుర్లభమని అంతా అనుకున్నారు

అయితే యాభైఏళ్ళు పైబడ్డ చర్చిల్ సంసార జీవితంలో ఎన్నడూ ఏ పొరపొచ్చాలు, ఇబ్బందులూ రాలేదు

చర్చిల్ తన ఆత్మకథలో, తమ సంసారంలో కష్టాలు, సుఖాలు, కన్నీళ్ళు, నవ్వులు, ఉన్నత స్థానం పొందటం, అలాగే పదవీచ్యుతి, యుద్ధం, శాంతి – గెలుపు, ఓటమీ అన్నీ ధైర్యంగా తాను ఎదుర్కొనగలగటానికి ముఖ్యకారణం క్లిమెంటైన్ తనకు భార్యగా భగవంతుడు ప్రసాదించటమేనని వ్రాసుకున్నాడు

ఒకసారి ఓ సినిమాతార చర్చిల్‌తో "ఈ ప్రపంచంలో అందమైన వ్యక్తుల్లో గొప్ప వారెవరో చెప్పండి?" అంటూ అడిగింది

వెంటనే చర్చిల్ "నా భార్య క్లిమెంటైన్" అంటూ చెప్పాడు రెండో ప్రపంచ యుద్ధకాలంలో ప్రపంచాన్ని ఆడించిన చర్చిల్‌ను ఆడించిన మహిళామణి ఆమె

## తన మరణం ముందే తెలిసిన ముట్నూరివారు

"జననమెంత సహజమో మరణమూ అంతే సహజం" అనే సత్యాన్ని మనోవాక్కాయ కర్మల్లో నమ్మినవారు, దానిని ఆచరణలో పెట్టి ఆదర్శంగా నిలిచినవారు అరుదు

అలాటి అరుదైన వ్యక్తుల్లో ప్రథమస్థానంలో నిలిచే వ్యక్తి 'కృష్ణాపత్రిక' సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు

ఆంధ్రప్రాంతంలో గాంధీజీ జాతీయోద్యమానికి బాసటగా నిలిచిన ఆ పత్రిక, దాని సంపాదకీయాలు, అవి రాసిన కృష్ణారావుగారు ఆదర్శప్రాయులు

ముట్నూరి వారి మాటల్లో ఎప్పుడూ, ఒక విధమైన వేదాంత ధోరణి, అప్పుడప్పుడూ తన మృత్యువును గురించిన చర్చ వస్తుండేది

ఒకసారి ఆయన కుటుంబ సభ్యులొకరు మరణించగా ఆయనను పరామర్శించటానికి వెళ్ళిన మిత్రులకు ఆయన తోటపని చేస్తూ నిశ్చింతగా కనిపించారట పైగా బాధపడుతున్న మిత్రులకు ఆయనే ధైర్యం చెబుతూ "ఈ శరీరం – ఆత్మ తొడుక్కునే చొక్కావంటిది బాగుండని చొక్కాని మనం ఎలా వదలిపెడతామో ఆత్మకూడా అలాగే పనికిరానిదాన్ని వదిలివేస్తుంది దానికి దుఃఖించటం దేనికి?" అంటూ చెప్పారట

ఆయన కెందుకో తనకు మృత్యువు త్వరలో రానున్నట్లు ముందే తెలిసింది ఒకరోజు ఆయన ఆఫీసులో పనిచేస్తూ తనను చూడవచ్చిన ఒక మిత్రుడితో "ఒరేయ్! నేను వెళ్ళిపోతున్నానురోయ్" అన్నారట

ఇంతలో అక్కడున్న ఎలక్ట్రిక్ బెల్ అసంకల్పితంగా అదేపనిగా మ్రోగసాగిందట! స్విచ్ ఆఫ్ చేశారు అయినా అది మ్రోగుతూనే వుంది.

అప్పుడు కృష్ణారావుగారు "అది ఎందుకు అగుతుంది? అది యమధర్మరాజు దున్నపోతుగంట" అన్నారట

నిజంగా, ఇది జరిగిన పదవరోజు, 1949లో ఆయన మద్రాసులో కీర్తిశేషులయ్యారు

## 'కలియుగ భీమ' కోడి రామమూర్తి ప్రతిభ

పూనాలో 'లోకమాన్య' తిలక్ 'కలియుగ భీమ' బిరుదాంకితుడైన కోడి రామమూర్తిని పిలిపించి, ఆయన ఇనుప గొలుసులు తెంపటం, రెండు భుజాలకు రెండు గొలుసులు కట్టి, వాటి బలంతో రెండువైపుల రెండు కార్లు ముందుకు పోకుండా ఆపటం, గుండెలమీద మత్తగజాన్ని అయిదు నిముషాలు నిలపటం చూసి 'మల్లమార్తాండ" బిరుదాన్ని ఇచ్చారు కోడి రామమూర్తిని గురించి తమ 'కేసరి' పత్రికలో వ్రాశారు ఇక తక్కిన పత్రికలూ రామమూర్తిగారి అసమాన్య శక్తి యుక్తులను గురించి ప్రశంసల వర్షం కురిపించాయి అప్పటికే తుని రాజాగారి సాయంతో 1600 మంది బలగంతో పెద్ద సర్కస్ కంపెనీ నడపటం ప్రారంభించాడు రామమూర్తి.

అప్పటి భారత వైస్రాయ్ లార్డ్ మింటో, రామ్మూర్తిని గురించి జరుగుతున్న ప్రచారాన్ని విని, పత్రికల్లో చదివి "ఇదంతా నిజమేనా? మానవమాత్రుడికి ఇది సాధ్యమా?" అని సంశయంతో, రామ్మూర్తి గారిని పరీక్షించటానికి స్వయంగా వచ్చాడు.

అప్పటికే రామమూర్తి అంజనేయ ఉపాసనలో వుండి వైస్రాయ్ మింటోనే పది నిమిషాలు వేచి వుండేటట్టు చేశాడు

తరువాత రామ్మూర్తిని తానే పరీక్షించాలనుకుని తను నడుపుతున్న తన కారునే అపి చూపమని మింటో కోరాడు తాళ్ళతో ఒకవైపు కారును కట్టి, రెండవ వైపు తన భుజాలకు కట్టుకుని "పోనివ్వండి మీ కారు!" అన్నాడు రామ్మూర్తి

అంతే! కారు అరంగుళం ముందుకు కదలలేదు. తక్కిన ప్రదర్శనలను చూసి, తన కళ్ళను నమ్మలేక "మీ ప్రదర్శనలు ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌లలో ప్రదర్శింపవలసిందే" అంటూ ప్రోత్సహించాడు మింటో. ఇంగ్లాండ్ రాజు, రాణి ఈయన ప్రదర్శన చూసి 'ఇండియన్ హెర్క్యులస్' అంటూ బిరుదిచ్చారు

ఫ్రాన్సులో "మీరు మా కోడెపోరాటం (బుల్ ఫైట్) చేసి గెలవగలరా?" అంటూ ఛాలెంజ్ విసిరారు పెద్దమొత్తం పందెం కాశారు. అది కొత్త అయినా రామ్మూర్తిగారు పొట్టి చేతులతో ఆ కోడెఎద్దును ఆపటమే కాకుండా, ఖాళీగోతాన్ని ఎత్తి విసిరేసినట్టు ఆ ఎద్దును విసరి పడేశారు. స్పానిష్ ప్రజలు అలాంటి వింతను ప్రప్రథమంగా చూశారు.

## భానుమతి గారి చిత్తశుద్ధి - అంకితభావం

ప్రముఖనటి, గాయని, దర్శకురాలు, రచయిత్రి భానుమతి రామకృష్ణ బహుముఖ ప్రజ్ఞావేత్త

ఆమె హీరోయిన్‌గా, సంగీత దర్శకురాలుగా స్టూడియో నిర్వాహకురాలుగా, గాయనిగా ఎప్పుడూ నంబర్ వన్ స్థానంలో వున్నది

అయితే, ఒకసారి నంది అవార్డుల కార్యక్రమంలో, రఘుపతి వెంకయ్య అవార్డు గ్రహీత రామారావుగారు ముఖ్యమంత్రిగా వుండగా, లలితకళాతోరణం కార్యక్రమంలో ఆమెకు సన్మానం జరిగింది.

రెండవరోజు ఆమె దూరదర్శన్ ఇంటర్‌వ్యూ ఇవ్వటానికి ఒప్పుకున్నది.

ఆమెకు మామూలుగా ఇలాంటి ఇంటర్‌వ్యూలు ఇవ్వటం ఇష్టం వుండదు

అయితే, ప్రముఖ రచయిత్రి శారదా అశోకవర్ధన్ తనను ఇంటర్‌వ్యూ చేస్తే బాగుంటుందని భానుమతి సూచించటంతో, ఆమెకే ఆ అవకాశం దక్కింది లక్షలాది ప్రేక్షకులు చూసే ఆ అపురూప ఇంటర్‌వ్యూ అంటే అది ప్రసారం చేసే హైదరాబాద్ దూరదర్శన్‌కే గొప్ప గౌరవం

రేపు దూరదర్శన్ ఇంటర్‌వ్యూ అనగా శారదా అశోకవర్ధన్ భానుమతి గారితో రాత్రి తొమ్మిదింటి వరకు పిచ్చాపాటి కబుర్లు చెప్తోంది.

ఇంతలో భానుమతిగారు "శారదా! రేపు నువ్వు దూరదర్శన్ ఇంటర్‌వ్యూలో ఏమేమి అడుగుతావో ఆ ప్రశ్నలన్నీ ఒకసారి రిహార్సల్స్ వేసుకుందామా?" అంటూ అడిగింది

అంత పెద్ద ఆర్టిస్ట్‌కి, రిహార్సల్స్ ఏమిటి? మామూలుగా అదే మరో ఆర్టిస్ట్ అయితే "నాకు రిహార్సల్స్ ఏమిటి?" అంటూ అనేవారు భానుమతిగారి చిత్తశుద్ధి, పనిపట్ల శ్రద్ధ, అది బాగా చేయాలనే పట్టుదల, పాతతరం కళాకారుల ఔన్నత్యాన్ని చెప్పక చెబుతాయి

## నిజమైన సుఖసంతోషాలకు రామతీర్థ చిట్కా

భారతదేశ ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని వేనోళ్ళచాటి, దాని ప్రత్యేకతను ఇంగ్లాండ్, అమెరికా, ఫ్రాన్స్, జపాన్ లాంటి దేశాల్లో ప్రచారం చేసినవారు స్వామి రామతీర్థ

ఆయన ఒకసారి ఇలాటి ఆధ్యాత్మిక ప్రచారం చేస్తూ అమెరికాలో పర్యటిస్తున్నారు

అప్పుడొకసారి అమెరికాకు చెందిన ఒక ధనిక స్త్రీ, స్వామివారి దర్శనార్థం వచ్చి, ప్రత్యేకంగా ఆయనతో మాట్లాడాలంది

ఆమె ముఖం ఎంతో దిగులుగా, విచారంతో కళ్ళు గుంటలు పడి, శూన్యదిక్కులు చూస్తూ జీవితంపట్ల విరక్తి కలిగిన వ్యక్తిగా కనిపించింది

రామతీర్థ ఆమెను చూస్తూనే "ఏమమ్మా! ఏమిటీ అంత దిగులుగా వున్నావు?" అని అడిగాడు

వెంటనే ఆమె కన్నీరు కారుస్తూ "స్వామీ! నాకు ఒకే ఒక్క కుమారుడు నా దురదృష్టంకొద్దీ వాడు ఇటీవలే అకాలమరణం చెందాడు ఈ వృద్ధాప్యంలో ఆ బాధను తట్టుకోలేకపోతున్నాను ఈ జీవితానికి ఇక అర్థంలేదనిపిస్తున్నది! ఎవరికోసం ఇంకా బ్రతకాలి? ఈ దుఃఖం నుంచి నేను బయటపడే అవకాశమే లేదని దిగులుగా వుంది! ఈ దుఃఖం తొలగి, నేను ఆనందంగా వుండే మార్గం చెప్పమని ప్రార్థిస్తున్నాను" అని అన్నది

వెంటనే స్వామి రామతీర్థ "అమ్మా! నీ దుఃఖం తొలగే ఒకే ఒక మార్గముంది! అది నీకు ఆచరణ సాధ్యమవుతుందా?" అన్నాడు

"తప్పక ఆచరిస్తాను! వెంటనే చెప్పండి" అంది ఆమె

"అయితే, నువ్వు శ్వేతజాతీయురాలైనా, నీవు ఓ నీగ్రో బాలుణ్ణి నీ కుమారుడిగా దత్తత తీసుకుని అతన్ని నీ స్వంత బిడ్డగా పెంచి, విద్యాబుద్ధులు నేర్పు! ఇదే నీ బాధ తొలగటానికున్న ఏకైక మార్గం!" అన్నారు స్వామి. మొదట, నిశ్చేష్టురాలైనా, ఆ అమెరికా స్త్రీకి స్వామి రామతీర్థ సలహా నచ్చి, ఆచరించింది.

## 'దేశబంధు' గారి గురుభక్తి ప్రత్యేకత

'దేశబంధు' చిత్తరంజన్‌దాస్ పేరు చెప్పగానే మనకు అరవిందఘోష్, గుర్తుకు వస్తాడు. దీనికి కారణం ఆంగ్లేయులపై బాంబులు వేశాడనే కేసును బనాయించి అరవిందఘోష్‌ను ఆంగ్లప్రభుత్వం బంధించింది.

అప్పటికే, వంగ రాష్ట్రంలో క్రిమినల్ లాయరుగా, గొప్ప జాతీయ నాయకుడుగా ప్రసిద్ధుడైన చిత్తరంజన్‌దాస్ అరవిందఘోష్‌ను కాపాడటానికి ఆయన తరపున వకాల్తా పుచ్చుకున్నాడు.

అరవిందుడు నిర్దోషి అని, ఆంగ్లప్రభుత్వం ఆయనను అనవసరంగా లాహోర్ కుట్రకేసులో ఇరికించిందని, చిత్తరంజన్‌దాస్ అసమాన వాక్పటిమతో, ఆంగ్లబారిష్టర్లే నోరు తెరిచేట్టు చేశాడు

ఇక ఆంగ్ల జడ్జి సైతం అరవిందుణ్ణి నిర్దోషిగా తీర్పు చెప్పి వదిలిపెట్టక తప్పలేదు.

ఒకరోజు చిత్తరంజన్ గుఱ్ఱపుబండిలో హైకోర్టుకు వెళుతుంటే దారిలో కొందరు స్త్రీలు దుఃఖిస్తూ రోడ్డుప్రక్కన నిలబడివున్నారు.

చిత్తరంజన్‌దాస్ కారణం అడిగితే "ఒక ప్రముఖ అధ్యాపకుడు, బాకీలు తీర్చలేక, వడ్డీలు కట్టలేక పోవటంతో, ఆయన ఇంటిని కోర్టు అమీనా వేలం వేస్తున్నాడు" అంటూ చెప్పారు.

వెంటనే చిత్తరంజన్‌దాస్ బండిదిగి, ఆ ఇల్లు తన పూర్వపు అధ్యాపకుడిదని తెలిసి "ఈ అధ్యాపకుడి బాకీ మొత్తం నేను తీరుస్తాను! ఇదిగో చెక్కు! వేలం ఆపండి" అన్నాడు, చెక్కురాసి అందిస్తూ

ఒక స్కూలు అధ్యాపకుడి పట్ల చిత్తరంజన్‌దాస్ గురుభక్తి అలాంటిది అందుకే ఆయనను "దేశబంధు" అని అందరూ కొనియాడారు

## సురవరం ప్రతాపరెడ్డిగారికి దక్కని 'తీపిలడ్డు'

ప్రముఖ తెలుగు వైతాళికులలో ప్రథమస్థానంలో నిలిచే సురవరం ప్రతాపరెడ్డిగారు బహుముఖ ప్రజ్ఞానిధి

ఆయన సాహితీవేత్తగా, పరిశోధకునిగా, సంఘ సంస్కర్తగా, 'గోలుకొండ' పత్రికాధిపతిగా, రాజకీయవేత్తగా, పరిశోధనాగ్రంథకర్తగా, జీవిత చరిత్రా రచయితగా ప్రసిద్ధులు.

సాంఘిక దురాచారాలను నిరసిస్తూ ఆయన హాస్య గర్భితమైన, వ్యంగ్యోక్తితో కూడిన అనేక కథలు వ్రాశారు

ఈ కథల పేర్లే వినటానికి ఎంతో హాస్యస్ఫోరకంగా వుంటాయి.

ఉదాహరణకు 'మొగలాయి కథలు' ఈయన 'గోల్కొండ పత్రిక'లో అప్పుడప్పుడు ప్రచురించారు ఆ పేర్లు తమాషాగా వుంటాయి

'గ్యారాకద్దూ బారాకొత్వాల్' (పదకొండు సొరకాయలు – పన్నెండు గురు కొత్వాళ్ళు), 'బంగారు గాడిద', 'కొండ త్రవ్వి ఎలుకను పట్టుట', 'ఖిచిడీ భోజనార్థం', 'అయాం పటాటోపం', అనేవి ఆ పుస్తకంలో కొన్ని కథల పేర్లు

వీరి ఒక నవలను గురించి ఒక తమాషా సంఘటన జరిగింది ఇది ప్రతాపరెడ్డిగారి మొదటి నవలే కావటం మరీ విశేషం

1915లో 'బూత్స్' అనే ఆంగ్ల రచయిత నవల – For freedom's cause – (స్వాతంత్ర్యం కోసం) అనేదాన్ని ప్రతాపరెడ్డిగారు అనువదించారు అది ప్రచురిద్దామనుకుంటూ ఆయన కర్నూలునించి హైదరాబాదుకు ఏవో పనుల మీద వెళ్ళారు ఇంట్లో పిల్లలు చిత్తుకాగితాలు అమ్ముతూ, అనువాదం చేసిన లిఖిత పత్రికనూ కలిపి అమ్మేశారు. ఆ విధంగా అమ్మినడబ్బుతో వారు 'తీపిలడ్డూలు' కొని తిన్నారట విషయం తెలిసిన రెడ్డిగారు తన తొలిరచన అలా అయినందుకు బాధపడ్డారు ఇంతకీ ఆ నవలపేరు 'తీపిలడ్డు' కాని, ఆ విధంగా, ఆ తీపిలడ్డులో తీపి, పాఠకులకు దక్కలేదు

# టాల్‌స్టాయ్ సంపాదించిన రూబుల్

ప్రపంచ ప్రసిద్ధ రష్యా రచయిత టాల్‌స్టాయ్ కథల్లో, నవలల్లో, నాటకాలల్లో సహజత కొట్టవచ్చినట్టు కనబడుతుంటుంది

దీనికి ముఖ్యకారణం టాల్‌స్టాయ్ పరిశీలన ఈ పరిశీలన కోసం ఆయన కాలినడకన పల్లెప్రాంతాల్లో నడచిపోతుండేవారు అక్కడి రైతుల, కూలీల, వివిధ పేదల సాధక బాధకాలూ, స్వయంగా చూస్తుండేవాడు, అడిగి తెలుసుకుంటుండేవాడు

టాల్‌స్టాయ్ స్వతహాగా భూకామందు. అయితే తను సామాన్యరైతులా, పొడుగాటికోటు, చేతిలో కర్ర రైతులు ధరించే టోపీతో జేబులో చిల్లర నాణేలు వేసుకుని, దారిలో కనపడ్డ బిచ్చగాళ్ళకు, ముసలివారికి దానాలు చేస్తూ తిరిగేవాడు

ఒకరోజు అతను రైలు స్టేషనుకు వెళ్ళి, అక్కడ వచ్చేపోయే జనాన్ని గమనిస్తూ, అప్పుడే వచ్చి ఆగిన రైలు ప్రక్కగా నిలబడ్డాడు

ఇంతలో ఓ వృద్ధురాలు టాల్‌స్టాయ్‌ని, ఎవరో పేదకూలివాడనుకొని "మా వారు అక్కడ టీ స్టాల్ దగ్గర నిలబడి కబుర్లు చెబుతున్నారు. ఆయన మాటల్లో పడితే రైలు పోతుందేమో! నేను అంతదూరం నడవలేను కాస్త ఆయనను త్వరగా రమ్మని చెప్పు, నీకు టీ డబ్బులిస్తాను!" అంటూ ఓ రూబుల్ చేతిలో పెట్టింది

టాల్‌స్టాయ్ ఆ రూబుల్ తీసుకుని, వెళ్ళి ఆమె భర్తను పిలుచుకొచ్చాడు.

తరువాత ఆమె టాల్‌స్టాయ్ ముఖం తేరిపార చూసి "అయ్యో! కథల తాతయ్య – టాల్‌స్టాయ్‌నే పోల్చుకోలేకపోయాను, పాపిష్టిదాన్ని! నన్ను భగవంతుడూ క్షమించడు ఆయనకు – నేను రూబుల్ ఇచ్చేదాన్నా?" అంది బాధగా.

"ఫర్వాలేదమ్మా! పొరపాటు ఎవరికైనా సహజం! అయితే కష్టపడి సంపాదించిన ఈ రూబుల్ మాత్రం ఇవ్వను" అంటూ అభివాదం చేస్తూ, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు టాల్‌స్టాయ్.

## లింకన్ విజయానికి కారణమైన పసిపాప

పదహారవ అమెరికా ప్రెసిడెంట్‌గా అబ్రహాం లింకన్ పోటీచేస్తున్నాడు అతను తక్కిన ప్రత్యర్థులకున్న ఆర్థిక స్థోమత కాని, అందబలంగాని వున్నవాడు కాదు

అతనికున్నదల్లా నిజాయితీ, సేవాతత్పరత, అంకితభావం మాత్రమే

అలా మొట్టమొదటిసారి ఎలక్షన్లకు పోటీచేస్తున్న లింకన్ గెలవటానికి ఓ పాప ఇచ్చిన సలహా మంచి ఊతం కావటం ప్రపంచాన్నే విస్మయపరచింది

లింకన్ ముఖంలో ముక్కు పెద్దది. కళ్ళు లోతుగా వుంటాయ్. చుబుకం ముందుకు పొడుచుకువచ్చినట్టు, చప్పిడిదవడలతో, పెద్ద చెవులతో – మొత్తం మీద ముఖం ఆకర్షణీయంగా వుండదు

ఈ విధంగా వున్న లింకన్ ఫోటోని, వెస్ట్‌ఫీల్డ్ ప్రాంతంలో నివసించే పదేళ్ళపాప 'గ్రేన్ బెడెల్' చూసింది. ఆ పాపకు అబ్రహాం లింకన్ ముఖం అమెరికా ప్రెసిడెంట్ అయ్యే వున్నత వ్యక్తి ముఖంలా కనిపించలేదు

వెంటనే ఆ పాపకు, లింకన్ గడ్డంపెంచితే బాగుంటుందనిపించింది గడ్డం వున్నట్టు ఫోటోను చిత్రించి చూసుకుంది ఆ గడ్డంతో అతనెంతో హుందాగా, పెద్దమనిషిలా కనిపించాడు వెంటనే అబ్రహాం లింకన్‌కు, ఉత్తరం వ్రాసింది – "మీరు మీ ముఖానికి గడ్డం పెంచుకుంటే, అందంగా ఆకర్షణీయంగా కనిపించటమే కాదు, మా ఇంటిలోని ఓట్లు, మా ఊళ్ళోని వోట్లు అన్నీ మీకే పడతాయ్" అంటూ

లింకన్ ఆ పాప మాటను పాటించి గడ్డం పెంచి, హుందాగా కనిపించటమే కాదు, ఎన్నికల్లో గెలిచి ప్రెసిడెంటుగా 'వైట్‌హౌస్'కు వెళ్ళబోతూ వెస్ట్‌ఫీల్డ్‌కు వచ్చి "ఈ ఊళ్ళో నాకో స్నేహితురాలుంది, ఆ పాపపేరు 'గ్రేన్ బెడెల్'" అంటూ చెప్పి, ఆ పాపను ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు ఆ పాప లింకన్ గడ్డాన్ని ఆనందంగా నిమిరింది

## ఐన్‌స్టీన్‌కు స్ఫూర్తినిచ్చిన 'భగవద్గీత'

'ఐన్‌స్టీన్' అనగానే మనకు 'సాపేక్ష సిద్ధాంత' కర్తగా, ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త గుర్తుకు వస్తాడు

అయితే 1948లో, ఆయన చెప్పిన మాటలు నమ్మదగినవిగా లేకపోయినా, అవి నమ్మదగిన నిజాలే!

1948లో డా॥ బి.యమ్.గుప్తా అనే ఒక యువ పరిశోధకుడు, అమెరికాలోని ప్రిన్స్‌టన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ యడ్వాన్స్‌డ్ స్టడీస్‌లో, ఐన్‌స్టీన్ని కలుసుకున్నాడు

ఐన్‌స్టీన్ డా॥ గుప్తాని సంస్కృతంలో ఆహ్వానించాడు, ఆయనతో సంస్కృతంలో సంభాషించటం మొదలుపెట్టాడు

ఐన్‌స్టీన్ ఎంతసేపు సంస్కృతంలో ప్రశ్నలు వేసినా సమాధానం చెప్పలేని గుప్తా "నాకు సంస్కృతం బొత్తిగా రాదు! క్షమించండి" అన్నాడు.

వెంటనే ఐన్‌స్టీన్ "నువ్వు భారతదేశం నుంచి వస్తూ, భారతీయుడ వయ్యుండీ – అన్ని భాషలకు తల్లిభాషైన సంస్కృతమే చదువుకో లేదా? భారతదేశం తత్త్వశాస్త్రానికీ, వేదాంతానికీ పుట్టినిల్లు. అలాంటి శాస్త్రాధ్యయనానికైనా నువ్వు సంస్కృతం నేర్చుకొని వుండవలసినది నా ఇంట్లోని, నా గ్రంథాలయంలో ఎన్ని సంస్కృత ఉద్గ్రంథాలున్నాయో చూడు! నేను ప్రసిద్ధ శాస్త్రవేత్తనని 'నోబెల్' బహుమతి వచ్చింది అయితే నా వైజ్ఞానిక శాస్త్ర పరిశోధనలకు, సూత్రీకరణలకు స్ఫూర్తి మీ భగవద్గీత! అదే నాకు మార్గదర్శి" అంటూ తన శాస్త్ర పాండిత్యానికి మూలాన్ని చెప్పాడు

## 'కీరో' చెప్పిన నమ్మలేనటువంటి జ్యోతిష్యం

ప్రపంచ ప్రసిద్ధ జ్యోతిష్యుడు 'కీరో'కి ఇంగ్లాండ్‌లోని ఒక పెద్ద క్లబ్‌లో, ఓ జ్యోతిష్యుడికి జరగని పరీక్ష జరిగింది

తన జ్యోతిష్య ప్రతిభను ప్రముఖుల ముందు ప్రదర్శించటానికి 'కీరో' సమ్మతించాడు

ఆ క్లబ్బులో, ఆ రోజు ఏ వ్యక్తి భవిష్యత్తు 'కీరో' చెబుతాడో ఆ వ్యక్తిని కీరో చూడకూడదు. అతను నల్లని తెరవెనక నిలబడి వున్నాడు అతని చెయ్యి మాత్రం తెరలోంచి ముందుకు చాచి టేబుల్ మీదుంది

ఆ చెయ్యి తెల్లగా, నాజూకుగా, చూడగానే ఓ సుకుమార స్త్రీ చెయ్యి అనిపించేట్టుంది.

కీరో ఆ చేతిరేఖలు ఓ నిముషం పరికించి చూసి, చేతిగోళ్ళను పరిశీలించి, "మీ రెండవ చెయ్యి కూడా చూపగలరా?" అన్నాడు

రెండవచెయ్యి కూడా తెరచాటు నుంచి బయటికి వచ్చింది, ఆ చెయ్యినీ పరిశీలనగా చూశాడు కీరో

"ఈ చేతులు ఈ దేశాన్ని పరిపాలించగల మహారాజ వంశానికి చెందిన యువరాజువి!" అన్నాడు

ఇంకా తెరవెనక వున్న వ్యక్తి బయటికి రాకముందే "నా జ్యోతిష్య శాస్త్రం అబద్ధం చెప్పదు! ఈ చేతిరేఖలు యువరాజు చేతివని ధైర్యంగా చెప్పగలను. ఈ చేతిరేఖలు ఇంకో పచ్చి నిజాన్ని చెబుతున్నాయి. మీరు ఈ దేశానికి చక్రవర్తిగా సింహాసనం అధిష్ఠించే యోగం లేదు మీరు మీ జీవితాన్ని పరదేశంలో గడుపుతారు!" అన్నాడు 'కీరో' చివరికి తెరవెనక వున్న ఎడ్వర్డు ప్రభువు బయటకు వచ్చాడు

'కీరో' చెప్పిన జ్యోతిష్యం అప్పటికి నమ్మలేనివారు నమ్మేట్టుగా నిజంగానే ఎనిమిదవ ఎడ్వర్డు ప్రభువు, రాజ్యపరిత్యాగం చేస్తే, ఆయన తమ్ముడు ఆరవ జార్జి ఇంగ్లాండుకు చక్రవర్తి అయ్యాడు అమెరికాలో స్థిరపడ్డ ఎనిమిదవ ఎడ్వర్డు ఇంగ్లాండ్‌కు నిజంగానే రాలేదు

ఆరోజు 'కీరో' చెప్పిన 'జ్యోతిష్యం' అక్షరాలా అలా నిజమైంది కీరో భారతస్వాతంత్ర్యం, పాకిస్తాన్ పేరుతో దేశవిభజన జరుగుతుందని 'ప్రపంచభవిష్యత్తు' అనే గ్రంథంలో 1923లోనే వ్రాశాడు.

## ఐన్‌స్టీన్‌కు పసివాడి సూచన

ఐన్‌స్టీన్ ఒకరోజు వ్యాహ్యాళికి వెళుతుంటే, ఒక చిన్న పిల్లవాడు అపరిశుభ్రమైన ముఖంతో కనిపించాడు.

ఆ పిల్లవాడు చాలా పేదవాడై వుంటాడని అర్థం చేసుకున్న ఐన్‌స్టీన్ "నువ్వు వెంటనే ఆ నీళ్ళటాంకు దగ్గరికెళ్ళి ముఖం కడుక్కొని వస్తే నీకు అయిదు సెంట్లిస్తాను - బహుమతిగా" అన్నాడు

ఆ పిల్లవాడు, ఐన్‌స్టీన్ మాటలకు వింతగా అతని ముఖంవైపు చూశాడు

ఐన్‌స్టీన్ అదేమాట మళ్ళీ చెప్పేప్పటికి పరుగున వెళ్ళి ముఖం నీళ్ళతో రుద్ది రుద్ది, శుభ్రంగా కడిగి తిరిగివచ్చాడు.

"ఇప్పుడు చూశావా ఎలా వున్నావో! ఇక ఎప్పుడూ ఇలాగే వుండాలి. అపరిశుభ్రంగా వుండకూడదు! ఇదిగో నీకిస్తానన్న బహుమతి" అంటూ, అయిదు సెంట్లు చేతిలో పెట్టాడు ఐన్‌స్టీన్

కాసేపు ఆ డబ్బు వైపే చూస్తున్న ఆ పిల్లవాడితో "ఆ డబ్బుతో ఏం చేస్తావ్?" అన్నాడు ఐన్‌స్టీన్ కుతూహలంగా.

ఆ పిల్లవాడు వెంటనే "మీరిచ్చిన డబ్బు తిరిగి మీకే ఇద్దామను కుంటున్నాను దీని అవసరం ఇప్పుడు నాకంటే మీకే వుంది" అన్నాడు.

ఐన్‌స్టీన్ ఆశ్చర్యపోతూ "నాకు ఆ డబ్బు అవసరం వుందా? ఆ డబ్బు నాకే ఇస్తావా?" అన్నాడు

"ఔను! మీ తలమీద జుట్టు చూడండి! పొదరిల్లు మోస్తున్నట్టు ఎంత ఘోరంగా వుందో! మీరు ఈ డబ్బుతో వెంటనే క్రాపు చేయించుకోవటం అత్యవసరం," అంటూ ఆ డబ్బు ఐన్‌స్టీన్ చేతిలో పెట్టాడా బాలుడు

## ఎడిసన్ మతిమరుపుతో వచ్చిన చిక్కు

ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త ఎడిసన్‌కు వివాహమైందని పత్రికలో వార్త రావటంతో అతని మిత్రులు, అభిమానులు ఎంతో సంతోషించారు

ఎడిసన్ న్యూ జెర్సీలోని ఆరంజ్ అనే ఊళ్ళో రైలు దిగగానే ఆయనను ఆహ్వానించటానికి ఆయన మిత్రుడు, రైల్వేస్టేషన్ మాస్టర్ స్వయంగా వచ్చాడు

ఎడిసన్ మతిమరపు విషయం, లోకవిదితమైంది కావటం చేత స్టేషన్ మాస్టరు "ఎడిసన్ గారూ! మీరు రైలు కంపార్ట్‌మెంట్‌లో ఏమీ మరచిపోలేదు గదా?" అంటూ గుర్తుచేశాడు

ఎడిసన్ చిరునవ్వుతో "అబ్బే! నేను ఈసారి మాత్రం ఏమీ మరచిపోలేదు నా సూట్‌కేసు నా చేతిలోనే వుంది నా క్యాపు నా నెత్తినుంది!" అంటూ అన్నీ వున్నట్టు దండకం చదివాడు.

ఎడిసన్‌ను గేటుదాకా సాగనంపుతూ వచ్చి "మీకు వివాహమైనట్టు పత్రికల్లో చూశాను వివాహ శుభాకాంక్షలు – మీకు – మీ శ్రీమతికి" అన్నాడు

అప్పుడు గుర్తొచ్చి శ్రీమతికోసం పరిగెత్తాడు ఎడిసన్

కొత్త పెళ్ళికూతురు రైలు కంపార్ట్‌మెంట్‌లో కదలకుండా, అదే పెట్టెలో కూర్చుని భర్తకోసం ఎదురుచూస్తున్నది

స్టేషన్‌మాస్టరు, పెళ్ళికూతురి సంగతి అలా అన్యాపదేశంగా గుర్తు చేయబట్టి, ఆ విపత్తు అలా తొలగింది

## చర్చిల్ అనర్గళప్రసంగం వెనకవున్న ప్రసవవేదన

ప్రపంచ ప్రసిద్ధ వక్తల్లో ప్రధమశ్రేణిలో లెక్కకు వచ్చే వాళ్ళలో చర్చిల్ పేరు ముందుంటుంది ఎప్పుడు ఆయన వేదిక ఎక్కినా, ఆయన ప్రసంగం వినటానికి జనం వేలంవెర్రిగా వేలసంఖ్యలో వచ్చేవాళ్ళు

చర్చిల్ ప్రసంగంలో విషయం సుగమంగా, వినటానికి ఆసక్తిగా, మధ్య మధ్య ఛలోక్తులు విసురుతూ, ఎంతసేపు విన్నా ఇంకా వినాలనేట్టు శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేసేట్టుండేది

ఇవన్నీకాక రేపు తన ప్రసంగం వుందనగా, ఒకరోజు ముందుగానే చర్చిల్ తన ప్రసంగపాఠాన్ని పత్రికలకు ఇచ్చేవాడు

యుద్ధానికి ముందు, డార్విన్ అనే ప్రాంతంలో లిబరల్‌పార్టీకి చెందిన ఒక సభలో చర్చిల్ ప్రసంగించవలసి వుంది

స్థానిక దినపత్రికలో తన ఉపన్యాసం రావాలన్న ఉద్దేశ్యంతో, ఒకరోజు ముందుగా తన ప్రసంగం పాఠాన్ని ఇచ్చాడు చర్చిల్

రెండవరోజు ఆ స్థానిక దినపత్రిక సంపాదకుడు సభకు హాజరయ్యాడు గంటసేపు సాగిన చర్చిల్ అనర్గళ ప్రసంగం టేపు రికార్డు చేసినట్టు – తు చ తేడా లేకుండా క్రితంరోజు చర్చిల్ వ్రాసిన ప్రసంగ పాఠమే అది అదే పత్రికలో ముందుగా ప్రచురింపబడింది

పత్రిక సంపాదకుడికి చర్చిల్ ప్రసంగం అలా చేయగలగటంలోని కిటుకు తెలుసుకోవాలని కుతుహలం కలిగింది వెంటనే ఆయన బస చేసిన హోటల్ గదికి వెళ్ళి అడిగాడు

చర్చిల్ నవ్వి "నాకు మొదటి నుంచి ఒక అలవాటుంది మొదట నా ఉపన్యాసానికి సంబంధించిన రేఖాకృతిని తయారుచేసుకుని, అందులో ఉన్న ఖాళీలను ఆ తరువాత భర్తీచేస్తాను నా ప్రసంగంలో అనేక పేరాలు పేరాలు, కొటేషన్లు కూడా నాకు కంఠతా వచ్చు ఇప్పుడు మీరు గంటసేపు వినిన నా ప్రసంగం చేయటానికి నేను పదిహేను రోజులు రాత్రింబవళ్ళు కష్టపడి బట్టీపట్టాను", అన్నాడు

## తెలుగు భాషా సాహిత్యం గొప్పదని నిరూపించిన సి. పి. బ్రౌన్

1817లో తూర్పు ఇండియా కంపెనీ ఉద్యోగిగా 'బ్రౌన్' భారతదేశానికి వచ్చాడు మద్రాసు సివిల్ సర్వీసులో ఉద్యోగిగా చేరిన వారిని మదరాసు కాలేజీలో చేర్చి, ప్రాంతీయ భాషలను నేర్చుకో మనేవారు ఆగస్టు 13న మద్రాసు కాలేజీలో చేరిన బ్రౌన్‌కు, తెలుగు నేర్పింది వెలగపూడి కోదండరామ పంతులు గారు ఆ రోజుల్లో తెలుగు నేర్పే వాచకాలు లేవు. భాషాధ్యయానానికి అవసరమైన వ్యాకరణం, నిఘంటువులు లేవు దీనికి తగ్గట్టు కొందరు "తెలుగు భాషకు సాహిత్యమే లేదు అది నేర్చుకొని ఉపయోగమేమిటి?" అంటూ, నిరుత్సాహపరిచారట బ్రౌన్‌ను

అయితే బ్రౌన్ కడపజిల్లా, కలెక్టరుకు అసిస్టెంటుగా వచ్చాడు ఆ కలెక్టర్ 'హన్బర్' తెలుగు బాగా మాట్లాడేవాడు ఆయనలాగ తానూ తెలుగు మాట్లాడాలని పట్టుదల వచ్చి, రెండేళ్ళలో తెలుగు బాగా మాట్లాడటమే కాదు – "తెలుగు జీవ భాష. ఇది నేర్చుకోడానికి పుస్తకాలు ఒక్కటే చాలవు" అంటూ, తెలుగు మాట్లాడే వారందరితో తెలుగు మాట్లాడేవాడుట

1822లో, మచిలీపట్టణానికి బ్రౌన్ బదిలీ కావటంతో, తెలుగుభాషకే దశ తిరిగింది అక్కడ ఆయనకు తెలుగు కావ్యాలమీద దృష్టి పడింది అక్కడే ఆయనకు మొట్టమొదటిసారి వేమన ప్రసక్తి వచ్చింది ఇక ఆయన వేమన పద్యాలు సేకరణకు పండితులను ఆంధ్రప్రాంతం నలుమూలలకు పంపారు 1829లో 'వేమన పద్యాలకు తన ఆంగ్లానువాదంలో కలిపి 'ది వెర్సెస్ ఆఫ్ వేమన' పేరుతో ప్రకటించాడు

1855లో ఆయన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేంతవరకు, 38 ఏళ్ళపాటు కనుమరుగైపోతూ, తాళపత్రాల రూపంలో వెలుగుచూడని ప్రముఖకావ్యాలూ, నాటకాలూ, సంస్కృత గ్రంధాలు, పాటలు, పద్యాలు అన్నీ తన సొంత ఖర్చుతో సేకరించి, పండితుల సాయంతో వాటిని పరిష్కరించి, శుద్ధ ప్రతులను తయారు చేయించి, అవి ముద్రింపజేసి, మొదటి తెలుగు నిఘంటువు, ఆంగ్ల - తెలుగు నిఘంటువు తాను వ్రాసి, అనువాదాలు చేసి, "తెలుగు భాషకున్న గొప్ప సాహిత్యం మరే భాషకుంది" అనే పదాన్ని రుజువు చేసిన నిష్కామ భాషాభిమాని బ్రౌన్.

## అధికారంలో వుంటే చేసే మర్యాదలు - ప్రకాశం

మన ఆంధ్రరాష్ట్రానికి చాలామంది ముఖ్యమంత్రులు వచ్చినా, ప్రకాశంగారి ప్రత్యేకత ఆయనదే. ఎంతో పేదరికం నుండి వచ్చిన వాడు కావటంచే ఆయనకు ఆకలి, పేదరికం, పస్తులుండటం తెలుసు.

ఒకసారి ఆయన పుట్టినరోజుకు వేలమంది అభిమానులు, పూలదండలతో వచ్చి ఉదయం నుంచి సాయంత్రం దాకా శుభాకాంక్షలు తెలుపుతూ వున్నారు

పూలదండలు గుట్టలు గుట్టలుగా పడుతున్నాయి అయినా ప్రకాశంగారు ఆయన పనులేవో చేసుకుంటూ వున్నారు

లింగరాజని, ఆయన అభిమాన అంతరంగిక కార్యదర్శి "ఏమిటిసార్! అలా కూర్చున్నారు. ఇవాళ మీ పుట్టినరోజు ఈ బట్టలేమిటి? లేవండి నగరంలో పెద్దలు మీకు సన్మానం చేయాలని పెద్ద ఏర్పాట్లలో వున్నారు!" అన్నాడు.

అప్పుడు ప్రకాశంగారు "లింగరాజా! కావలిస్తే నీవు వెళ్ళు. నాకు చాలా పని వుంది. నేను ముఖ్యమంత్రిని గదా! నా పుట్టినరోజు గొప్ప వైభవంగా జరుపుతారులే! అయినా నీకిప్పుడు అర్థంకాదు. వీళ్ళ అసలైన అభిమానం వచ్చే సంవత్సరం తెలుస్తుంది అప్పుడు చెప్పాలి" అన్నాడు

ఆయన అన్నట్టుగా రెండవ ఏడు ఆయన ముఖ్యమంత్రి పదవిలో లేరు ఆయన ఇంటి కచేరీ గదిలో ఏ కోలాహలమూ లేదు

"ఏరా లింగరాజా! నేను చెప్పానా? అధికారం లేకపోతే ఎవ్వరూ తలవరు నిరుడు వాళ్ళు తెచ్చిన పూలదండలు నేను కూర్చునే

ముఖ్యమంత్రి స్థానాన్ని చూసి! వ్యక్తిగా నన్ను చూసి కాదు!" అన్నారు ప్రకాశం

తరువాత ఆయనకు 2 – 3 గంటల మధ్యాహ్నమైనా, పూటకు తిండి వుండేది కాదు అయితే ఆయన ఆత్మాభిమానంతో ఎవరికీ చెప్పుకునేవారు కాదు

## విద్యార్థిగా సి. ఆర్. రెడ్డి గారి ప్రతిభ

అఖండ మేధావిగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా, కవిగా, విమర్శకుడుగా, రచయిత, మహావక్త, విద్యావేత్త, రాజనీతిజ్ఞుడు, అన్నింటికి మించి మంచి చమత్కారి వ్యంగ్య సంభాషణా చతురుడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి.

ఆయన భవిష్యత్ ప్రతిభను తెలియజేసే ఒక మంచి సంఘటన ఆయన స్కూలు విద్యార్థిగా ఉండగా జరిగింది

సి.ఆర్ రెడ్డిగారి జ్ఞాపకశక్తి అమోఘము ఆయన పాఠము, ఒక్కసారి వింటే అది ఇక మక్కీకి మక్కీ అప్పచెప్పేవాడు

ఒకసారి ఆంగ్లపాఠము చెప్పే అధ్యాపకుడు ఇంగ్లీషులో పెద్ద వ్యాసము వ్రాసుకురమ్మని 'హోమ్‌వర్క్' ఇచ్చాడు

అందరూ వ్రాసుకురాగానే ఒక్కొక్కళ్ళను "లేచి నిలబడి చదవండి! తప్పులుంటే అందరికీ వివరిస్తాను ఒకళ్ల తరువాత ఒకరు! తప్పులు చదివిన వారికి బెత్తపుదెబ్బలు తప్పవు!" అంటూ కార్యక్రమము ప్రారంభించారు

తనవంతురాగానే, పుస్తకములో వ్రాసిన భాగాన్ని గడగడ చదువుతున్నాడు రామలింగారెడ్డి "ఆహా! ఆహా!" అంటూ మెచ్చుకుంటూ వింటున్నాడు అధ్యాపకుడు

ఎంతసేపటికీ వ్యాసం ముగింపుకు రావటం లేదు ఎంతసేపు చదివినా రామలింగారెడ్డి గారు పేజీ తిప్పటం లేదు

పాఠ్యగ్రంథములోని పాఠం మొత్తము పొల్లుపోకుండా పేజీలకు పేజీలు ఏకసంతాగ్రాహిలా చెబుతున్న రామలింగారెడ్డి గారి ప్రతిభను చూసి, "వీడు సామాన్యుడు కాదు – మాన్యుడే!" అనుకున్నాడు, ఆ అధ్యాపకుడు, అది నిజమైంది

## నవ్వుల 'బాబు' రాజబాబుకు 'వి.ఐ.పి.' అంటే కొత్త అర్థం

తెలుగు సినిమా చరిత్రలో ఒక హాస్య యుగానికి ముకుటంలేని మహారాజుగా వెలుగొందిన రేలంగిలాగే, ప్రముఖ హాస్యనటుడు రాజబాబు కూడా సెట్టు బయట కూడా అందరినీ తమాషా జోక్స్ వేసి నవ్వించేవాడు.

సినిమా షూటింగ్స్ జరుగుతున్నప్పుడు ఉదయాన్నే టిఫిను, మధ్యాహ్నం మీల్స్, మూడింటికి టీ, సాయంత్రం మళ్ళీ ఉపాహారం – ఇలా వుంటాయి.

ఒకరోజు రాజబాబుని "మీకు ఏ టిఫిన్ తెమ్మంటారు సార్?" అంటూ అసిస్టెంట్ బాయ్ అడిగితే –

"ఏ టిఫినేమిటి ! నాకు వి.ఐ పి టిఫిను పట్టుకురా" అన్నాడట

"వి ఐ.పి , టిఫిన్ అంటే" – 'వెరీ ఇంపార్టెంట్ పర్సన్' – అంటే, 'అతి ముఖ్యులైన' ప్రముఖులకిచ్చే టిఫిను.

అదేవిధంగా టిఫిను తేవటానికి వెళుతుంటే, రాజబాబు అతన్ని ఆపి–

"వి.ఐ పి. – అంటే అర్థమైందా", అన్నాడట మళ్ళీ

"వి.ఐ పి అంటే – వడ – ఇడ్లీ – సాంబార్ అని అర్థంరా బాబూ! త్వరగా పట్రా!" అన్నాడట, రాజబాబు

అప్పటికి గాని అర్థం కాలేదు – ఆ అసిస్టెంటుకు, అందులోని అర్థం

## ఎప్పటికీ వెంటాడే ప్రశ్నలు - రమణ మహర్షి

రమణ మహర్షి దగ్గరకు ప్రతిరోజూ అనేకమంది భక్తులు వచ్చి, రకరకాల ప్రశ్నలు వేస్తూ, తమ ధర్మ సందేహాలు తీర్చుకుంటూ, వుండేవారు

ఇది నిత్యం రమణాశ్రమంలో జరిగే దినచర్యే

ఒకరోజు, ఒక వృద్ధుడు రమణ మహర్షికి పాదాభివందనం చేసి, నమస్కరించి, వినయంగా నిలబడ్డాడు

ఆ వృద్ధుడు చిన్నప్పుడు తనకు పాఠాలు చెప్పిన మాస్టారని తెలిసి, రమణ మహర్షి లేచి ప్రత్యభివాదం చేశారు

అప్పుడా వృద్ధుడు "ఆధ్యాత్మిక చింతనలో 'ఆత్మ' – 'పరమాత్మ' – 'మానవజన్మ' దాని తుది లక్ష్యం – వంటి వాటిని గురించి నాకు ధర్మ సందేహాలు ఉన్నాయి. దయతో వీటికి సమాధానం వివరంగా చెబుతారని ఆశిస్తున్నాను" అన్నాడు, రమణ మహర్షితో.

భగవాన్ ఆ మాటలకు చిరునవ్వు నవ్వి "చూశారా! ఏ మేస్టారి ప్రశ్నలు తప్పించుకోవడానికి నేను సన్యాసినయ్యానో, ఇప్పుడు కూడా నాకు, ఆ మేష్టారి ప్రశ్నలకు సమాధానం చెప్పక తప్పటం లేదు!" అంటూ చమత్కరించారు.

ఆ మాటలతో, అక్కడున్న రమణ మహర్షి శిష్యులతోపాటు, అక్కడికి వచ్చిన భక్తులూ ఆనందంగా నవ్వారు.

తర్వాత రమణ మహర్షి ఆ అధ్యాపకుడి ప్రశ్నలకు తగిన సమాధానాలు చెప్పారు.

## 'కొలంబస్' మొండిపట్టుదలే అతని విజయానికి మూలం

సముద్రం ప్రక్కనే వున్న ఇంట్లో వుంటూ ఇటలీలోని గెనా అనే ప్రాంతంలో చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు కొలంబస్ వుండేవాడు అతను యువకుడుగా వుండగా ఒక సంఘటన జరిగింది.

ఒకరోజు సముద్రంలో, సముద్రపు కెరటాలలో కొట్టుకొచ్చిన కొత్తరకం కొమ్మ–ఆకులు, పూలు ఎంతో అందంగా వుండి, అతన్ని ఆకర్షించింది.

అది చేతిలో పట్టుకుని ఎందరినో కలుస్తూ, దాని వివరాలను ఎన్నో ప్రాంతాలు సముద్రయానం చేసిన వృద్ధనావికులను సైతం అడిగాడు.

చివరికి తేలింది ఏమిటంటే, "అది మంచి సారవంతమైన భూభాగానికి చెందిన చెట్టు అలాటి చెట్లున్న భూభాగం ఎంతో సారవంతమైంది. ఆ భూభాగం చేరటానికి పెద్ద నావ, నావికులు, దారిలో ఖర్చులకు ధనధాన్యాలు కావాలి"

అలా పెద్ద స్థాయిలో సాయం చేయగలవాళ్ళు స్పెయిన్ మహారాణి తప్ప ఎవరివల్లా కాదని ఆమెనే ఆశ్రయించి, ఆమెకు తన ప్రయత్నాన్ని గురించి చెప్పాడు

కొలంబస్ చేయటానికి తలపెట్టిన సముద్రయానంలో పాల్గొనటానికి ఏ నావికులూ ముందుకురాలేదు. మరో మార్గంలేక జీవితఖైదు, మరణదండనలు పడ్డ ఖైదీలను కొలంబస్‌తో పాటు నావికులుగా పంపేట్టు, వారు సురక్షితంగా తిరిగివస్తే, వాళ్ళకు శిక్షలన్నీ మాఫీ చేసేట్టు, మహారాణి ప్రకటించింది.

పెద్ద నేరస్తులు, అలా కొలంబస్‌తో ప్రయాణం చేసి, శిక్షల నుంచి తప్పించుకోవచ్చని వాళ్ళు సిద్ధమయ్యారు దారిలో తుఫాను, 70 రోజులు, పదివేల మైళ్ళు ప్రయాణం చేసినా, ఏ తీరప్రాంతం కొత్తగా వాళ్ళకు కనిపించలేదు

అసలే నేరస్తులు, ఖూనీకోరులైన నావికులు, కొలంబస్‌కు ఎదురు తిరిగి, ఓడను వెనక్కు మళ్ళించమని, సముద్రంలో దిక్కులేని చావు చచ్చేకంటే అలా తిరిగి వెళ్ళటమే మంచిదని చెప్పారు వాళ్ళకు ప్రాణభయం పట్టుకుంది. అయినా కొలంబస్ రాత్రిళ్ళు దైవప్రార్థన చేస్తూ, ముందుకు సాగాడు. 71వ రోజు వాళ్ళకు, ఓ కొత్త తీరం కనిపించింది అదే పశ్చిమ తీరప్రాంతంలోని 'శాన్‌శాల్వడార్' అలా ముందుకు సాగిన కొలంబస్, అనేక ద్వీపాలు దర్శించి, మిగతా ప్రపంచానికి ఈ ద్వీపాలకు మార్గం సుగమం చేశాడు

## గ్రాహంబెల్ 'టెలిఫోన్' కనిపెట్టడానికి ప్రేరణ

'టెలిఫోన్' కనిపెట్టి, మానవాళికి మహోపకారం చేసిన శాస్త్రవేత్త గ్రాహంబెల్‌కి చిన్నప్పటి నుంచి రకరకాల పరిశోధనల పట్ల అమితాసక్తి వుండేది

గ్రాహంబెల్ తండ్రి మూగ, చెవుడున్న విద్యార్థులకు అధ్యాపకుడుగా పనిచేస్తుండేవాడు గ్రాహంబెల్‌కూ అమెరికాలోని బోస్టన్‌లో చెవిటి మూగ విద్యార్థులకు అధ్యాపకుడిగా ఉద్యోగం ఇప్పించాడు

గ్రాహంబెల్ అక్కడకు ఉద్యోగంలో చేరి, తండ్రికి తాను ఉద్యోగంలో చేరిన విషయం టెలిగ్రాం ఇవ్వటానికి పోస్టాఫీసుకు వెళ్ళాడు

అయితే టెలిగ్రాం తీసుకునే గుమస్తా "మీరు ఓ గంట ఆగండి! వేరే వ్యక్తి టెలిగ్రాం అక్కడికే ఇచ్చాడు అది పూర్తయ్యాకే, మీ టెలిగ్రాం తీసుకుంటాను" అన్నాడు

"గంటసేపు ఆగాలా! అతను టెలిగ్రాం పంపే లైను ఖాళీ అయ్యేవరకు, నా టెలిగ్రాం ఆపుకోవాలా? ఇదేం పద్ధతి?" అన్నాడు బాధగా గ్రాహంబెల్

"ఇప్పుడున్న పరిస్థితి అదే! ముందు వచ్చినవారికి ముందు సేవలందుతాయ్ ఇంతకంటే మంచి మార్గం మరొకటి లేదు" అన్నాడు, గుమస్తా

గ్రాహంబెల్ మెదడులో ఓ కొత్త ఆలోచన వచ్చింది "ఇలా గంటలు గంటలు వేచివుండి, ఒకరి తరువాత ఒకరు వైర్లద్వారా వర్తమానాలు పంపే పద్ధతి కాకుండా, ఒకరితో మరొకరు ఎప్పుడు పడితే అప్పుడు, ఎలాపడితే అలా మాట్లాడుకోడానికి స్వేచ్ఛ వుంటే ఎంత బాగుండు?" అనే ఆలోచన వచ్చింది.

ఈ మంచి ఆలోచనా ఫలితమే 1876 మార్చి పదవ తారీఖున మొట్టమొదటిసారి "మిస్టర్ వాట్సన్ కమ్ హియర్! ఐ వాంటు సీ యూ" అనే మాటలు తన సహాయకుడైన వాట్సన్‌తో మాట్లాడంతో ప్రారంభించాడు బెల్ ఇక మానవసేవలో ఓ అద్భుతమైన "బుర్రి పెట్టెలో బూచోడు" మానవాళికి లభించింది

## నిత్యజీవితంలో చాప్లిన్ కురిపించిన హాస్యం

ప్రపంచపు ప్రసిద్ధ హాస్యనటుడు, చార్లీచాప్లిన్ తెరమీదే కాక, తెరవెనుక, నిత్యజీవితంలో అందర్నీ నవ్వించేవాడు

ఒకసారి తనికి పోస్టులో ఓ ఉత్తరం కవరులో, వచ్చింది

చాప్లిన్ ఆ కవరు చింపి చూస్తే అందులో కేవలం ఓ తెల్లకాగితం వుంది

చాప్లిన్ అదేపనిగా దానిని (తెల్లకాగితం) ముద్దు పెట్టుకుంటున్నాడు

"ఆ కాగితం మీద ఏమీ వ్రాసినట్టు లేదు! అలా ఆ తెల్లకాగితాన్ని ముద్దాడటం ఏమిటి?" అంటూ అడిగాడు ఓ మిత్రుడు, చాప్లిన్‌ను

చాప్లిన్ వెంటనే "నేను మా ఆవిడ పోట్లాడుకుంటే – మా ఆవిడ అలిగి పుట్టింటికి వెళ్లింది ఇప్పుడు ఇలా తెల్లకాగితం ఉత్తరంగా పంపిందంటే – ఇద్దరి మధ్యా సంధి కుదిరిందని అర్థమన్నమాట," అన్నాడు చాప్లిన్, నవ్వుతూ.

ఒకసారి చాప్లిన్ బాల్యమిత్రుణ్ణి చాలా ఏళ్ల తరువాత కలుసుకున్నాడు

ఇప్పుడు ఆ మిత్రుడు పెద్ద క్రిమినల్ లాయర్‌గా లక్షలు లక్షలు గడిస్తున్నాడు.

మాటల మధ్యలో ఆ లాయర్ మిత్రుడు "చాప్లిన్ నేను చిన్నవాడిగా నీతో ఆడుకునేప్పుడు – నేను ఓడదొంగల నాయకుణ్ణయి, అందరినీ దోచుకోవాలనుకునేవాణ్ణి గుర్తుందా?" అంటూ అడిగాడు

వెంటనే చాప్లిన్ "క్రిమినల్ లాయరువై అంతకంటే ఎక్కువగానే దోచుకుంటూన్నావు చాలదా? ఇది దానికంటే ఎక్కువేలే", అన్నాడు చాప్లిన్.

## హాస్యనటులు లారెల్ - హార్డీలు

ప్రముఖ ఆంగ్ల హాస్యనటులు లారెల్, హార్డీలు నిత్యజీవితంలో కూడా హాస్యప్రియులయి వుండటం వీళ్ళ ప్రత్యేకత

హార్డీ తన ప్రియమిత్రుణ్ణి తన వివాహ మహోత్సవానికి ఆహ్వానిస్తూ "నేనుండే అపార్ట్‌మెంట్‌లోకి మీరు రావాలంటే మీ మోచేత్తో కాలింగ్ బెల్ నొక్కగానే, నేనొచ్చి తలుపు తెరచి మిమ్మల్ని లోపలికి ఆహ్వానిస్తాను" అన్నాడు.

ఆ మిత్రుడు ఆశ్చర్యపోతూ "మీ ఇంటికొస్తే మోచేత్తో కాలింగ్‌బెల్ నొక్కటం ఏమిటి?" అన్నాడు అర్ధం కాక

"ఏముంది! నా వివాహ మహోత్సవానికి మీరు వచ్చేప్పుడు, నాకివ్వటానికి మీ రెండు చేతుల్లో కనీసం రెండు బహుమతులు వుంటాయి కదా!" అన్నాడు. హార్డీ

ఒకరోజు హార్డీ మిత్రుడు, లారెల్ భార్య చాలా దిగులుగా కనిపించింది

"ఏమిటి డియర్! ఎప్పుడూ లేనంత దిగులుగా కనిపిస్తున్నావ్! కారణం ఏమిటి?" అన్నాడు

"ఏముంది! ఓ పుస్తకం తెరచి చూచాను అందులో చివరి పేజీ చివర నేను మరచిపోలేకపోతున్నాను" అంది అతని భార్య

"నిన్ను అంత కలవరపెట్టిన ఆ పుస్తకం ఏది? అందులో, చివరి పేజీ – చివర ఏముంది?" అడిగాడు లారెల్ ఆతురతతో

"నేను చూసింది నా బ్యాంక్ పాస్‌బుక్! అందులో చివరి పేజీ చివర, బ్యాంకు బాలెన్స్ 'సున్నా' వుంది" అంది బాధగా

## అంబేద్కర్ ఎదుర్కొన్న ప్రతికూలత

మండు వేసవిలో ఒక బాలుడు తీవ్రమైన దాహంతో ఉండి, ఇంట్లో నీళ్ళు లేక, బయట ఒక బావి దగ్గర నిల్చున్నాడు. ఎవరూ నీళ్ళు తోడిపోయటానికి రాలేదు దాహానికి తట్టుకోలేక స్వయంగా చేదుకొని నీరు త్రాగాడు.

ఈ సంఘటన దూరం నుండి చూసిన అగ్రవర్ణాలవారు అరుపులు, పెడబొబ్బలతో అక్కడికి ఉరుకులు, పరుగులతో వచ్చి, ఆ బాలుణ్ణి క్రింద పడవేసి కొట్టారు ఆ రోజు అలా తన్నులు తిన్న ఆ బాలుడే అంబేద్కర్.

మండువేసవిలో, అతని అన్నతో కలసి తండ్రిని చూడటానికి ఎడ్ల బండిలో బయలుదేరాడు అంబేద్కర్. వాళ్ళు 'మహర్' (అంటరానివారని తెలిసి), బండివాడు బండి ఆపి, వారిద్దరినీ రోడ్డు మీదకు దొర్లించాడు. చివరికి ఎక్కువ బాడుగ ఇస్తాననటంతో, బండి వాళ్ళు తోలేట్టు, తను బండికి దూరంగా నడచివస్తూ వాళ్ళ గమ్యం చేర్చేట్టు ఒప్పుకున్నాడు

ఇలాంటి అవమానాలు నిత్యజీవితంలో పొందుతూ వచ్చి చివరికి అమెరికాలో ఉన్నతవిద్య అభ్యసించి బరోడాలో రక్షణశాఖలో కార్యదర్శిగా చేరిన అంబేద్కర్‌కు, క్రింది ఉద్యోగులు, ప్యూన్లు సైతం ఈయన ఉద్యోగస్థాయిని కూడా లెక్కచేయకుండా, ఫైళ్ళను దూరంనుంచి విసిరివేసేవారు

దీనితో అంటరానితనం మీద పోరాటం సాగించాడు అంబేద్కర్. మూగ ప్రజల నాయకుడయ్యాడు భారతరాజ్యాంగ రచనలో ప్రముఖపాత్ర వహించాడు నిమ్నజాతులను సమన్వయపరచి, వారి హక్కుల కోసం పోరాడాడు. చివరికి గాంధీని సైతం ఎదిరించాడు. శాసనసభల్లో నిమ్నజాతులకు కొన్ని ప్రత్యేక స్థానాలు కేటాయింపులో 1932లో విజయం సాధించాడు చివరికి బౌద్ధమతం స్వీకరించాడు

## సి.వి. రామన్ చెప్పిన వింతవిషయాలు

అమెరికా, ఇంగ్లాండ్ లాంటి దేశాల్లో ఉన్నత విద్యకోసం వెళ్ళే ప్రతిభ గల మన భారతీయులు చాలామంది, అక్కడికి వెళ్ళిన పని మరచిపోయి, ప్రేమలు - పెళ్ళిళ్ళు అనే విషయాల్లో పడిపోతున్నారు

ఒకసారి రంగూన్‌లో సివి రామన్ ఇదే విషయం మాట్లాడుతూ "మన ప్రతిభావంతులైన విద్యార్థులు, ఉన్నత డిగ్రీలు పొందలేకపోయినా – 'ఎల్ ఎల్.డి' – వంటివి మాత్రం సాధిస్తున్నారు" – అన్నాడు

తరువాత ఆయన ఆ పదాల అర్థం వివరిస్తూ 'ఎల్' 'ఎల్' అంటే – 'లేండ్ లేడీస్' 'డి' అంటే 'డాటర్' అంటూ అర్థం చెప్పాడు

రామన్‌కు 'నోబెల్ బహుమతి' శాస్త్రవేత్తగా రావటంతో, ఆ డబ్బులో అప్పట్లో 75,000 రూపాయలు, బెంగుళూర్‌లోని ఒక ఆర్థిక నిపుణుడుగా పేరుబడ్డ గొప్ప లక్షాధికారి వద్ద దాచాడు

అయితే అతను ప్లేటు ఫిరాయించి, తన డబ్బు నష్టపోయి దివాలా ఎత్తినట్లు కోర్టుచేత గుర్తింపు పొందాడు

విషయం తెలిసిన రామన్ నవ్వుతూ "పొరపాటున నాకు 'నోబెల్ బహుమతి' ఇచ్చారు కాని, నావంటి వాడికి టోపీ వేసిన ఈ ఆర్థిక నిపుణుడికి 'నోబెల్ బహుమతి' ఇవ్వాలి" అన్నాడట

## సామాన్యప్రజల మన్నన పొందిన లింకన్

రాష్ట్రశాసన సభకు అబ్రహం లింకన్ పోటీచేస్తూ, ఓట్లకోసం రకరకాల మీటింగుల్లో ప్రసంగిస్తూ తిరుగుతున్నాడు

ఒకసారి ఆయన అలా వెళుతుండగా దారిలో, ఓ పెద్ద బురదగుంటలో పడి బయటికి రాలేకపోయిన పందిపిల్ల అరుపు విన్నాడు

ఎవరైనా మనిషి ఆ బురద గుంటలోకి దిగి తీస్తే తప్ప, అది బయటికి రాలేని పరిస్థితి ఏమి చేయాలో తోచక అందరూ చూస్తుండగా లింకన్ ఒక్కసారి ఆ బురదగుంటలోకి దూకి, ఆ పందిపిల్లను బయటికి సురక్షితంగా చేర్చాడు

ఈ ప్రయత్నంలో ఆయన దుస్తులకు బురద అంటింది బూట్లు చేతులు మురికితో పాటు, పలుచోట్ల ఘోరంగా తయారయ్యాయి అయినా తనొకప్రాణికి బాధ విముక్తి కలిగించానన్న సంతృప్తి ఆయనకు మిగిలింది

అలాగే ఒకసారి, ఆయన ఎన్నికల పర్యటనకు వెళితే ముప్ఫయి మంది, కార్మికులు గోధుమ కంకులు కోస్తూ పొలంలో కనిపించారు

వెంటనే లింకన్, వారి దగ్గరికి వెళ్ళి వాళ్ళతో కలిసి గోధుమ కంకులు కోస్తూ "మీ వంటి రైతు ప్రతినిధుల ప్రతినిధిగా శాసనసభకు వెళ్ళటానికి నాకు, మీ ఓట్లు, మీ కుటుంబాల ఓట్లిచ్చి గెలిపించండి" అన్నాడు

తమతో కలసి, ఎంతో అనుభవజ్ఞుడిలా, గోధుమ పంట కోసిన అతని ప్రతిభను ప్రశంసిస్తూ ఆ రైతులే కాక, తక్కిన రైతులూ అతనికి ఓటువేసి విజయం సమకూర్చారు

## నాది ఏ కులమో నిర్ణయించమన్న కృపలానీ

నుదుట విభూతి రేఖలు, మధ్యలో చందనపు బొట్టు, పరిశుభ్రమైన ఖరీదైన దుస్తులు ధరించిన ఒక సేఠ్, రైల్లో భోజనం చేద్దామని టిఫిన్ తెరిచాడు.

అయితే ఎదురుగా ఆయనకు ఖద్దరు దుస్తులు ధరించిన, ఓ మధ్య వయసు వ్యక్తి కనిపించాడు ఎదురుగా ఉన్న వ్యక్తి, ఏ శూద్రుడో, అంటరానివాడో అయితే, తను అతని ముందు భోజనం చేస్తే, మైల పడిపోతామన్న భయంతో, సేఠ్ జీ "క్షమించాలి! మీదే కులమో తెలుసుకోవచ్చా?" అన్నాడు

"నాలాంటి సాధువు కులం గురించి దేనికి? అతని కుండవలసిన జ్ఞానాన్ని గురించి అడగండి" అన్నాడు, ఆ వ్యక్తి పేపరు చదువుతూ

"మీరు కాషాయాలు ధరించి వుంటే అలాగే అనుకోవచ్చు! కాని మీరు ఖద్దరు ధారి గదా?" అన్నాడు సేఠ్ జీ

"నేను ఒక కులం వాడినైతే – నా కులం చెప్పకోవచ్చు! కాని.. వృత్తిని బట్టి ఏర్పడ్డ కులాలలో, ఏదని చెప్పను?" అన్నాడు ఆ వ్యక్తి

"అయితే.. మీరు వర్ణ సంకరులా? అయితే మీ నాన్న ఏదో స్త్రీని వివాహం చేసుకొని వుంటాడు!" అన్నాడు సేఠ్ జీ

"కాదు! ఆయన ఏ తప్పూ చేయలేదు! నేనే గాంధీజీ బోధించిన ఆదర్శాల ప్రకారం – నేను ఉదయమే దొడ్డి శుభ్రం చేసుకునేప్పుడు పాకీవాణ్ణి, చెప్పులు శుభ్రం చేసుకునేప్పుడు అంటరానివాణ్ణి, గడ్డం చేసుకునేప్పుడు మంగలిని, బట్టలు ఉతికేప్పుడు చాకలిని, డబ్బులెక్కలు చూసుకుంటూ వ్రాసుకునేప్పుడు కోమటిని, కాలేజీ అధ్యాపకుడిగా

వున్నప్పుడు బ్రాహ్మణుణ్ణి ఇప్పుడు ఏది నా కులమో మీరే చెప్పండి" అన్నాడావ్యక్తి.

ఆ మహోవ్యక్తి ఆచార్య కృపలానీ అని తెలిసి, సేర్‌జీ ఆయన కాళ్ళమీద పడి క్షమించమన్నాడు

## విప్లవవాదంనుంచి 'తాత్త్వికవేత్త'గా మారిన మౌలానా అజాద్

మౌలానా అబుల్ కలాం అజాద్ అసలు పేరు మొహియుద్దీన్ అహ్మద్ వీరి పూర్వీకులు అరబ్‌కు చెందిన మక్కావాసులు. ఈయన తండ్రి ఖైరుద్దీన్ పూర్వాచారపరాయణుడు. ఆయన మౌలానాకు ఆధునిక విద్యలు, పాశ్చాత్య విద్యలు నేర్పకుండా అరబిక్, పర్షియన్, ఉర్దూ, నేర్పాడు.

కాని మౌలానా ఇంగ్లీషు నేర్చుకుని అనేక ఇంగ్లీషు గ్రంధాలు చదివి, బైబిల్‌ను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు పురాతన ఛాందస భావాలకు వ్యతిరేకంగా పాత సాంప్రదాయాల మీద పోరాడుతూ, 'అజాద్' (స్వతంత్ర) భావాలు అనే అర్ధమొచ్చే పేరు పెట్టుకున్నాడు. అప్పటినుంచి ఆయన అబుల్ కలామ్ అజాద్ అయ్యాడు.

శ్యామసుందర చక్రవర్తితో పరిచయం కావటంతో ఆయనకు విప్లవ నాయకుడైన అరవిందఘోష్ పరిచయమైంది ఆయన విప్లవవర్గంలో చేరిపోయాడు

అయితే అదృష్టవశాత్తూ అజాద్ ఇరాక్, ఈజిప్టు, సిరియా, టర్కీ, ఫ్రాన్సు, ఇంగ్లండ్ లను దర్శించటంతో, భారత ముస్లింలు చైతన్యవంతులు కావాలనే ఉద్దేశ్యంతో ఉర్దూలో 'అల్ హిలాల్' పత్రికను ప్రారంభించాడు ముస్లింలు జాతీయోద్యమంలో పాల్గొనేట్టు ప్రోత్సహించాడు

ఆంగ్లప్రభుత్వం అజాద్ ఉద్యమాలకు అడ్డుకట్ట వేయటానికి 1915లో 'అల్ హిలాల్' ప్రెస్సును స్వాధీనం చేసుకుని మూసివేసింది రెండువేల రూపాయల డిపాజిట్ కట్టమని వేధించింది మరో ప్రెస్సును 'అల్ బలాన్' పేరుతో పెడితే, ఆయనను కలకత్తా నుంచి వెళ్ళగొట్టింది బొంబాయి, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు కూడా ఆయనను రాష్ట్రాలకు రాకుండా నిషేధించాయి

1920లో గాంధీజీ దర్శనంతో, ఆయన శిష్యుడయ్యాడు 35 ఏళ్ళ వయసులో ఆయన కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. దేశ స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆయన 1958 వరకు విద్యామంత్రిగా వున్నాడు

పండితుడుగా, బహు గ్రంథ రచయితగా, తత్త్వశాస్త్రవేత్తగా ఆయన చాలా గొప్పవాడు ఆయన ఖురాన్ మీద వ్రాసిన వ్యాఖ్యానం, గత నాలుగు వందల సంవత్సరాలలో ఇస్లాంమతతత్త్వం మీద వచ్చిన గ్రంథాలన్నింటికంటే ఉత్తమమైంది

## ప్రపంచమానవులకీ వైద్యసేవలందించిన డా॥ యల్లాప్రగడ

తమ్ముడు నానాటికీ కృశిస్తున్నాడు పలుసార్లు రక్తంతో కూడిన విరోచనాలవుతున్నాయి వ్యాధి మరింత తీవ్రమైంది తాలూకా గుమాస్తాగా, అత్యంత పేదవాడైన తండ్రికి, ఆ అనారోగ్యంతో బాధపడుతున్న పిల్లవాడికి, ఇంకా ఖరీదైన వైద్యం చేయించే స్థోమిత లేదు చూస్తుండగానే ఆ పసివాడు శాశ్వతంగా కన్నుమూశాడు

"నా తమ్ముడి అనారోగ్యానికి మందే లేదా? భయంకరమైన ఈ వ్యాధికి మందు కనిపెట్టాలి నేను డాక్టరునయి ఇలాంటి వారెందరికో ప్రాణం పోయాలి" అంటూ దృఢదీక్ష బూనిన ఆ బాలుడే యల్లాప్రగడ సుబ్బారావు

ఆ యల్లాప్రగడే విద్యార్థిగా, అన్నీ ప్రథమస్థాయిలో పాసవుతూ, డాక్టరై 1922లో ఇంగ్లాండ్‌కు మెరిట్‌మీద వెళ్ళి 'స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్'లో చేరి, డిప్లొమా పొంది 1923లో అమెరికా వెళ్ళి, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో బయోకెమిస్ట్రీలో పిహెచ్‌డి పొంది, మానవకోటిని వ్యాధుల బారినుండి కాపాడే మందులను కనిపెట్టాడు

భయంకరమైన 'ట్రాపికల్ స్ప్రూ' వ్యాధికి, దివ్య ఔషధమైన 'ఫోలిక్‌యాసిడ్' అనే విటమిన్, 'ఎమైనో స్టైరీన్', 'మెనాస్టైరిన్' అనే మందులు కనిపెట్టాడు ఇవి రక్తసంబంధమైన కేన్సర్ వ్యాధికి నిరోధంగా పనిచేస్తాయి అలాగే 'పైలేరియా', 'బోధకాలు'కు మందు, 'ఇసినోఫీలియా'లో వాడే 'హెట్రజోన్' సుబ్బారావు గారి ఆధ్వర్యంలో వచ్చిన మందులే

పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్‌లకు లొంగని 'రికెట్ వ్యాధి' నివారణకు, 'ఆరియోమైసిన్' సుబ్బారావుగారు కనిపెట్టిందే అలాగే క్షయవ్యాధికి 'ఆరియో మైసిన్', 'ప్లేగు' వ్యాధికి 'టెట్రాసైక్లిన్' వీరు కనిపెట్టినవే

ఆయనకు తన ఆదాయం మొత్తం పేదలకే ఖర్చు పెట్టారు ఆయన బ్రహ్మచారిగా జీవించి, 1958 ఆగస్టు 9 వరకు, మానవసేవలోనే తన చివరి క్షణాన్నీ గడిపారు.

## విశ్వనాథను రెచ్చగొడితే, మూడవకన్ను తెరిచినట్టే!

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యన్నారాయణగారి కవితాప్రతిభకు, పాండితికి, కల్పనా వైచిత్రికి, ఆయన 'రామాయణ కల్పవృక్షం' గొప్ప ఉదాహరణ

విశ్వనాథుల వారి కీర్తి ప్రతిష్టలు చూసి కన్నెర్రగా వున్న పండితులు, కవులు పొరపాటున ఆయనను అవమానించే ప్రయత్నం చేస్తే, వాళ్ళకు సరైన సమాధానం మళ్ళీ నోరెత్తకుండా లబ్జుగా చెప్పగల ప్రతిభాశాలి, ఆయన

ఒకసారి ఒక సభలో, సభాధ్యక్షుడు "నాకు విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో దోషాలు కనిపించాయి ఫలానా పద్యాల్లో వ్యాకరణ దోషాలు ఉన్నాయి" అంటూ చెప్పాడు

ఇక విశ్వనాథ ముఖం కందగడ్డలా మారింది బుసలు పెరిగాయి పై మీది ఉత్తరీయం తీసి క్రింద పడవేసి, మైకు దగ్గరకు లాక్కొని లేచి నిలబడి, "నా రామాయణంలో వ్యాకరణ దోషాలున్నాయని ఈయన చెప్పారు అవేవీ దోషాలు కాదు. వ్యాకరణాల్లో బాల వ్యాకరణం మొదటిది. దాని తరువాత ప్రౌఢవ్యాకరణం ఉంది అధర్వణ కారికలని వున్నవి ఇంకా అవీ ఇవీ చాలా వచ్చినవి అవన్నీ చదివిన పండితులకు నా రామాయణంలో నేను వ్రాసినవి తప్పులు కావు కేవలం, బాల వ్యాకరణం మాత్రమే చదివి విరమించుకున్న వారికి ఇవి తప్పులు అనిపించవచ్చు అది వాళ్ళ కర్మ నేనేమి చెయ్యను అధ్యక్షుడు, నా శైలి క్లిష్టంగా వున్నదన్నారు నూటికి పదిపద్యాలు అర్థమవుతాయేమో అన్నాడు మా బెజవాడ కాలేజీ ఇంటర్‌మీడియట్ విద్యార్థులు, నూటికి యాభైమంది, ప్రతి పదార్థం చెప్పగలరు ఈ ఆచార్య పీఠం మీద కూర్చున్న ఆయనను గురించి నన్నింకేమి చెప్పమంటారు" అంటూ, నర్మ గర్భితంగా వాతలు పెట్టాడు

## మనవరాలితో మనువు వద్దన్న చటోపాధ్యాయ

**బహు**ముఖ ప్రజ్ఞాశాలి, మహానటుడు, కవి, రచయిత, నాట్యకారుడు, సంగీతనిధి, కళాప్రపూర్ణుడైన హరీంద్రనాధ్ చటోపాధ్యాయ, భారతకోకిల కవయిత్రి సరోజినీదేవి సోదరుడు

ఆయనకు ఆంధ్ర యూనివర్సిటీ 'కళాప్రపూర్ణ బిరుదు' ఇస్తే అది, స్వీకరించటానికి ఆయన ఆంధ్రా యూనివర్సిటీ వచ్చారు

అప్పటికే ఆయన వయసు ఎనభై దాటింది తల ముగ్గుబుట్టలా వుంది అయినా ఆయనలో ఉత్సాహం మాత్రం గొప్పగా వుంది ఆయన ఆంగ్ల ప్రసంగం విని స్ఫూర్తి పొందటానికి ఆంగ్లశాఖలో ఒక ఉపన్యాసం ఏర్పాటుచేశారు.

ఎనభై ఏళ్ళ వయసులో కూడా ఆయన ఉత్సాహంగా నిలబడి ప్రసంగాను కూలంగా హావభావాలు తెలుపుతూ, వేదిక మీద ఆవేశంగా అనర్గళంగా ప్రసంగిస్తున్నాడు.

ఇంతలో అక్కడే వున్న సి నారాయణరెడ్డి, "అలసట పోవటానికి కాస్సేపు కూర్చొని మాట్లాడకూడదా?" అన్నారు సలహా ఇస్తూ

"నాకు ఎనభై ఏళ్ళయినా ముసలివాడిననా భయం! ఇప్పుడెవరయినా అమ్మాయి ఇక్కడికి ముందుకు వస్తే నేను పెళ్ళి చేసుకోడానికి రడీ" అన్నాడు, ఆవేశంగా

ఇంతలో వేదిక ముందు వరుసలో మెరుపుతీగలా వున్న ఓ అమ్మాయి లేచి "అయితే నన్ను పెళ్ళిచేసుకోండి", అంది ధైర్యంగా

అలాంటి పరిస్థితి ఊహించని చటోపాధ్యాయ "మనవరాలితో మనువేమిటమ్మా! పరిహాసం వరకు ఫరవాలేదు! పరిణయం ఎలా?" అన్నాడు, అందరినీ నవ్విస్తూ గంభీర వాతావరణం ఒక్కసారి నవ్వులతో తేలికపడింది

## కాలిజోళ్ళ షాపునుండి ప్రొఫెసర్‌గా, బహు భాషావేత్తగా

**కాలిజోళ్ళ** షాపులో పని నేర్చుకుంటున్న కుర్రవాడు ఎంత కష్టపడి పనిచేసినా క్రిస్మస్ పండుగరోజుకు అతని చేతిలో ఎర్రని ఏగానీ లేదు

అందరిలా అతనికీ క్రిస్మస్ పండుగ చేసుకుందామని వుంది. కాని, 'డబ్బు లేనివాడు దుబ్బుకు కొరగాడు' – అనేసామెత అతని పట్ల రుజువయ్యింది మరో మార్గంలేక అతను యజమాని గల్లా పెట్టెలో నుంచి ఒక షిల్లింగు దొంగిలించి, క్రిస్మస్ పండుగను వేడుకగా చేసుకున్నాడు. అయితే తను చేసిన పాపం అతన్ని దహించివేస్తున్నది పశ్చాత్తాపంతో అతను యజమానికి తను చేసిన పాపం చెప్పి, క్షమించమని వేడుకొన్నాడు. యజమాని మంచివాడు కావటంతో అతని మాటమన్నించాడు "ఇలాంటి తప్పులు భవిష్యత్తులో ఎప్పుడూ చేయకూడదు" అంటూ మందలించాడు. తరువాత క్రీస్తు క్షమాగుణం, క్రీస్తు ఆదర్శ జీవితం, క్రీస్తు పరోపకారం, ఇతన్ని ఆకర్షించగా క్రైస్తవ మతం స్వీకరించాడు 1793లో భారతదేశానికి క్రైస్తవ మిషనరీగా వచ్చి ఇక్కడ బెంగాలీ, సంస్కృతం, ఒరియా, మరాఠీ, హిందీ, పంజాబి, గుజరాత్, కన్నడం, తెలుగు, పర్షియన్, బర్మీస్, లాంటి భాషలు క్షుణ్ణంగా నేర్చుకోవటమేకాక – బైబిల్‌ని ఈ భాషల్లోకి తర్జుమా చేశాడు. తరువాత ఇంకా చాలా భాషలు నేర్చుకుని, నలభై భాషల్లోకి బైబిల్‌ను తర్జుమా చేసిన ఏకైక వ్యక్తి విలియం కెరీ.

కలకత్తాలో ఫోర్టు విలియం కళాశాల స్థాపించినపుడు, సంస్కృతం, మరాఠీ, బెంగాలీ భాషలకు ప్రొఫెసర్‌గా ఎవరిని నియమించాలి, అని వెల్లస్లీ వైస్రాయ్‌గా, డేవిడ్ బ్రౌన్‌ని ఇంకా దేశవ్యాప్తంగా ప్రముఖ పండితులను సంప్రదించాడు అందరూ ముక్తకంఠంతో "విలియమ్ కేరీ" ఆ పదవికి తగినవాడని, ఏకగ్రీవంగా అంగీకరించారు

అలా స్వయంకృషితో – పన్నెండేళ్ళ వయసులో చదువు ఆగిపోయి కాలిజోళ్ళ తయారీ షాపులో పనికి కుదిరిన "కేరీ" స్వయంశక్తితో ప్రొఫెసర్ అయి, నలభయి ఏళ్ళు భారతదేశంలోనే వుండి – మొదటి వార్తాపత్రిక – 'సమాచార్ దర్పణ్'ను బెంగాల్‌లో ప్రారంభించి, 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' అనే ఆంగ్లపత్రికను స్థాపించి, సహగమనం, శిశుహత్యలు, కన్యాశుల్కాలు, వితంతువుల దీనస్థితిని మార్చాలని అనేకవ్యాసాలు వ్రాసేవాడు మూఢ విశ్వాసాలు పోయి నవసమాజ నిర్మాణానికి ఆయన ఎంతో కృషిచేశాడు

★ ★ ★